పద్మభూషణ్

# చిరంజీవి

## విశిష్ఠ వ్యక్తి - చైతన్య స్ఫూర్తి

సి. శ్రీకాంత్ కుమార్

© Publisher
Frist Edition : 22nd Aug. 2006
Printed at : Bhavana Offset Printers
Price : Rs. 200.00



ఋషి బుక్ హౌస్
14-11-14/1, అచ్యుతరామయ్య వీధి,
హనుమాన్‌పేట, విజయవాడ - 520 003.
ఫోన్ : 0866 2579190.



Blessed by
**GRAND MASTER CHOA KOK SUI**



Master
**DAVID VIJAY KUMAR**

## నా అనుబంధం ...

శ్రీకాంత్ కుమార్ మదనపల్లిలో ఉండగా తరచు కలిసి సాహితీ చర్చలు జరిపేవాళ్ళం. తెలుగు కథలను, నవలలను గూర్చి ఏ చర్చ వచ్చినా ప్రతి కథమీద, నవలమీదా పెద్ద కమాండ్‌లో విశ్లేషించేవాడు తను. చాలామంది రచనలు చాల చదివాడు అతడు.

నా రచనల మీద పెద్ద మనుష్యులు పక్షపత్రికలో మంచి సమీక్షలు వ్రాశాడు వరుసగా. ఆ విషయంలో అతనికి సర్వదా కృతజ్ఞుడ్ని!

సమీక్షలు, కవితలు వ్రాయడం మంచి ఫోటోలు తీయడం అప్పటికి అతని ప్రవృత్తి. తను అప్పటికి వ్రాసిన కవితలలో నేనెప్పటికీ మరచిపోలేని కవిత "నన్ను నేను హత్యచేశాను!" మనుష్యులకు అంకితమివ్వబడ్డ ఆ కవిత చాల శక్తివంతమైనది.

నన్ను అనేక ప్రదేశాలలో అనేక కోణాలలో చాల ఫోటోలు తీశాడు. అవి అమూల్యమైన జ్ఞాపకాలు నిజానికి.

హైదరాబాదు చేరాక చాల ఎదిగాడు. చాల వ్రాశాడు... చాల పుస్తకాలు ప్రచురించాడు. వాటిలోనూ నన్ను గూర్చి చాల వ్రాశాడు. ఇదీ మా ఇద్దరి మధ్యనున్న బంధం.

ఇక మా అభిప్రాయాలూ, భావాలు విషయానికి వస్తే సమాంతర రైలుపట్టాల లాగా అవి కలవవు. కలిసినట్లనిపిస్తాయంతే!

అయితే మాత్రమేం.. మా మధ్యనున్నది సృష్టిలో తీయనిది.

అతని ఈ ప్రయత్నం విజయవంతం కావాలని ఆకాంక్షిస్తూ ...

టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి.
కథ, నవలా రచయిత
మదనపల్లి, చిత్తూరు జిల్లా.

## శుభాభినందనలతో ...

C. Kusuma Kumari
(శ్రీమతి సి. కుసుమకుమారి)

C. Madhavi
(శ్రీమతి మాధవి)

[signature]
(కె. నాగేశ్వరరావు)

K. YOGI
(కె. యోగీశ్వరరావు)

[signature]
(ఆర్.ఎన్. విజయకుమార్)

[signature]
(సి. వెంకటరమణ)



## "సుదర్శనం, నిత్యధర్మ సందర్శనం"

"నిత్యం కళా తపస్వీత్వం
కార్యదక్షస్సుధీప్రియః
శుభం భూయాత్ సదా, తేవై
సుదర్శన మహోదయ
శ్రీకాంతఃఖలు మేధావీ
సుధీమానం భవిష్యతి
దద్యాత్ తస్మై జయం వాణీ
ధ్రువం సర్వేషు సర్వదా
భవేత్ జీవితం రమ్యం
సర్వ సౌభాగ్యం నిర్భరం
పన్థాస్తవ శివో భూయాత్
శివారక్షతు సర్వదా!!"

కవిచంద్ర, సాహిత్యరత్నాకర
- ఆచార్య కనుమలూరు వెంకట శివయ్య
ఎం.ఏ.లిట్, ఎం.ఎస్సీ, ఎల్.ఎల్.బి., ఐ.ఏ.ఎస్ (రిటైర్డ్), హైదరాబాదు

# అంకితం

## ఆ ఇద్దరికీ...



కీ॥శే॥ పద్మశ్రీ డా॥ అల్లు రామలింగయ్య గారు

రా : 1-10-1922

పో : 31-7-2004

ధర్మనిరత కీ॥శే॥ సి. సుదర్శనం

రా : 22-8-1946

పో : 24-9-2005

ఒకరు నన్ను ప్రోత్సహించి, ప్రేమించి ఆశీర్వదించిన అభిమాన హాస్యనటులు, మానవతావాది, స్వాతంత్ర్య సమరయోధులు పద్మశ్రీ కీ॥శే॥ డా॥ అల్లు రామలింగయ్యగారు...

మరొకరు నాకు జన్మనిచ్చి పెంచి పెద్ద చేసి, నా పరోక్షంలో అమితంగా నన్ను ప్రేమించి కన్న ఋణం నేను తీర్చుకునేలోపే కపాల మోక్షం కోసం తొందర తొందరగా (వెళ్ళిపోయిన) శివసాయుజ్యం పొందిన నా తండ్రి, సాంస్కృతిక పరి (శివైక్యమొందిన) రక్షకుడిగా, కళాపోషకుడిగా ఆంధ్రదేశానికి చిరపరిచితులైన ధర్మనిరత కీ॥శే॥ చిల్లగట్టు సుదర్శనంగారు... వారి పవిత్రాత్మలకు నివాళిగా... ఆ ఇద్దరికీ ఈ చిన్ని పొత్తం, దత్తం.

– సి. శ్రీకాంత్ కుమార్

## "లక్ష్యసాధన పట్ల చిత్తశుద్ధి ఉన్నవారికే భగవంతుని కరుణ ఉంటుంది"

'దృశ్యం కట్టిపడేస్తుంది, అక్షరం ఆలోచింపజేస్తుంది'. పద్మభూషణ్ మెగాస్టార్ శ్రీచిరంజీవిగారి చిత్రాలు సినీ ప్రేక్షకులకు సుపరిచితాలు... అయితే వాటిలోని విశేషాల్ని గుది గుచ్చి పాఠకులకందించే ప్రయత్నం చెయ్యాలనిపించినపుడు ఋషి బుక్ హౌస్ అధినేత శ్రీ పవన్‌కుమార్‌గారు బావుంటుందని భరోసా ఇచ్చారు. ఆ క్రమంలో 2006 ఏప్రిల్ 23వ తేదీన యావత్ తెలుగు సినీ పరిశ్రమా పద్మభూషణ్ పురస్కార గ్రహీత మెగాస్టార్ చిరంజీవిగారిని సత్కరించిన శుభసందర్భంగా ఏర్పాటైన కార్యవర్గంలో నేను కూడా ఉండడం మరచిపోలేని అనుభూతి, ఆ సమయంలో చిరంజీవిగారిపై ఒక లఘుచిత్రాన్ని నలభై నిముషాల నిడివితో ప్రదర్శించాలనుకుని కొన్ని అంశాల్ని వ్రాయడం, అవి గౌ॥ శ్రీ చిరంజీవిగారి దృష్టిలో పడడం, ఆయన చిన్న చిన్న తప్పుల్ని సవరించడం జరిగింది, అయితే సమయాభావం వలన ఆ లఘు చిత్రాన్ని సత్కార సభలో ప్రదర్శించలేదు, ఆ లఘుచిత్రం తయారు చేసే క్రమంలో చిరంజీవిగారి చిత్రాలన్నిటిని పరిశీలనాత్మక దృష్టితో చూసి వాటిల్లోంచి విశేషాల్ని పట్టుకోవడంతో ఈ 'చిరుకానుక ''చిరంజీవి ఒక వెండితెర స్ఫూర్తి''గా పాఠకాభిమానులకందించడానికి సాధ్యమైంది. అలా చిరంజీవిగారి పద్మభూషణ్ సత్కారసభ ఈ పుస్తక సృష్టికి ప్రేరణ. ఆ కార్యక్రమం కోసం దాదాపు చిరంజీవిగారి దర్శక నిర్మాతలందరితోను కలసి మెలసి ఉండగలగడం, సంభాషించడంతో ప్రతి చిరంజీవిగారి చిత్రానికి ఏదో ఒక విశేషం ఉంటూనే వచ్చిందన్న సంగతి అర్థమైంది.



చిరంజీవి ఒక విజేత కథ, చిరంజీవి శిఖరదర్శనం గ్రంథాల్ని పాఠకలోకానికి అందించిన 'ఋషి బుక్ హౌస్' అధినేత శ్రీ ఆకుల పవన్‌కుమార్‌గారే దీని ప్రచురణకీ పూనుకోవడం మరింత ఆనందాన్నిస్తోంది, ఒక విధంగా మా కలయికలో ఇది 'హ్యాట్రిక్' అని చెప్పొచ్చు.

తొలుత మనిషి సంఘజీవి, తర్వాత ఆశాజీవి, ఇప్పుడో స్వార్థజీవి... అయితే ఏ స్వార్థమూ లేకుండా ఇటువంటి పుస్తకాలు అందుబాటులోకి మరిన్ని రావాలనే చిరు ఆశతో చేసిన చిరు ప్రయత్నం ఇది. 'చిరంజీవి ఒక విజేత కథ' చిరంజీవిగారి బాల్యంతో మొదలై మెగాస్టార్‌గా అధిరోహించిన ఉన్నత శిఖరాల వరకూ చర్చిస్తే, 'శిఖరదర్శనం' మనోవికాస వ్యక్తిత్వాన్ని విశ్లేషిస్తుంది... మరి ఈ చిరంజీవిగారి చిత్రాల

విశేషాలు, విజయాలు వీటిని కూలంకషంగా వివరించింది. అవసరమా? అని ప్రశ్నించే వారికి నాదో విన్నపం... చరిత్రలో కరిగిపోయిన కథలెన్నో ఉన్నాయి, కాలగర్భంలో కలసిపోయిన అద్భుత గాథలింకెన్నో ఉన్నాయి, చిరంజీవిగారు యువతరం పాలిట ఒక మణిదీపం, ఆశల కేంద్రం. చిరంజీవిగారి స్ఫూర్తితో తమ జీవన గమనాన్నే మార్చుకున్నవాళ్ళు, కష్టపడ్డం మొదలుపెట్టిన వాళ్ళు, సేవా పథంలోకి మళ్ళిన వాళ్ళు ఇలా ఎందర్నో నా కళ్ళారా చూశాను... ఒక వ్యక్తి సమధికోత్సాహంతో, వ్యవస్థీకృతసరళితో శక్తి స్వరూపుడిగా మారితే అతని ప్రభావం ఇంతుంటుందా? అనిపించిన ఈ తరం తెలుగువెలుగు, కళామతల్లి అందివచ్చిన సేవాజ్యోతి పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారు....

భారతదేశంలో భూకంపాలు వచ్చాయి, సునామీలు వచ్చాయి, మరెన్నో ఉపద్రవాలు వచ్చిపడ్డాయి, మన రాష్ట్రం నుండి తక్షణం స్పందించి సహాయక చర్యలు, ఆర్థిక వనరులు బయలుదేరేది చిరంజీవిగారి దగ్గర్నుంచే.... భారత ప్రభుత్వం 'కళల విభాగం' నుండి మెగాస్టార్ చిరంజీవిగారికి 'పద్మభూషణ్' పురస్కారం ప్రకటించాక చిరంజీవిగారి చిత్రాలపై ఒక 'సూచి'లా ఈ పుస్తకం ఉపకరిస్తుందనే నమ్ముతున్నాను.

'చిరంజీవి ఒక విజేత కథ'ని చిరంజీవిగారి తల్లిదండ్రులకు, 'శిఖరదర్శనం' తల్లిదండ్రి గురువు దైవం చిరంజీవి అంటూ అంకితమివ్వడం జరిగింది, ఈ పుస్తకాన్ని కీ॥శే॥ పద్మశ్రీ అల్లు రామలింగయ్యగారికి, మా నాన్నగారికి కలిపి అంకితమిస్తున్నాను.

ప్రయత్నం ఆగిపోకూడదు, ఎవరో ఒకరు కొనసాగిస్తూనే ఉండాలి.

చిరంజీవిగారు చిత్ర సీమలోకి ప్రవేశించే నాటికి, ప్రవేశించాక కూడా ఎందరో కళాకారులు వచ్చారు, అయితే చిరంజీవిగారినే అత్యధిక సంఖ్యాకులైన ప్రేక్షకులు ఎందుకు అభిమానిస్తున్నారు? ఆయన పిలుపుమేరకు సేవా కార్యక్రమాల్లో ఎందుకు పాల్గొంటున్నారు? లక్ష్యసాధన పట్ల చిరంజీవిగారికున్న చిత్తశుద్ధే ఆయన స్థాయికి కారణం. "లక్ష్యసాధన పట్ల చిత్తశుద్ధి ఉన్నవారికే భగవంతుని కరుణ ఉంటుంది."

ఇందులో నా కృషో, మేధస్సో, ఇంకోటో ఉందనీ, ఉంటుందనీ నేననుకోవడం లేదు, ఎందుకంటే మా నాన్నగారు ఒకసారి నాతో ఇలా చెప్పారు. "గాడిద బరువు మోస్తూ ఆ బరువుకు కారకుడైన యజమానిని కాళ్ళతో తన్నాలనుకుంటుందట, తీరా యజమాని దాని కాళ్ళను తాళ్ళతో కట్టేటప్పుడు యజమానే నా కాళ్ళు పట్టుకుని కడుతున్నాడే, నేను కర్మజీవిని, యజమాని చేసిన తప్పేమిటి? ఈ జన్మలో గాడిదగా పుట్టాను నా కర్మనాది" అనుకుంటుందట అందుచేత "గాడిద కర్మ జ్ఞాని".

కుక్కకు గతజన్మ, రాబోయే జన్మ కూడా తెలుసు, అంటే మూడు జన్మలను తెలుసుకున్నా మనిషి పట్ల విశ్వాసంతో మెలుగుతూ, వారికి శుభాలు కలగాలని తపన పడుతూంటుంది కాబట్టి 'కుక్క బ్రహ్మ జ్ఞాని' లోకాన్ని పరిపాలించే శివుడు సకల జీవ కోటికి రాత్రులందు మూడు ఝాముల్లో కావలసిన జీవశక్తికై కేటాయించే ఘడియలను తెలియచేసేది కోడి, కాబట్టి 'కోడి కాలజ్ఞాని'.

చీమ చిన్నదైనప్పటికీ ఎక్కడ ఏ తీపి వస్తువు దాచినా దాన్ని తన చిత్తజ్ఞానంతో కనిపెట్టి ముట్టడిస్తుంది కాబట్టి 'చీమ చిత్తజ్ఞాని'. దేనికి బానిసైతే దానికి బానిసౌతూ జ్ఞాన ముండి కూడా అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతుంటాడు కాబట్టి 'మనిషి అజ్ఞాని'.

"గాడిద కర్మజ్ఞాని, కుక్క బ్రహ్మజ్ఞాని, కోడి కాలజ్ఞాని, చీమ చిత్తజ్ఞాని, మనిషి అజ్ఞాని" ఎంత తెలుసుకున్నా, ఏమి సాధించినా మనిషి అజ్ఞానే. ఎప్పటిలాగే ఈ పుస్తక రచనలోనూ నన్ను ప్రోత్సహించిన కుటుంబ సభ్యులు తాతయ్య శ్రీ చిల్లగట్టు వెంకటరమణగారికి, అమ్మ శ్రీమతి కుసుమకుమారి, చెల్లెళ్ళు మాధవి, భువనేశ్వరి, బావగారు కె. నాగేశ్వరరావు, మేనల్లుడు చి॥ కె. యోగీశ్వరరావు, మేనకోడలు చి॥ తోషా పద్మప్రియ, ఎప్పుడూ నా ఉన్నతిని కాంక్షించే మామయ్య శ్రీ ఆర్.ఎన్. విజయ్‌కుమార్‌గారు, ఆత్మీయులు శ్రేయోభిలాషులు శ్రీయుతులు వి.వి.వి. సుధాకరనాయుడు, అచ్చా సుధాకర్, రాయల సుధాకర్, దర్శక రచయిత మదన్‌గార్లు వీళ్ళందరికీ నా కళాంజలులు.

రాష్ట్ర చిరంజీవి యువత సారథీ, సచివుడూ గౌ॥ శ్రీ ఆర్. స్వామినాయుడుగారందించిన సహకారం, యువత అధ్యక్షులు గౌ॥ శ్రీ సి.హెచ్. వెంకటేశ్వరరావుగారి ప్రోత్సాహం ఎప్పటికీ మర్చిపోలేను.

ఈ పుస్తకాన్ని కూడా సర్వాంగ సుందరంగా అత్యంత నాణ్యమైన ప్రమాణాలతో వెలువరించడానికి శక్తివంచన లేకుండా కృషి చేసిన ఋషి బుక్ హౌస్ అధినేత శ్రీ ఆకుల పవన్‌కుమార్‌గార్ని మనస్ఫూర్తిగా అభినందించకుండా ఉండలేను.

మొదట్లో వ్రాసినట్టు ఈ పుస్తకంలోని అక్షరాలు మిమ్మల్ని ఆలోచింపజేసినా దృశ్యాలు (ఛాయా చిత్రాలు) కట్టిపడేసినా ఆ ఘనత పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారిదే.....

కళాభివందనములతో
భవదీయుడు
సి. శ్రీకాంత్‌కుమార్

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మన మెగాస్టార్ చిరంజీవికి పద్మభూషణ్



జనం గుండెల్లో
జనుల జీవితాల్లో

# చిరంజీవి

★ ★ ★

రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నగరంలోని పంజగుట్ట క్రాస్ రోడ్స్, అత్యంత ఆధునిక పోకడలతో వెలసిన "హైద్రాబాద్ సెంట్రల్", సినిమా చూసి ఆటోకోసం ఎదురు చూస్తున్న నా ముందు ఆటో వచ్చి ఆగింది, అది ఆటోలా లేదు, ఏదో పెళ్ళి వారి పల్లకీలా, విజయయాత్ర చేయడానికి వెళ్ళే రథంలా ఉంది, రంగు రంగుల రిబ్బన్లు, ఆటో వెనక 'మెగాస్టార్ చిరంజీవి' అని పెయింట్ చేసిన అక్షరాలు, 'మదర్ థెరిస్సా' బొమ్మ, ఆటో ఎక్కగానే అటూ ఇటూ చిరంజీవి ఫోటోలు 'ఇంద్ర', 'ఠాగూర్' సినిమాల్లోవి. నా చూపులను పట్టుకున్న ఆటోవాలా ఆటోని రయ్యిన ముందుకుపోనిచ్చి "నేను మెగాస్టార్ వీరాభిమానిని సార్" అన్నాడు, అతణ్ణి ఉడికిద్దామనుకుని "మరి చిరంజీవిగారు బ్లడ్ బ్యాంక్, ఐ బ్యాంక్ స్థాపించి సేవ చేస్తున్నారు, నువ్వేం చేస్తున్నావయ్యా" అడిగాన్నేను.

"నేనూ సేవ జేస్తున్నాను సారూ" అన్నాడు "ఎలాంటి సేవ" అన్నాన్నేను నవ్వుతూ, ఆటోవాలా కూడా నవ్వాడు కానీ ఎలాంటి సేవో చెప్పలేదు, ఆటో కొంచెం దూరం వెళ్ళాక దారిలో ఓ గ్రుడ్డివాడు కుంటివాడు రోడ్డు దాటడానికి ప్రయత్నిస్తున్నారు, నేనెక్కిన ఆటో ఆగింది వాళ్ళ ముందు, ఆటోవాలా వాళ్ళెక్కడికి వెళ్ళాలో అడిగి 'మనమూ అటువైపే కదసార్' అన్నాడు నేను కళ్ళతోనే నా అనుమతిని తెలిపాను, నేను మాట్లాడలేకపోతున్నాను, గ్రుడ్డివాడు నా ప్రక్కన కూర్చున్నాడు, కుంటివాడు ఆటోవాలా ప్రక్కన కూర్చున్నాడు, ఆటో దూసుకుపోతోంది. కుంటివాడు ఆటోని పరిశీలించి ఆటోవాలాతో మాటలు కలిపాడు, "ఆటోవాలా, గ్రుడ్డివాడు, కుంటివాడు" ముగ్గురూ చిరంజీవిగారి వీరాభిమానులు కావడం నన్ను ఆశ్చర్యానందాలకు లోను చేసింది, గ్రుడ్డివాడు క్రమం తప్పకుండా చిరంజీవిగారి సినిమాలు 'చూస్తాడు' sorry వెళ్ళి థియేటర్లో కూర్చుని 'విని' ఆనందిస్తాడట, తనే చెప్పాడు మళ్ళీ తనే మాట్లాడుతూ "నేను పుట్టుగ్రుడ్డివాణ్ణిసార్, లేకపోతే ఎప్పుడో చిరంజీవి ఐ బ్యాంక్ నుండీ కళ్ళు పెట్టించుకునేవాణ్ణి, పుట్టుగ్రుడ్డివాళ్ళకు ఆ అవకాశం లేదు కదాసార్, నాకు లేకపోతే ఏం? ఎంతో మందికి మా మెగాస్టార్ సారు కళ్ళదానం జేస్తున్నాడు గది జాలు జన్మకి, అసంటోళ్ళు దేవుళ్ళతో సమానం సార్ దేవుళ్ళతో" అతనింకా మాట్లాడుతూనే ఉన్నాడు, ఉత్సాహం పట్టలేక ముందు కూర్చున్న కుంటివాడు బిగ్గరగా గొంతెత్తి పాడ్డం మొదలుపెట్టాడు "కొడితే కొట్టాలిరా సిక్స్ కొట్టాలీ, ఆడితే ఆడాలిరా రప్ఫాడాలీ"....



ఆటో వేగం మరింత పెరిగింది, నా హృదయం ఆనందంతో నిండిపోయింది, నా కళ్ళకి సన్నటి కన్నీటి పొర అడ్డు వచ్చింది, "దేవుడా జన్మజన్మలకీ చిరంజీవిని చిరంజీవిగానే పుట్టించు తండ్రీ".

మొన్న స్థానిక ఎన్నికల్లో 'పీలేరు' జెడ్‌పిటిసిగా మా వదిన పోటీ చేశారు, కౌంటింగు 'మదనపల్లెలో' నేనూ వెళ్ళాను, పద్దెనిమిదేళ్ళ ప్రాయం కుర్రాళ్ళు అందరూ వరుసకి తమ్ముళ్ళు, బావమరుదులూ అవుతారు, వాళ్ళ మధ్య పలకరింపులు 'జై చిరంజీవ' "జై జై చిరంజీవ", విని అడిగితే "హలో టాటా, బైబై ఎప్పుడో మర్చిపోయాం బావా ఇప్పుడంతా జై చిరంజీవ, జైజై చిరంజీవా" అన్నాడు మా మరిదొకడు, "ఏం ఈ స్టైలు నీకు నచ్చలేదా అన్నయ్యా" అన్నాడు వరుసకు మా తమ్ముడు, నచ్చకపోవడమేమిటి?!

'జై చిరంజీవా' ఎంత చక్కటి పలకరింపు!!! మనసు పులకరించిపోయింది.



చిరంజీవి ఒక విజేత కథ, చిరంజీవి శిఖరదర్శనం తర్వాత మరో మంచి ప్రయత్నం ఋషి ప్రచురణల కోసం చేశాను, ఆ పుస్తకం ప్రచురణ నిమిత్తమై విజయవాడ వెళ్ళాను, సరదాగా సిటీబస్ ఎక్కాను దుర్గగుడికి వెళ్ళడానికి... బస్సు డ్రైవర్ సీట్ ముందు ఫ్రేమ్ కట్టిన దేవతామూర్తులు కాణిపాకం వినాయకుడు, ఏడుకొండల వెంకటేశ్వరస్వామి, అమ్మలగన్నయమ్మ దుర్గమ్మ తల్లి. లక్ష్మీ సరస్వతులు, తర్వాత "చిరంజీవి ఫోటో". ఓ పెద్దావిడ కొండమీద బస్సు దిగుతూ "ఏంటబ్బాయ్ దేవతల పక్కన ఆ కుర్రాడి ఫోటో" అడిగింది డ్రైవర్ని "మా మెగాస్టార్ మాకు దేవుడమ్మా" అంటున్నాడు డ్రైవర్, గర్వంగా నవ్వుతూ ఔనని తలాడిస్తున్నాడు కండక్టర్, "మీకు దేవుడు... నాకు నా పెద్దకొడుకు లాంటివాడు చిరంజీవి" అందావిడ, ఆశ్చర్యపోవడం మా వంతైంది, వయస్సు, తరాల అంతరాలు, హోదా, కులం, ప్రాంతం, మతం, లింగ భేదం ఇలాంటివేవీ లేవు చిరంజీవిని అభిమానించ డానికి!!!





మాదాపూర్ హైటెక్‌సిటీ, సంపన్నులు మాత్రమే నివసించగలిగే అపార్ట్‌మెంట్స్, నా స్నేహితుడు కిరణ్‌ని చూసి చాలా రోజులైంది, పలకరిద్దామని వెళ్ళాను, కిరణ్ కొడుక్కి ఆరేళ్ళుంటాయి, వాణ్ణి పిలిచి ఏ స్కూలు ఏ క్లాసులాంటి వివరాలు మొదలుపెట్టాను, ఇంతలో మా కిరణ్ స్నానం ముగించి వస్తూ "రేయ్ అంకుల్‌కి డ్యాన్స్ చేసి చూపించు, చిరంజీవి స్టెప్పులు అదరగొడతాడు, ఏదీ ఆ వీణ స్టెప్పువెయ్", తండ్రి ఆజ్ఞను శిరసావహిస్తూ మా వాడి కొడుకు డ్యాన్స్ చేయడం మొదలుపెట్టాడు "దాయి దాయి దామ్మ కులికే కుందనాల బొమ్మ" అంటూ మెలికలు తిరిగిపోతున్నాడు, అలా గుడ్లప్పగించి చూస్తున్నాను నేను.

"మా వాడు చిరంజీవిలా డ్యాన్స్ చేస్తాడు" అని గర్వంగా చెప్పుకోవడం ఇవాల్టి 'స్టేటస్ సింబల్స్'లో ఒకటిగా చేరింది.



మా మేనల్లుడు మొన్ననే ఊరెళ్ళిన సందర్భంలో 'గద' ఒకటి కావాలని అడిగాడు 'గద' దేనికి? కత్తులు, తుపాకులు, విల్లమ్ములు ఇంకా ఎలక్ట్రికల్ టాయ్స్ ఎన్నో ఉన్నాయి కదా 'గద' ఎందుకు కావాల్సి వచ్చింది అడిగాన్నేను, మాట్లాడలేదువాడు, తిన్నగా లోపలికి వెళ్ళి 'మెగాపవర్' పట్టుకొచ్చాడు, ముఖచిత్రం చిరంజీవి ఆయన చేతిలో 'గద', ఆయన పక్కనే బాల ఆంజనేయుడు. 'హనుమాన్' యానిమేషన్ చిత్రానికి తన స్వరాన్నే కాక 'పబ్లిసిటీ' నిమిత్తం చిరంజీవి బాల ఆంజనేయుడితో ఉన్న స్టిల్సు అన్ని పత్రికల్లో వెల్లువెత్తాయి, దాని ప్రభావం... నేను హైదరాబాద్ వచ్చి తిరిగి ఊరెళ్ళే ముందు బొమ్మల దుకాణానికి వెళితే 'హనుమాన్' చిన్ని చిన్న "గదలు" విపరీతంగా అమ్ముడౌతూ కన్పించాయి, నేనూ కొన్నాను, ఒకటి కాదు రెండు....

★ ★ ★

"ఏరా కన్‌ఫర్మ్ అయిందా"

"లేదురా"

"లేదా?"

"ఔను అవతలి పార్టీ ఇంకొంచెం ఎక్కువ ఆఫర్ చేశార్ట".

"చేస్తే"

"వాళ్ళకి కన్‌ఫర్మ్ అయ్యిందిరా బొమ్మ".

''బొమ్మ మనకే కన్‌ఫర్మ్ అయితే అమ్మాయి పెళ్ళి చేసేద్దామనుకున్నాన్రా ఈసారి".

టీ తాగుతూ ఇరానీ హోటల్లో వాళ్ళ సంభాషణ వింటున్న నేను ఉత్సుకత ఆపుకోలేక అడిగాను.

"మీరు మాట్లాడుకుంటున్నది 'సినిమా' గురించే అయితే మీరు ఎవరు? ఏంటి కథ" అని...

"మేము మాట్లాడుకుంటున్నది చిరంజీవి కొత్త సినిమా 'స్టాలిన్' ఏ థియేటర్‌కి కన్‌ఫర్మ్ అయ్యిందీ అనే విషయం, ఇంతకీ మేం 'సైకిల్ స్టాండ్' లీజుకి తీసుకుంటాం థియేటర్లలో" వాళ్ళ సమాధానం... సైకిల్ స్టాండ్ నడుపుకునేవాడు తను లీజు పాడుకున్న థియేటర్లో చిరంజీవి కొత్త సినిమా విడుదలైతే కూతురి పెళ్ళి చేసేద్దామనుకుంటున్నాడు. 'ఎకనామిక్స్'కి అర్థమే మారిపోయింది.

★ ★ ★

2006 ఏప్రిల్ 23వ తేదీ ఆదివారం యావత్ తెలుగు సినీ పరిశ్రమా పద్మభూషణ్ పురస్కారం అందుకున్న మెగాస్టార్ చిరంజీవిని సత్కరిస్తోంది, ముందు వరుసలో మెగాస్టార్ చిరంజీవి, శ్రీమతి సురేఖ, వీరితోపాటు చిరంజీవి సరసన నటించిన కథానాయికలు, ఎందరో నటీ నటులు, సాంకేతిక నిపుణులు... వీళ్ళలో 'హీరోయిన్స్' చిరంజీవి సరసన 'చోటు' సంపాదించి ఫోటోలు దిగడానికి ఆపసోపాలు పడుతుంటే, సాంకేతికులు, సహనటులు కరచాలనం చేసి అభినందనలు తెలపడానికి ఉత్సుకత చూపుతున్నారు, వినయంతో వందనంతో చిరు మందహాసం చేస్తూ అణకువతో ఒదిగిపోతూ. 'చిరంజీవి' ఇంతలో సాంస్కృతిక కార్యక్రమాల్లో భాగంగా "వికలాంగులు" చిరంజీవి ముందు నెమళ్ళను మరిపిస్తూ నాట్యం చెయ్యడం మొదలుపెట్టారు, నాట్య ప్రదర్శన ముగియగానే చిరంజీవి అమాంతం ఒక్క ఉదుటున అలాగే వేదిక పైకి ఎక్కి ఆ వికలాంగుల్ని ఆలింగనం చేసుకుని ఆనందంతో, బరువెక్కిన హృదయంతో కంట తడిపెట్టారు... జనులకి తాను మెగాస్టార్ అయితే తనకి తాను మెగాస్టార్‌గా చిరంజీవి ఏనాడూ ఆ భావనని దరిచేరనీయలేదు, తర్వాత "వికలాంగులు సైతం నాట్యం చేయగలిగారంటే, వారి చేత అలా నాట్యం చేయించిన శక్తి పేరు చిరంజీవి" అని పవన్‌కళ్యాణ్ పేర్కొనడం 'కొసమెరుపు'.

★ ★ ★

చిత్ర పరిశ్రమలో ఇరవైనాలుగు శాఖలున్నాయి.... హైదరాబాద్‌లో ఉంటున్నాను కాబట్టి పరిశ్రమలోని శాఖలలో ఎవరో ఒకరు పరిచయమైన వాళ్ళు ఉండనే ఉంటారు... ఏ శాఖలో క్రొత్త ముఖం కనిపించినా వాళ్ళు చెప్పే మాట ఒక్కటే "ఈ రంగంలోకి రావడానికి ఇన్‌స్పిరేషన్ మెగాస్టార్ చిరంజీవి... ఎవరూ లేకుండా, తానొక్కడే సాధించిన సక్సెస్, చేరుకున్న హైట్స్ ఇవే మాకు స్పిరిట్, ఒక్కసారి ఆయన్ని చూస్తే చాలు, కలసి ఫోటో దిగితే చాలు".

"ఫోటో దిగొచ్చుగా" నేను.

"బ్లడ్ డొనేట్ చెయ్యాలిగా" క్రొత్త ముఖం.

"చెయ్యొచ్చుగా" నేను.

"మొన్న చిరంజీవి బ్లడ్ బ్యాంక్‌కి వెళ్ళాను, కరెక్ట్‌గా నలభై నాలుగు కిలోలే ఉన్నాను, ఇంకో ఐదారు పెరిగితేగానీ బ్లడ్ తీసుకోర్టగా"

"అందుకని"

"అందుకని బరువు పెరగడానికి ప్రయత్నాలు మొదలుపెట్టాను, పెరిగాక బ్లడ్ ఇచ్చి, తర్వాత చిరంజీవిగార్తో ఫోటో దిగుతాను".

"అంతేనా"

"ఔను మరి. నేను బ్లడ్ డొనేట్ చేస్తే ఇంకొకరి ప్రాణాన్ని అది కాపాడుతున్నప్పుడు... ఏదైనా మంచి పని చేసి నన్ను కలవండని చిరంజీవిగారు అంటున్నప్పుడు మా మెగాస్టార్ పాలసీయే కరెక్ట్ పాలసీ..." ఈ సంభాషణ పూర్తయ్యాక నాకో పాట గుర్తొచ్చింది "ఎంత ఎత్తు ఎదిగావయ్యా, ఎదను మించి ఎదిగావయ్యా!!!" చిరంజీవి 'విజేత' సినిమాలోనిది.



★ ★ ★



"మేక్ ఏ విష్ ఫౌండేషన్"

ఇటీవలి కాలంలో చిన్నారులకు గుండెజబ్బులు అధిక మయ్యాయి, ఆపరేషన్‌కు ముందో, ఆపరేషన్ విజయవంతమయ్యాకో 'చిన్నారి' కోరే కోరికని తీర్చే సంస్థగా మేక్ ఏ విష్ ఫౌండేషన్ పని చేస్తోంది. ఓ పదేళ్ళ పాపకి గుండెకి ఆపరేషన్ అయి కోలుకుంది, ఆ పాప కోరిక చిరంజీవిగారిని చూడాలని. 'మేక్ ఏ విష్ ఫౌండేషన్' వారు ఆ పాప కోర్కెని తీర్చారు, జూబ్లీహిల్స్ చిరంజీవిగారి ఇల్లు, చిరంజీవిగారు, సురేఖగారు, పిల్లలు, నాగబాబుగారు అందరూ ఆ పాపతో మాట్లాడారు, ఫోటోలు దిగారు, ఆ పాప ఆనందానికి అంతులేదు... తిరిగి వెళ్ళేటప్పుడు మేక్ ఏ విష్ ఫౌండేషన్‌వారు ఒక మాట చెప్పారు "ఇటువంటి పిల్లలు చాలామంది కోరుతున్న కోరిక ఒక్కటే చిరంజీవిగారిని చూడాలని".

★★★

చిరంజీవి బ్లడ్ బ్యాంక్, ఒక శనివారం సాయంత్రం, "ఫోటోసెషన్."

రక్తదాతలందరూ ఎదురు చూస్తున్నారు, అనుకున్న సమయానికి చిరంజీవిగారి లాండ్‌క్రూయిజ్ రయ్యీన దూసుకు వచ్చింది, హుందాగా నిర్మలవదనంతో దిగారు చిరంజీవి, ఒక్కొక్కరితో పరిచయాలు, చక చక ఫోటోలు. ఒక పోలియో వ్యాధిగ్రస్తుడైన యువకుడు కూడా వచ్చాడు, అతడి కోసం క్రిందికి వంగి మోకాళ్ళ మీద కూర్చుని అతడిని ప్రేమగా పలకరిస్తూ ఫోటో దిగారు చిరంజీవి, తర్వాత ఆ యువకుడితో 'నువ్వుండు బాబూ' అని చెప్పారు చిరంజీవి.

ఫోటో సెషన్ పూర్తయ్యేంత వరకు ఆ అబ్బాయి ఆనందంగా చిరంజీవిగార్నే చూస్తూండిపోయాడు, ఫోటోసెషన్ పూర్తైలోనికి వెళ్తూ చిరంజీవిగారు రాష్ట్ర చిరంజీవి యువత అధ్యక్షులు సి. హెచ్. వెంకటేశ్వరరావుగార్ని పిలిచి ఆ అబ్బాయి ఎక్కడి నుండి వచ్చాడు, ఎలా వెళతాడు ఏర్పాటు చెయ్యమన్నారు, ఆ అబ్బాయి కడపజిల్లా ప్రొద్దుటూరు నుండి వచ్చాడు, దారి ఖర్చులు భోజనం మొదలైనవన్నీ ఏర్పాటు చెయ్యబడ్డాయ్ ఆ అబ్బాయికి.

★★★

కృష్ణాజిల్లా 'తిరువూరు'కి చెందిన వేమూరి సత్యనారాయణ (చంటి) చిరంజీవిగారి అభిమాని. చిరంజీవి బ్లడ్ బ్యాంక్‌కి వెళ్తే మేనేజర్ స్వామినాయుడుగారు "చంటిగారు నాగబాబుగార్ని కలవాలనుకుంటున్నారు, మీరు తీసుకెళ్ళి పరిచయం చెయ్యండన్నారు" నాతో, నేను చంటిగార్ని తీసుకుని నాగబాబుగారి దగ్గరకు వెళ్ళి పరిచయం చేశాను... విషయమేమిటంటే చంటిగారికి తిరువూరులో ఒక 'ఫామ్' ఉంది. నీటి వనరులు పుష్కలం, అక్కడ ఔషధీకృత మొక్కల్ని పండించి మొక్కలు నాటడానికి ఉచితంగా పంపిణీ చేయడానికి వచ్చానని చెప్పారు చంటిగారు, మొక్కల వివరాలు నాగబాబుగారు చెప్పడం, చంటిగారు నోట్ చేసుకోవడం పూర్తైంది, గుంటూరు, కృష్ణా జిల్లాల్లో నాగబాబుగారు ఆ మధ్య మొక్కలు నాటి, వాటి సంరక్షణ బాధ్యతల్ని కూడా అక్కడి అభిమానులకి అప్పజెప్పి మరీ వచ్చారు, అవి సత్ఫలితాలనిచ్చాయి, 'ఇండియాటుడే' జాతీయ వారపత్రికలో సైతం ఆ వార్తకు చాలా ప్రాధాన్యం ఇవ్వబడింది. నాగబాబుగారు మాట్లాడుతూ "ఇంకా వర్షాలు పడట్లేదు చూశారా? ప్రతి వేసవిలో వేడికి తట్టుకోలేక వేసవి అయిపోగానే మొక్కలు నాటేద్దాం, పర్యావరణాన్ని కాపాడేద్దాం అని ప్రతి ఒక్కరూ అనుకుంటాం, కానీ చెయ్యం... మళ్ళీ ఆగస్టు నెలలో ఓ పదిహేన్రోజులు పదివేల మొక్కలు నాటి వాటిని పరిరక్షించడానికి ట్రీగార్డ్‌లను కూడా ఏర్పాటు చేసే పనిమీద రాష్ట్ర పర్యటన మొదలుపెడుతున్నాను అన్నారు.... నాగబాబుగారి గదిలో ఒక పెద్ద ఫోటో ఫ్రేమ్ చేయబడి ఉంటుంది, ఆ ఫోటో వాళ్ళమ్మగారిది, అంటే 'అంజనాదేవి'గారిదన్నమాట, ఆ ఫోటో ఫ్రేమ్ మీద అక్షరాలు "అమృతవర్షిణి" అని వ్రాసుంటాయి... ఎంత చల్లని కడుపు తల్లీ నీది, ఇంత గొప్ప బిడ్డలకు జన్మనిచ్చావు.

★★★

"చిరంజీవి బ్లడ్ బ్యాంక్" రోడ్ నెం:1, జుబ్లీ హిల్స్... ఒకావిడ హడావుడిగా తిరుగుతూ కనిపిస్తోంది, రక్తదానం చేసిన వారికి బ్లడ్ డోనార్ కార్డ్స్ అందుతున్నాయా లేదా, వచ్చిన వాళ్ళు రక్తదానం చేయడానికి వచ్చారా, లేదా రక్తనిధుల్ని తీసుకువెళ్ళడానికి వచ్చారా అని సావధానంగా అడిగి తెలుసుకుంటూ వారిని చక్కగా 'గైడ్' చేస్తూ, ఎంతో నమ్రతగా ప్రశాంతంగా తన విధులు నిర్వహిస్తోన్నారావిడ. ఇంతలో స్కూల్ నుండి ఆవిడ పాపకాబోలు సరాసరి బ్లడ్ బ్యాంక్‌కి వచ్చింది, రాగానే ఆ పాప హోమ్‌వర్క్ చేయిస్తూ ఆవిడ "ఇంకాస్సేపు ఆగాక ఇంటికి వెళదాం" అని తిరిగీ తన పనులవైపు దృష్టి లగ్నం చేసింది, ఎంతో నిరాడంబరంగా ఉన్న ఆవిడ చిరంజీవిగారి చెల్లెలు "డాక్టర్ మాధవిగారు".

★★★



మా ఊర్నుంచీ ఒక స్నేహితుడొచ్చాడు, ఆ రోజు అనుకోకుండా డా॥ కె. వెంకటేశ్వరరావుగార్ని ఒక ఇంటర్వ్యూ నిమిత్తం కలవాల్సి వచ్చింది ఆయన మాట్లాడుతూ "ఇక్కడ బస్తీలో నివసించే ఒక పేద మహిళకి ప్రసవ సమయంలో బి పాజిటివ్ గ్రూపు రక్తం అవసరమైంది, అర్థరాత్రి దాటి ఉంటుంది, వాళ్ళు సరాసరి మన క్లినిక్‌కి వచ్చి ఇక్కడ్నుంచీ మా ఇంటికి ఫోన్ చేయించి విషయం చెప్పారు, నేను వెంటనే చిరంజీవిగారి బ్లడ్ బ్యాంక్‌కి ఫోన్ చేసి ఏర్పాటు చేయడం జరిగింది" అని మెరిసే కళ్ళతో వివరించారు, తర్వాత వెలుపలికి వచ్చాక నా స్నేహితుడడిగాడు ఈ క్లినిక్‌లో అల్లు రామలింగయ్యగారి ఫోటో ఉందేమిటి?" అని.

"డాక్టర్ వెంకటేశ్వరరావుగారు రామలింగయ్యగారికి పెద్దల్లుడు గారు" చెప్పాన్నేను.

"అంటే చిరంజీవిగారికి" మా స్నేహితుడు.

"తోడల్లుడు అవుతారు" అన్నాను.

"మొత్తం వీళ్ళ ఫ్యామిలీ అంతా సేవ చేసేస్తోందే" అంటూ ఆనందాతిశయంతో ఆశ్చర్యపోయాడు.

★★★

చిరంజీవిగార్ని కలవడానికి శనివారం బ్లడ్ బ్యాంకుకి వచ్చి రక్తదానం చేసే వాళ్ళు ఎక్కువ సంఖ్యలో కనిపిస్తూంటారు, ఆ రోజు ఫోటోసెషన్ ఉంది, చిరంజీవి బ్లడ్ బ్యాంక్ కోలాహలంతో పండగ వాతావరణాన్ని తలపిస్తుంది, అలాంటి ఓ శనివారప్పూట రక్తదానం చేసిన ప్రముఖ న్యాయవాది రాయల సుధాకరూ, ఆయన శ్రీమతి లక్ష్మీ చిరంజీవిగార్తో ఫోటోలు దిగాక ఎప్పుడు రమ్మన్నా వచ్చి రక్తదానం చేస్తాం అని అంటే తన మాట మన్నించి ఈ మహోద్యమంలో భాగస్వాములైనందుకు గర్విస్తూ "ఆరోగ్యం జాగ్రత్త సుమా" అని చిరంజీవిగారు సున్నితంగా హెచ్చరించడం చూస్తే ముచ్చటేసింది, దూరంగా నించొని ఈ కార్యక్రమాన్ని గుంభనంగా వీక్షిస్తున్న అల్లు అరవింద్‌గారి కళ్ళల్లో కాంతి స్పష్టంగా కనిపించింది. ఆ రోజు రక్తదానం చేసి చిరంజీవిగార్తో ఫోటో దిగడానికి వచ్చిన సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ అయిన ఓ అమ్మాయి కూడా వాళ్ళ బామ్మను కూడా తోడు తెచ్చుకుంది, హడావుడిలో ఆ అమ్మాయి ఒక్కత్తే ఫోటో దిగింది, వాళ్ళ బామ్మ చిన్నబుచ్చుకుంది ఫోటో దిగకపోయినా ఫర్లేదు చిరంజీవితో మాట్లాడే వెళ్తాను అని ఆగి చిరంజీవిగారు తిరిగి వెళ్ళేటప్పుడు మాట్లాడి, చిరంజీవి తలపై చేయి వేసి ఆశీర్వదించి మరీ వెళ్ళిందావిడ.

★★★



హైదరాబాద్‌లో నాకు ఆత్మీయుడైన వడ్లాని సుధాకర్‌గారు నా గదికి వచ్చి పాత పుస్తకాలు తిరగేస్తుంటే నాతోపాటు తానూ పాత పుస్తకాలను చూడ్డం మొదలుపెట్టారు.

అందులో ఒక పుస్తకంలో మ్యాక్సివిజన్ నేత్ర వైద్యశాలవారు ఇచ్చిన ప్రకటనలో అల్లు రామలింగయ్యగారి ఫోటో చూసి 'ఇదేమిటి?' అని మొత్తం చదివి ఒక అలౌకికానందానికి లోనయ్యారు, ఆ ప్రకటన ఏమిటంటే "జీవించినంత కాలమే కాదు, మరణించాక కూడా జీవించవచ్చని నిరూపించిన మీ మానవతకు జోహార్లు" అని ఉంటుంది, తాను మరణించాక తన నేత్రాల్ని చిరంజీవి ఐ బ్యాంక్‌కు చెందేలా అల్లు రామలింగయ్యగారు హామీ పత్రంపై వ్రాసిచ్చారు, ఆయన మరణించాక ఆయన కార్నియాలను తొలగించి కంటి చూపులేని ఇద్దరు అంధులకు అమర్చి కంటి చూపు తీసుకురావడం జరిగింది. చెప్పడానికి చెయ్యడానికి తేడా ఏమిటో తెలిసింది.

★★★

మొన్న పాత స్నేహితులందరం ఒక చోట కలిశాం... చర్చ చిరంజీవిగారి శతదినోత్సవ చిత్రాలు, వేడుకలు వంటి వాటి మీదకు మళ్ళింది... "ఔనూ చిరంజీవిగారి సినిమాలు హండ్రెడ్డేస్ ఫంక్షన్స్ చెయ్యడం లేదెందుకని? ఒక స్నేహితుడి ప్రశ్న.

"ఇంద్ర చేశారు కదా!" అన్నాన్నేను.

"ఇంద్ర తర్వాత ఠాగూర్, శంకర్‌దాదా ఇవి చెయ్యలేదు కదా!" స్నేహితుడి బాధ...

రాజమండ్రి, గుంటూరు, కర్నూలు, తెలంగాణా ప్రాంతంలో మొదటిరోజు మొదటి ఆట చిరంజీవిగారి సినిమా చూడ్డానికి టిక్కెట్ల కోసం జరిగిన త్రొక్కిసలాటలో ప్రాణాలు కోల్పోయిన అభిమానుల గురించి, ఘరానామొగుడు, ఇంద్ర వేడుకలకు వచ్చి కొంతమందీ ప్రాణాలు కోల్పోయారు, వీరి కుటుంబాలకు చిరంజీవిగారు ఆర్థిక సహాయాన్ని అందించడం జరిగిన సంగతీ ఏకరువు పెట్టాను నేను.

ఇప్పటికీ చిరంజీవిగారికి సంబంధించి అది ఏ వేడుకైనా సరే ఆ సర్వేశ్వరుణ్ణి చిరంజీవిగారు కోరేదొక్కటే...

"ఎలాంటి అపశృతీ దొర్లకుండా ఈ రోజు గడవాలి తండ్రీ" అని.

★★★

2005 సెప్టెంబర్ 24వ తేదీ మా తండ్రిగారు సి. సుదర్శనంగారు హఠాన్మరణం చెందారు, తెలిసిన వెంటనే స్వామినాయుడుగారు చిరంజీవిగారికి, అరవింద్‌గారికి తెలియజేసి వెంటనే నేను ఫ్లైట్‌లో హైదరాబాద్ నుండి తిరుపతికి వెళ్ళడానికి ఏర్పాట్లు చేశారు, నేను తిరుపతి నుండి మదనపల్లె చేరడం వెను వెంటనే అరవింద్‌గారి ఫోన్, ఆ వెంటనే చిరంజీవిగారి ఫోన్ "నేనయ్యా చిరంజీవిని మాట్లాడుతున్నాను" అంటూ మా నాన్నగారు చిరంజీవిగార్ని కలిసినప్పటి ఒకటి రెండు విషయాల్ని గుర్తు చేసుకున్నారు, ఆయన జ్ఞాపకశక్తికి నన్ను ఓదార్చిన ఔదార్యానికీ చెప్పడానికి నా దగ్గర మాటలు లేవు, వ్రాయడానికి అక్షరాలు సరిపోవు.

★★★



2006 జనవరి 26, భారత ప్రభుత్వం మెగాస్టార్ చిరంజీవిగారికి 'పద్మభూషణ్' ప్రకటించిన రోజు...

హైదరాబాద్ భరత్‌నగర్‌లో రక్తదాన శిబిరంలో వ్యాఖ్యాతగా పాల్గొని అట్నుంచటే చిరంజీవిగారింటికి వెళ్ళాను, అప్పటికి టివి ఛానెల్స్ వాళ్ళు కెమెరాలతో ఆయన భావాల్ని, మాటల్ని నిక్షిప్తం చేస్తున్నారు, పుష్పగుచ్ఛంతో ఆయన గది వద్ద వాకిట్లో నిల్చుని నన్ను చూసి సోఫాలో కూర్చుని ఉన్న చిరంజీవిగారు లేచి సాదరంగా పలకరించిన తీరు నేనెప్పటికీ మరచిపోలేని అనుభూతి...

మా వూరి నుండి వచ్చాక చిరంజీవిగార్ని నేను కలవడం అదే ప్రథమం....

నేను సరాసరి రక్తదాన శిబిరం నుండి వస్తున్నానని తెలుసుకుని ఎంతమంది రక్తదానం చేశారు వంటి వివరాలు నేను చెబుతుంటే విన్నారు, 'మొన్న నీ గురించి అడిగాను, ఎప్పుడొచ్చావు' అంటూ నా కుశలం అడిగారు....

ఆయనెందుకు 'మెగాస్టార్' అవగలిగారో, అయ్యాక ఆయనే ఎందుకు 'మెగాస్టార్'గా కొనసాగ గలుగుతున్నారో అర్థమైంది నాకు...

"This is Chiranjeevi the living legend. He has become a part of our life." ఇది నా మాట కాదు, తెలుగువారు ఎక్కడున్నా వారందరిమాటా ఇదే...

★★★

2006 జూన్ 10

"చిరంజీవి ఛారిటబుల్ ఫౌండేషన్"కు రాష్ట్రపతి, భారతరత్న గౌ॥ శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలాంగారు శ్రీకారం చుట్టారు, ఆయనరాక సందర్భంగా కొందరు చిన్నారులు గులాబీలతో ఆయనకు స్వాగతం పలికారు, వాళ్ళంతా "థలస్సీమియా' వ్యాధి బారినపడిన చిన్నారులు. 'థలస్సీమియా' వ్యాధి అంటే 'రక్తం' విరిగిపోవడం జరుగుతుంది, వారి శారీరక తత్వాన్ని బట్టి "ఇన్ని రోజులకొకసారి ఇన్ని యూనిట్లు" అని రక్తం ఎక్కించాల్సి ఉంటుంది, ఒక్క హైదరాబాద్, సికింద్రాబాద్ జంటనగరాల్లోనే 540 మంది బాల బాలికలు 'థలస్సీమియ్యా' బారినపడ్డారు. 2000 సం॥లో ఈ చిన్నారుల తల్లిదండ్రులంతా సొసైటీగా ఏర్పాటై చిరంజీవిగారికి విషయం విన్నవించారు, ఆ రోజు నుండీ ఈ చిన్నారులకు వారి అవసరాన్ని బట్టి చిరంజీవి బ్లడ్ బ్యాంక్ ద్వారా రక్తనిధులు అందజేయడం జరుగుతోందని తెలుసుకున్నప్పుడు దైవత్వమనేది ప్రతి ఒక్క మానవుడిలోనూ ఉంటుందని, మానవత్వంతో చేసే ఏ పనైనా దైవత్వానికి దగ్గరి దారి అనే సంగతి స్పష్టంగా అర్థమైంది... భారత రాష్ట్రపతి గౌ॥ శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలాంగారు తన ప్రసంగంలో...



"Chiranjeevi Charitable Foundation removing the pain of the people; it is gods mission" అని అభివర్ణించాక జనం గుండెల్లో చిరంజీవి, జనుల జీవితాల్లో చిరంజీవి ఎంతగా మమేకమైపోయారా అన్పించింది.... ప్రయత్నించడం మానవ లక్షణం... ప్రయత్నం మొదలుపెట్టడం కనీస ధర్మం... "ప్రయత్నం మానేస్తే మరణించినట్లు ప్రయత్నిస్తూ మరణిస్తే గెలిచినట్లు!!! ఎందుకంటే పుట్టుక 'యాక్సిడెంట్' అయితే చావు 'ఇన్సిడెంట్' అలాంటప్పుడు ఈ రెంటి మధ్యా జరిగే అద్భుతం జీవితం.... ఆ జీవితాన్ని జీవిద్దాం, సాటి మనిషిని ప్రేమిద్దాం, మనల్ని మనం గౌరవిద్దాం, మంచిని పెంచుదాం మమతను పంచుదాం, మానవతకు ప్రతీకలుగా నిలుద్దాం...

# ఆ పాత మధురాలు



5 ఏళ్ళ బాలుడిగా
కొణిదల శివశంకర వరప్రసాద్



నరసాపురం వై.ఎన్.ఎమ్. కళాశాల
బి.కాం. ఆఖరి సంవత్సరం విద్యార్థిగా ..



ఎన్.సి.సి. క్యాడెట్ కెప్టెన్‌గా ..






*1976* సంవత్సరంలో న్యూఢిల్లీలో జరిగిన సాంస్కృతికోత్సవాలలో ఆంధ్రప్రదేశ్ తరపున పోతురాజు పోలేరమ్మల జాతరను ప్రదర్శిస్తున్న కొణిదల శివశంకర వరప్రసాద్ రావు



ఎన్.సి.సి. పర్యటనలో భాగంగా తాజ్‌మహల్ ముందు ...

# ఆ పాత మధురాలు



ఎన్.సి.సి. కేడెట్
కెప్టెన్‌గా ...



నటించటానికి ఒప్పుకున్న తొలి చిత్రం 'పునాదిరాళ్ళు'లో రాము పాత్రదారిగా చిరంజీవి



విడుదలైన తొలి చిత్రం 'ప్రాణం ఖరీదు'లో నరసయ్యగా చిరంజీవి



'మన ఊరి పాండవులు'లో పార్థు గా చిరంజీవి



మన ఊరి పాండవులు



ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందుతున్నప్పుడు ఉన్న గది ఇదే నెం 11, విజయరాఘవాచారి వీధి, చెన్నై



కెరీర్ ఊపందుకున్న తొలినాళ్ళలో సతీసమేతంగా నివసించిన నెం. 46, గిరి రోడ్, చెన్నైలోని ఇల్లు.



చెన్నైలో సొంతంగా నిర్మించుకున్న ఇల్లు, నెం. 4, పోరూరు సోమసుందరం వీధిలో గల ఇల్లు



చెన్నై నుండి హైద్రాబాద్‌కు వచ్చాక కొన్ని ఏళ్ళపాటు నివసించిన జూబ్లిహి అపోలో జంక్షన్ వద్ద గల ఇల్లు



తరువాత జూబ్లిహిల్స్ చెక్‌పోస్టు వద్ద చాలా కాలం నివసించిన ఇల్లు



సినిమా నటుడు అయ్యాక చిరంజీవికి తండ్రి వెంకట్రావుగారు కొనపెట్టిన ఫియెట్ కార్ నటుడిగా చిరంజీవి తొలి కారు ఇదే



మొట్టమొదటి మారుతి కారు



తరువాత కారు



ఇది అందరికి తెలిసిన నెం. 1 కారు దీని తరువాత ఎన్నో కార్లు మార్చారు కాని ఈ కార్లు చిరంజీవితంలో మధుర జ్ఞాపికలుగా నిలిచిపోయాయి.

Permanent

K CHIRANJEEVI B.Com.,
15/1, Vijayaraghavachari Road
T Nagar
Madras 17

విజయరాఘవాచారి వీధిలోని గదిలో ఉన్నప్పటి చిరంజీవి స్వదస్తూరి



వెండి తెర పై పుష్కర కాలం హీరో విలన్ కాంబినేషన్‌కి అర్థం చెప్పిన చిరంజీవి రావుగోపాలరావు మన ఊరి పాండవుల చిత్రంలో ఇలా తలపడ్డారు.



1988లో రష్యాలో జరిగిన ప్రపంచ చలన చిత్ర మహోత్సవాలకు అతిథులుగా హాజరైన మెగాస్టార్ చిరంజీవి, పూర్ణోదయ అధినేత ఏడిద నాగేశ్వరరావు. ఈ ఉత్సవాలలో 'పసివాడి ప్రాణం', 'స్వయంకృషి' చిత్రాలు ప్రదర్శించబడ్డాయి.

# నంది అవార్డులు



'స్వయంకృషి' (1987)



'ఆపద్బాంధవుడు' (1992)



'ఇంద్ర' (2002)

ఆన్ ది సెట్స్



చిరంజీవితో మన ఊరి పాండవులు, మంత్రిగారి వియ్యంకుడు చిత్రాల దర్శకులు బహుముఖ ప్రజ్ఞాశాలి బాపుగారు



అన్నయ్యతో పవన్‌కళ్యాణ్, చోటాకె నాయుడు, బి. మధు, లారెన్స్



కీ॥శే॥ లోక్‌సింగ్ గారి తరువాత చిరంజీవితో అత్యధిక చిత్రాలకు ఛాయాగ్రహణ బాధ్యతలు వహించిన, వహిస్తున్న చోటాకెనాయుడు



నడక కలిసిన నవరాత్రి మొదలు మన్మధమన్మధ వరకు లారెన్స్‌దే పైచేయి



రసవత్తర సంభాషణ చిరంజీవి, అల్లుఅరవిందల నడుమ సాగుతుంటే ఆసక్తిగా వింటున్న నాగరాజు



జగదేకవీరుడు అతిలోకసుందరి (1990)



స్టాలిన్ (2006) మేకప్ మేన్ యం.



అయ్యప్పస్వామి దీక్షలో





రాజమండ్రిలో అభిమాన జనసందోహం నడుమ



అమ్మ, నాన్న, చిరంజీవి



గంగోత్రి శతదినోత్సవ వేడుకల్లో
ఎన్. చంద్రబాబు నాయుడుగారితో



7వ సారి ఫిలింఫేర్ అవార్డును రేఖ చేతుల మీదుగా
అందుకుంటూ



పద్మభూషణ్ అన్నయ్యకు వినాయక్ అభినందనలు



శుభలేఖ, స్వయంకృషి, ఆపద్బాంధవుడు చిత్రాల
దర్శకులు కళాతపస్వి కె. విశ్వనాథ్ గారితో

వేడుకలు



ఫిలింఫేర్ ఆనందం



సంతోషం పంచుకుంటూ నాగార్జునతో

# పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారితో ఇంటర్వ్యూ



* *చిరంజీవిగారూ! అతివేగంగా ప్రవహిస్తున్న కాలం, అంతే వేగంగా మారిపోతున్న సమాజంలో చిరకాలంగా మీదైన శైలిని కొనసాగిస్తూ, ప్రగాఢ ముద్రను వేసిన విశిష్ట వ్యక్తులలో మీరూ ఒకరని అనిపించినపుడు మీ భావోద్వేగాలు ఎలా ఉంటాయి? మీ అనుభూతి ఏమిటి?*

ప్రేక్షకులు నాకిచ్చిన ఈ స్థాయి అపురూపం. ఎల్లప్పుడు భయభక్తులతో వుంటాను. అది వృత్తి పట్లకావచ్చు... ప్రేక్షకులందించిన ఈ స్థాయి పట్ల కావచ్చు.

* *ముప్ఫై సంవత్సరాల క్రితం అంటే 1976వ సం॥లో ఎన్.సి.సి. కేడెట్ కెప్టెన్‌గా న్యూఢిల్లీలో జరిగే సాంస్కృతికోత్సవాలకి పోతురాజు పాత్రధారిగా వెళ్ళిన మీరు, 2006వ సం॥లో అదే దేశరాజధాని న్యూ ఢిల్లీకి 'పద్మభూషణ్' పురస్కారాన్ని, అందుకోవడానికి 'మెగాస్టార్ చిరంజీవి'గా వెళ్ళినప్పుడు మీ అంతరంగం ఏమిటి?*

స్వతహాగా గర్విష్టిని కాకపోయినా... ఆక్షణం... గర్వంగా ఫీల్ అయ్యాను.

* *మీరు స్థితి ప్రజ్ఞలని, ప్రాప్తకాలజ్ఞులని, రాగద్వేషాలకు భావోద్వేగాలకు వెంటనే కదిలిపోరని, ఎంతో సంయమనంతో వ్యవహరిస్తారని అందరూ అంటుంటారు (అనుకుంటారు), ఈ 'స్థితి' కొణెదల శివశంకరవరప్రసాద్ మెగాస్టార్ చిరంజీవిగా ఎదిగే క్రమంలో అలవడినదా?! లేక చిన్నారి శివశంకరవరప్రసాద్ కూడా అలాగే ఉండేవాడా?*

క్రమంగా ఎదిగే క్రమంలో మనకంటే గొప్పవాళ్ళను చూసి నేర్చుకున్నాను. తెలుసుకున్నాను. అలవర్చుకున్నాను. ఎలా వుండాలో.... ఎలా వుండకూడదో...

* *మీ వృత్తి సినిమా, మరి మీ ప్రవృత్తి? అంటే సినిమాకి సంబంధించిన వ్యాపకాలు ప్రక్కన పెడితే మీ 'రోజువారీ దినచర్య' ఎలా గడుస్తుంది? మీ అభిరుచులు ఎలా ఉంటాయి?*

చాలా సాదా సీదాగా మామూలుగా వుంటాయి. ఆ.. మధ్య తరగతి జీవన విధానం... ఆలోచనలు..., అలవాట్లు, అభిరుచులు..., యధాతథం.

* *"150" సినిమాల చరిత్ర చిరంజీవి అంటే మరి ఆ సినిమాల్లో మీ హృదయాన్ని కదిలించి, మీ మనసుకు దగ్గరగా వచ్చి, మీ జీవితాన్ని, మిమ్మల్ని ప్రతిబింబించిన పాత్రలేమైనా ఉన్నాయా?*

లేవు.



## పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారితో ఇంటర్వ్యూ

- మగపుట్టుక పుట్టాక మంచి కొడుకనిపించుకోవాలి, మంచి భర్తనిపించుకోవాలి, మంచి తండ్రి అన్పించుకోవాలి, మంచి వ్యక్తి అనిపించుకోవాలి, మొత్తానికి మగాడనిపించుకోవాలని మన పెద్దవాళ్ళు ఎప్పుడో సిద్ధాంతీకరించేశారు, ఇవన్నీ మీరు నిరూపించుకునేశారు కదా, ఇంకా మిమ్మల్ని మీరు ఎలా ఆవిష్కరించుకోవాలనుకుంటున్నారు?

  సమాజం పట్ల మంచి మనసున్న వ్యక్తి అనిపించుకోవాలి.

- ఒకప్పుడు సంవత్సరానికి పదీ, పధ్నాలుగూ సినిమాలు మీరు చేస్తే వాటిలో అత్యధిక శాతం హిట్ చిత్రాలు కాగా ఇప్పుడు రెండు చిత్రాలకే పరిమితం కావడానికి కారణం అంచనాలు అవధులు దాటడమా? లేక కథల కొరతా? ఏమిటి కారణం?

  1. అంచనాలు, 2. కథల కొరతే కాకుండా బడ్జెట్ కూడా, 3. క్వాలిటి కోసం ఎక్కువ రోజులు తీసుకోవడం.

- మీరు కలవాలనుకుని కలుసుకోలేకపోయిన 'వ్యక్తి' అంటే ఐడియల్ హి, ఐడియల్ షి అలా ఎవరైనా ఉన్నారా?

  మహాత్మాగాంధీ.., మదర్ థెరిస్సా....

- సార్... ఇవ్వాళ ఎన్నో లక్షల మంది మీతో ఫోటోలు దిగడానికి వస్తున్నారు కదా... మీ జీవితంలో మీకు ఊహ తెలిశాక దిగిన తొలి ఫోటో ఏది? ఎప్పుడు ఎక్కడ దిగారు?

  మూడు నెలల బాలుడుగా నర్సాపురంలో, ఊహ తెల్సి నాలుగు సంవతసరాల బాలుడిగా నిడదవోలులో.

- 'వెండితెర' కోసం మీరు దిగిన తొలి స్టిల్? ఎప్పుడు? ఎక్కడ?

  ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో జాయిన్ అవ్వటానికి అప్లై చేద్దామని తీయించుకున్నాను చీరాలలో.

- తొలినాళ్ళలో డ్యాన్సులు, ఫైట్లు ఎప్పటికీ థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్సే కదా... అలా మీరు చేసిన మొట్టమొదటి డ్యాన్స్, మొట్టమొదటి ఫైట్ ఏ సినిమాలకి చేశారు?

  'డ్యాన్స్' పునాదిరాళ్ళు, 'ఫైట్స్' మనవూరి పాండవులు.

- నటుడు కావాలన్న మీ ఆలోచన ఎప్పటిది? ఆ అంకురం ఎప్పుడు పడింది మీలో? అది బలంగా ఎందుకు మారింది? అప్పటి మీ ఆలోచనా ధోరణి అలానే ఎందుకు సాగింది?

  డిగ్రీ అవ్వగానే, నా మీద నాకు నమ్మకం బాగా వుంది కాబట్టి.

- నవరసాలలో అన్ని రసాలకూ పరిపూర్ణ న్యాయం చేకూర్చే మీరు హాస్య, శృంగార రసాలకు కొంచెం ఎక్కువ న్యాయం

# పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారితో ఇంటర్వ్యూ

చేస్తారని ప్రేక్షకాభిమానుల నిశ్చితాభిప్రాయం... నిజానికి మీకిష్టమైన 'రసాలు' ఏమిటి?

హాస్యరసం.

✣ మీ అభిమాన హాస్యనటుడు ఎవరు?

హాస్యాన్ని పండించగల ప్రతి ఒక్కరూ ఇష్టమే. అయితే వారిలో 'చార్లిచాప్లిన్' మరీ ఇష్టం.

✣ మీ చిత్రాల్లో శుభలేఖ, విజేత, స్వయంకృషి, చంటబ్బాయ్, మంచుపల్లకి, ఆరాధన, రుద్రవీణ, ఆపద్బాంధవుడు, శ్రీమంజునాథ ఇవన్నీ మీలోని కళాకారుడిని సంతృప్తిపరచడమేగాక విజేత, స్వయంకృషి, శుభలేఖ మినహా మిగిలినవన్నీ ఒక వర్గం వారినే బాగా ఆకట్టుకోవడం జరిగింది, ఈ పాత్రలు, ఈ చిత్రాలు లేకుండా మీ గమనాన్ని ఊహించలేం... ఈ పాత్రలు మీకు ఆనందాన్నిచ్చాయంటే మళ్ళీ అటువంటి పాత్రల అన్వేషణ ఎందుకని జరగలేదు? అటువంటి కళాత్మక చిత్రాలకు దూరమయ్యారెందుకు?

ఆయా కాలమాన పరిస్థితులకు అనుగుణంగా, ప్రేక్షకుల అభిరుచికి తగినట్లుగా, మారకపోతే నేను కనుమరుగు అయ్యే అవకాశం ఉంది.

✣ కోతలరాయుడు, మొగుడుకావాలి, పున్నమినాగు, చట్టానికి కళ్ళు లేవు ఇలా ఓ విజృంభన మీ కెరీర్ తొలినాళ్ళలో మొదలై అభిలాష, ఇంట్లో రామయ్య వీధిలో క్రిష్ణయ్య, మగమహారాజు, ఖైదీ, సంఘర్షణ, గూండా, ఛాలెంజ్, దొంగ ఇలా మరో విజృంభణ మీ కెరీర్‌ని మలుపు తిప్పింది కదా... సినిమా సినిమాకి, ఓ పాత్రకి మరో పాత్రకి అంతలా ఎలా 'ఛేంజ్' అయ్యేవారు? ఆ 'దశ'లో మీ మానసిక శారీరక పరిశ్రమ ఎలా ఉండేది?

మన 'ఏజ్'తోపాటు 'ఇమేజ్'కి కూడా ఒక 'ఏజ్' ఒక సీనియారిటి వస్తుంది. దానికి తగినట్లుగా డిగ్నిఫైడ్‌గా మలచుకోవాలి. అది ఒక నటుడికి గౌరవం తీసుకొస్తుంది.

✣ చిన్న పిల్లలకి మీరే 'ఆల్‌టైమ్' ఫేవరెట్ హీరో కదా... ఇదెలా సాధ్యమైంది? ఆగక అలుపెరగక మీరు పంచుతున్న వినోదమా? మీకూ చిన్న పిల్లలంటే ఉన్న ప్రేమే కారణమా?

ఇది నాకూ మిలియన్ డాలర్ క్వశ్చన్. బహుశా ఒకనాటి పిల్లలే నేటి తల్లిదండ్రులు. నా మీద వాళ్ళకున్న ప్రేమ అభిమానం.. వాళ్ళ పిల్లలకీ నూరిపోస్తున్నారేమో.

✣ పసివాడి ప్రాణం, యముడికి మొగుడు, అత్తకుయముడు అమ్మాయికి మొగుడు, స్టేట్‌రౌడి, కొండవీటి దొంగ,

జగదేకవీరుడు అతిలోకసుందరి, కొండవీటిసింహం, గ్యాంగ్‌లీడర్, రౌడీ అల్లుడు, ఘరానామొగుడు, ముఠామేస్త్రి, అల్లుడా మజాకా, హిట్లర్, మాస్టర్ ఇలా మొదలై తర్వాత ఇంద్ర, ఠాగూర్, శంకర్‌దాదా ఇవన్నీ ఆర్థిక పరిపుష్టిని పరిశ్రమకందించిన చిత్రాలే అవి పెరుగుతూ మిమ్మల్ని పెంచుతూ, మీ వల్ల ఆ చిత్రాలు పెరుగుతూ ఒక స్థాయిని దాటి 'తెలుగు సినిమా' అంతర్జాతీయ స్థాయికి వెళ్ళింది, అంటే విదేశీ మార్కెట్‌లోకి వెళ్ళిన తొలి తెలుగు చిత్రం కూడా 'ఇంద్ర' కావడం... ఇలా ఈ దశలన్నీ చూశాక మీకేమన్పిస్తోంది...?

మన స్టామినా ఇంకా వుంది. అంతర్జాతీయ స్థాయి కెళ్ళే కొలది క్వాలిటి కూడా పెరుగుతుంది. ఇది ఆరోగ్యకరమైన మార్పే కదా..!

- మీ 'కుటుంబం' గురించి చెప్పండి? అంటే కుటుంబ సభ్యుల పట్ల మీ బంధం ఎలా ఉంటుందో తెలపగలరు?

కుటుంబం పట్ల బాధ్యతగా ఎలా వుండాలో నేను బెస్ట్ ఎగ్జాంపుల్ అనుకోవచ్చు.

- జ్ఞాపకశక్తి, క్రమశిక్షణ, సమయపాలన, అంకితభావం, చిత్తశుద్ధి, నిబద్ధత, వినయవిధేయతలు, సేవాగుణం, మానవీయ దృక్పథం ఇలా దేన్ని తీసుకున్నా అవి మీలో నిండుగా ఉన్నాయి. ఇంతగా ఇన్ని సుగుణాల్ని సొంతం చేసుకున్నారంటే మిమ్మల్ని మీ జీవితంలో ప్రభావితం చేసిన వ్యక్తులెవరు? మిమ్మల్ని కదిలించిన సంఘటనలేమిటి?

తారసపడిన ప్రతిఒక్కరు.., ప్రతి ఒక్క సంఘటనా ఎలా నడచుకోవాలో నేర్పినవే... ఇప్పటికి నేర్పుతున్నవే....

- మీ అభిమాన నటీ నటులు ఎవరు?

మహానటుడు 'ఎస్వీ. రంగారావు', మహానటి 'సావిత్రి'.

- ఎప్పటికైనా ఈ దర్శకునితో పని చెయ్యాలనో, ఫలానా సాంకేతిక నిపుణులైతే మిమ్మల్ని ఆవిష్కరించడంతో కొత్త కోణం వెతుకుతారనో మీరు తపిస్తుంటారు? అలా ఇప్పుడు ఎవరి గురించి (ఎవరితో పని చెయ్యాలని) ఉత్సాహపడుతున్నారు?

మంచి కథతో వచ్చిన ఎవ్వరితోనైనా...

- మీరు పిలుపునిచ్చాక, బ్లడ్ బ్యాంక్ స్థాపించాక రాష్ట్రంలో రక్తదానం చేసిన, చేస్తున్న వారి సంఖ్య పెరిగిందని తెలిసింది, మీ అభిమానులే కాక అన్ని రంగాలవారు ఈ



## పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారితో ఇంటర్వ్యూ

ఉద్యమంలో భాగస్వాములౌతున్నారు.... ఈ విజయం పట్ల మీ స్పందన ఏమిటి?

మంచి మనసున్నవారు ఈ లోకంలో కొదవలేదు అని తెల్సింది.

- ఇన్నేళ్ళ మీ జీవితంలో మరువరాని, మరువలేని వ్యక్తులు, సంఘటనలు?

కృతజ్ఞుడైన వ్యక్తులెవ్వరినీ..., దేనినీ మరువలేదు.

- ఎదుటి వ్యక్తుల్లో మిమ్మల్ని ఏ అంశాలు ఆకర్షిస్తాయి?

నిజాయితీ... నిగర్వం...

- సార్... మీ జీవితంలో తీరిక అనే పదానికి తావేలేదు, కానీ 'తీరిక' అంటూ దొరికితే మీరేం చేస్తారు?

నాకు కావలసిన వారితో స్పెండ్ చేయటం ఇష్టం.

- మీ కిష్టమైన రంగులు ఏవి? ఎందుకు?

బ్లాక్ అండ్ గ్రే.

- విదేశాల్లో ఏ దేశమంటే మీకు ప్రీతి? ఎందుచేత?

'న్యూజిలాండ్' వాతావరణం మారదు జనాభా తక్కువ. ట్రాఫిక్ తక్కువ పొల్యూషన్ తక్కువ..

- తోటి కళాకారుల పట్ల ప్రేమను, సహనటుల పట్ల సుహృద్భావ భావాన్ని వ్యక్తపరచడమే కాకుండా, వారు విజయాలు సాధించినప్పుడు అభినందించే సంస్కృతి మీకే సొంతమంటూ మీ తోటి నటీనటులు అంటూ ఉంటారు, మీ కెరీర్ తొలినాళ్ళలో మీరు అలాంటి అభినందనల్ని అందుకున్నారా? ఒకవేళ అలాంటి సందర్భమే ఉండి ఉంటే మీరు ఎప్పటికీ మరచిపోలేని అభినందన ఏమిటి?

తక్కువ. ఎదురు చూసి దెబ్బతిన్న సందర్భాలున్నాయి. అందుకే నాకు దక్కనిది... ఇతరులకి ఇస్తూంటాను.

- మీ నటవారసుడిగా రంగప్రవేశం చేయనున్న 'రామ్‌చరణ్‌తేజ'పై తండ్రిగా మీ అభిప్రాయం ఏమిటి?

పేరు నిలబెడతాడు.

- వివేకానందుడు, మహాత్మాగాంధీ, మదర్‌థెరిసా ఇలా వీళ్ళలా రేపటి తరాలకు మీరు కూడా ఒక శక్తి సంకేతం కానున్నారని 'యువత' మనోభావాల్ని బట్టి తెలుస్తోంది, ఇవి మీ దాకా వచ్చినపుడు మీ ఆలోచనాధోరణి ఎలా ఉంటుంది?

ఈ ఒక్క విషయంలో అభిమానులు మరీ అర్థం పర్థం లేకుండా కంపేర్ చేస్తుంటారు... వినేవాళ్ళకి, చూసేవాళ్ళకే



# పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారితో ఇంటర్వ్యూ

కాకుండా... నాక్కూడా చాలా ఇబ్బందిగా అనిపిస్తూంటుంది. ఈ జవాబు ద్వారా రిక్వెస్ట్ చేస్తున్నాను, చెప్తున్నాను. ఇక మీదట అలా కంపేర్ చేయద్దు.

- ముందు ఏడు తరాల వారికి, రాబోయే ఏడు తరాల వారికి గొప్ప థ్రిల్, గొప్ప ఆనందం "అన్నయ్యకు పద్మభూషణ్ రావడం" అని మీ సోదరులు నాగబాబుగారు అన్నారు నిజమే... పద్మభూషణ్‌కు ముందు పద్మభూషణ్‌కు తరువాత మీ మనఃస్థితి ఎలా ఉంది?

  మామూలగానే వుంది.

- రాష్ట్రపతిభవన్‌కు వెళ్ళిన కళాకారులున్నారు కానీ, మీ ప్రపంచంలోకే రాష్ట్రపతిని ఆహ్వానించి ఆదరించిన కళాకారుడు మీరే కావడం పట్ల మీ అనుభూతి?

  గర్వంగా వుంది.

- తెలుగునాటే కాక విదేశాల్లో కూడా మీ సినిమాలు చూడడం ఒక సాంఘికాచారంగా (Social Habbit) మారడం అన్ని మతాల వారి పండుగలతో పాటు మీ పుట్టినరోజు కూడా ఒక పండుగగా మారడం ఇవన్నీ చూస్తుంటే మీకేమనిపిస్తుంది?

  ఇబ్బందికరమైన సంతోషం.

- మీతో ఫోటో దిగడానికి వచ్చే అభిమానులు ఎంతమందున్నా మీరు విసుకోక్కుండా చిరునవ్వుతోనే ఫోటోలు దిగుతూంటారు కదా. అసలు అలసట, విసుగు అనేవే మీ దరిదాపుల్లోకి రావెందుకని ?

  నాకు 'క్షణికం'. వారికి జీవితకాలం... ఆ విలువ తెలుసుకాబట్టి.

- జయాపజయాలకు మీరెలా స్పందిస్తారు?

  ఒకపుడు ఏమోగాని, ఇప్పుడు స్పందన దాదాపు ఒక్కటే...

- మీ జీవితంలో అత్యంత విలువైనవిగా మీరు వేటిని పరిగణిస్తారు?

  రిలేషన్స్.

- "నటకిషోర్, నటభాస్కర, డేరింగ్ డేషింగ్ డైనమిక్ హీరో, సుప్రీం హీరో, మెగాస్టార్, పద్మభూషణ్" రేపు?

  మన మనిషి.

- మీరిచ్చే 'సందేశం' ఏమిటి?

  మీరు 'సందేశం' ఇచ్చేస్థాయికి చేరుకోవాలని...





"నాకు తెలిసి చిన్నప్పట్నుంచీ కూడా అన్నయ్య కష్టపడి పైకి వచ్చిన వ్యక్తి. తను ఏ పని చేసినా దీని ద్వారా తనను పదిమంది మెచ్చుకోవాలి అని చేసే తత్త్వం కాదు. తనకు నచ్చిన పని చేసెయ్యడమే తప్ప ఒకరి మెప్పు కోసం చేయడు. తన మనసుకు నచ్చిన పని మనస్ఫూర్తిగా చేస్తాడు. అలాంటి ఆలోచనా స్థాయి ఆయన్ను ఇంత గొప్ప స్థితికి తీసుకువచ్చింది. నాకు ఆయన నటుడిగాకంటే, ఆయన ముందుండే మనిషిని అర్థం చేసుకునే విధానం బాగా నచ్చుతుంది.

ఆయన నడవడిక, మాట తీరు, ఇండస్ట్రీని ఒక తాటిపైకి తీసుకువచ్చిన మొదటి వ్యక్తిగా ఆయన్నే చెప్పుకోవచ్చు. ఆయనలో ఎటువంటి స్వార్థముండదు. మనిషిని మనిషిగానే చూస్తారు. పైగా ఆయన స్థాయిలు, వర్గాలు చూడరు, నేను అలాంటిది ఆయనలో చూడలేదు. 'నా' అని ఆయన అందర్నీ అనుకున్నారుగానీ, ప్రత్యేకించి ఒక్కరికి మాత్రమే పరిమితం చేయలేదు. ఆయన ప్రేమను అందరికీ పంచారు, చిన్నప్పట్నుంచీ నేను ఆయనను చూస్తూండేవాడిని, ఆయన చుట్టూ ఆ విధమైన వాతావరణం కనిపించేది. ఆయన ఎంత గొప్ప వ్యక్తంటే ఆయన వెనకాల తిట్టేవారి గురించి ఆయనతో చెప్పినా తనను తిట్టినవారిని కూడా ప్రేమించే ఉన్నతమైన మనసాయనది, ఆయన చుట్టూ శత్రుత్వపు ఛాయలు కనిపించవు, సామరస్య పూర్వకమైన వంతెన ఏర్పడి ఉంటుంది.

తన చుట్టూ సమాజంలో ఏం జరిగినా ఆయన ప్రతిస్పందించే విధానం గురించి చెప్పాలంటే ఒక కార్గిల్ యుద్ధమప్పుడుగాని, రాష్ట్రంలో వరదలు వచ్చినప్పుడుగాని, ఆ బాధితులను మా నాన్నగారి ద్వారా గుప్తంగా ఆదుకున్న విధానంగానీ, తన చుట్టుపక్కల ఉండే వారికి తెలియకుండా వారికన్నీ సమకూర్చే విధానంగాని, ఆయనలోని మనిషి ఆ విధంగా స్పందిస్తారు, పైగా అందులో నేనిలా చేస్తే నన్ను గుర్తు పెట్టుకుంటారు అనే స్ట్రాటజీ ఉండదు, ఇదీ ఆయన లైఫ్‌స్టైల్.

ఇలాంటి ఆయన జీవిత విధానానికి 'బ్లడ్ బ్యాంక్' ఒక వజ్రంలాగా తోడైంది, ఒక ఉన్నత స్థాయి వ్యక్తి ఒక మంచి పని చేస్తే ఎంతోమందికి మార్గదర్శకమౌతుంది. ఆయన 'రక్తదానం ఇవ్వండి' అని పిలుపునివ్వడమే కాకుండా ఆచరణలో పెట్టగలిగారు, మన దేశంలో ఒక మంచి పని చేయాలంటే ఎన్నో ప్రతిబంధకాలుంటాయనే సంగతి తెలిసిందే, అయితే వాటన్నిటినీ అధిగమించి ఆయన బ్లడ్ బ్యాంక్ నడుస్తోంది. ఆయనకున్న ఉన్నతమైన ఆశయం ఆయన్ను ముందుకు నడిపించింది. నాకు తెలిసి అక్కడ పొందిన రక్తదానం ద్వారా ఆరోగ్యవంతులైనవారు 'సార్ మేం బ్రతికున్నామంటే మీ అన్నయ్య బ్లడ్ బ్యాంక్ ద్వారానే' అని చెబుతూంటారు, అది ఎంతోమంది ప్రాణాల్ని కాపాడింది. ఇప్పుడు "తోటి మనుషులకు సహాయపడదామనే చక్కటి వాతావరణాన్ని కోరుకునే అన్నయ్య మార్గదర్శకత్వంలో పయనించడానికి బయలుదేరారు అందరూ."

ఆయన సోదరుడిగా కాకుండా అన్నయ్య జీవిత పయనాన్ని చూసిన వ్యక్తిగా మాట్లాడుతున్నాను. సోదరుడిని ప్రేమించడంలో గొప్పేమిలేదు, అబ్బురపరిచే ఆయన గుణగణాలను ప్రేమిస్తున్నాను.

Pawan kalyan

(పవన్‌కళ్యాణ్)



ప్రియమయిన

St. థెరిసా విద్యార్థినులకు మీ అభిమాన చిరంజీవి —

మీ హెడ్‌మిసెస్ గారు నన్ను రమ్మని అడిగినప్పుడు నేను రావాలని, మీతో గడపాలని చాలా సరదా పడ్డాను. కాని, షూటింగ్ ఒత్తిడి వల్ల రాలేక పోతున్నాను. మీతో గడపాలన్న సరదాను ఈ రకంగా మీతో గడుపుతున్నాను.

మీ స్కూలు చేపట్టిన కార్యక్రమాలు దిగ్విజయంగా సాగాలని, మీరంతా ఎంతో పైకి రావాలని, ఈ Golden Jubilee year స్కూలు చరిత్రలో SUPER HIT కావాలని '+' నాపై మీరు చూపుతున్న అభిమానం పదికాలాలు నిలవాలని మనసారా కోరుకుంటూ —

మీ —
చిరంజీవి

. మద్రాసు
. 21-11-87

మద్రాస్ సెయింట్ థెరిస్సా స్కూల్‌కి వెళ్ళాలనుకొని షూటింగ్ ఒత్తిడి వల్ల వెళ్ళలేక పోయినందుకు ఆ విద్యార్థినులందరికి ఫోటో గ్రీటింగ్స్ విత్ లెటర్ ఈ విధంగా పంపించిన చిరంజీవి

# THE MAN - THE LEGEND

## The Story Behind

*Pranam Kharidu* - His first film released in 1978, Chiranjeevi played Narsaiah with Reshmi Roy essaying the role of his first ever love interest on screen. The film did well to get him noticed for his ease and effectiveness of performance.

In *Punadirallu,* meaning the foundation stones the first acting assignment he has taken up Chiranjeevi played one among the five youth but was apparently the most striking. He also delivered a splendid performance as a transvestite in a song.

*Manavuri Pandavulu,* where for the first time he earned a remuneration of Rs. 1,116 and a memento for a successful run. His performance in Pranam Kharidu led him to be spotted by the legendary film maker Bapu who cast him in his film. An analogy to the epic Mahabharata. As the fiery Pardhu he won plaudits from everyone. Most notable was the legendary artist Savithri's faith that this kid will go places.

His 1979 film *Kotalarayudu* (The Conman) offered him a role with negative shades but Chirajeevi played it with elan. The film played for over 100 days.

His first memorable success after he attained stardom was the 1980 film *Mogudu Kavali* that ran for 25 weeks. A jubilant audience threw currency coins to appreciate his delightful dances and it became a practice till this day.

Despite becoming a 'hero' who traditionally and historically played only positive characters especially in Telugu cinema, the streak of experimentation in Chiranjeevi made him play negative rather anti hero characters in films occasionally but always successfully. These films only reinforced audience's love for his performances no matter what role.

While the *Nakili Manishi* (The clone) was one such film, his 1981 film *Punnami Naagu* (The full moon cobra) became a land mark film in his career. Chiranjeevi played Naagu, born into a family of snake charmers that has a curse to meet their end, also by snake bite. His anxious further raises him with injecting regular doses of poison to serve as an antidote to the snake bite, little realizing that he can no longer lead a normal life. He becomes a poison man and every girl he mates with perishes. The role won him rave reviews and a film fare award for best actor.

Yet another negative where Chiranjeevi excelled was the 1981 film *Nyayam Kavali* where he ruthlessly betrays Radhika after making her fall for him head over heels. The film was a super hit and was later remade in many languages including Hindi as Mujhe Insaf Chahiye.

*Chattaniki Kallu Levu* (The law is blind) his other significant film in 1981 saw Chiranjeevi as the avenging angel. He loses his family early on and grows up with the sole mission of eliminating the perpetrators. While his sister, who becomes a cop wants to adopt the legal route to



punish them, Chiranjeevi makes uses of the loopholes in the law to take it into his own hands and finish the killers. The film was yet another super hit and was later remade in Hindi as Andha Kanoon with none other than Indian Super Star Amitabh Bachan and Rajani Kanth.

In the year 1982 Chiranjeevi scored impressive but rather quite hits what with both the films portraying a very soft Chiranjeevi on screen. It was perhaps the quietude before the storm.

*Intlo Ramaiah Veedhilo Krishnaiah* a family oriented film ran continuously for 525 days in many centers and has Chiranjeevi play Rajasekhar - an engineer by profession.

Next came *Subhalekha,* in the direction of one of the Doyens of Telugu Cinema K. Viswanath. The film deals with the social evil of dowry and with a very charming and down to earth portrayal Chiranjeevi made every girl yearn for a real life friend like him.

With *Abhilasha* Chiranjeevi scored his first hit in 1983 and it was as if he was just warming up for a major box office onslaught later on. The film was a great critical and commercial musical success and marked his association with Maestro Ilayaraja. The association would later result in some of the most memorable melodies in Telugu film history. Chiranjeevi played his name sake on screen who fights relentlessly for the abolishment of Capital punishment under IPC 302.

And then came the most defining period of Chiranjeevi's career. Something that also changed the course of Telugu cinema, the way films are made and exploited. It redefined a Hero on Telugu screen. *Khaidi* was an unprecedented success and was a blockbuster in the true sense. Chiranjeevi plays Suryam an innocent college going youth forced to become a fugitive, who operates out of a forest hideout to destroy the people who wronged his family.

While Khaidi was full of fierce action, *Adavidonga* his Indianized Tarzan movie provided oodles of entertainment with Chiranjeevi tying up with another legendary director of Telugu Cinema K. Raghavendra Rao.

Challenge, Chiranjeevi's next most significant release remains a relevant and deeply inspiring film even today. Chiranjeevi plays Gandhi, a simpleton with no one of his own, shows what one man can achieve, when his self respect is challenged and when his capabilities are questioned. All one needed was a will power and an unflinching commitment to raise above all odds.

Chiranjeevi breathes life into the role of Madhu a die hard aspirant soccer champ, who is sadly dismissed by his family a worthless and directionless youth. But in the hour of crisis, Madhu bails out his family out of financial doldrums by selling of his kidney, jeopardizing his prospective soccer career - for ever. Chiranjeevi gave and outstanding performance in this film Vijetha and one that touched many hearts and moved audiences to tears.

But quickly Chiranjeevi switched tracks and demostrated his command on the most difficult aspect of the Art of acting - comedy. *Chantabbai* has Chiranjeevi playing a detective who inadvertently yet consistently



does evoke laughter, but someone who is true to his job and reaches his destination. The role which was trademark Chaplin was a huge success with kids and family audiences till date.

Chiranjeevi's next film was one that got him nation wide recognition. Once again with a screen name of Suryam that ironically depicts him in a very constrasting role to the earlier film Khaidi, Chiranjeevi delivers a sterling performance. Born into the orthodox Brahmin family with his father Bilahari Sastry at the helm, Suryam sets out to prove to his scholarly but rather presumptuous father that societal good is nobler than attaining excellence in classical music a traditional family pursuit. The film was also his first home production and won the Indira Priyadarshini Award for furthering National Integration.

*Pasivadi Pranam*, Chiranjeevi's next major release on his home banner was a scintillating commercial success. Chiranjeevi's amazing dancing skills were on ample display and would make him the undisputed Star of dance movements. His screen name is once again Madhu and he is out to protect a kid a mute but sole witness to a ruthless murder whose life is under dare threat.

Chiranjeevi attempted quite contrasting film next when he joined hands once again with K.Viswanath in Swayam Krushi. The film brought the issue of sharp focus the issue of Dignity of Labor. Chiranjeevi not caring for his popular image played Sambaiah a cobbler, who does not forget his roots even after making it to the top. The film won the State Government's Best Actor award with a Golden Nandi. The film was also dubbed into Russian language and won major critical and popular acclaim.

Chiranjeevi played Puliraju in Aradhana an uncouth and unrefined person but with a heart of gold, who falls in love with a charming city bred Teacher played by Suhasini.

*Yamudiki Mogudu* a socio fantasy film was the next best to follow and was a spectacular hit. Chiranjeevi plays a cheeky human being who even questions the angel of death in the Hindu mythology Yama an equivalent of St.Paul about how he could inflict death on him so early on and returns to planet earth to accomplish some unfinished tasks. The film was a rip-roaring entertainer.

Attaku yamudu Ammayiki Mogudu was another breezy entertainer that cast Chiranjeevi in a macho role in a gripping family drama. While in Kondaveeti donga he played a typical Robin hood character for the first time. The film was also a huge musical hit and rediscovered Chiranjeevi's dancing talent with graceful movements.

Then came another land mark film and socio fantasy in his career *Jagadeka Veerudu Athiloka Sundari*. He paired up with the gorgeous Sridevi and their on screen chemistry was incredible. The film was a raging hit and got the better of a severe storm that hit the State to return mind blowing box office revenues.

For the first time in his career Chiranjeevi played a Cowboy in Kodamasimham that reminisced the best of westerns. The film also offered some foot tapping music.



Chiranjeevi made his entry onto the national scene with his film Pratibandh (The Obstacle) and proved beyond doubt that his appeal and talent cannot be confined by linguistic barriers.

*Gangleader* - Commercial Block buster in his career, The film was a roaring hit and creates new waves in film industry, it is a social drama with mass appeal. A sparkling success and also create mega image to Chiranjeevi, really Gharanamogudu is a memorable experience to stars, unit & also audience.

Chiranjeevi's appeal is as much in the masses as much it cast a spell on the classes. Moreover, when he plays a character that reflects their emotions and aspirations, there is no stopping him. In the Mutha Mestri Chiranjeevi played the character of vegetable market supervisor and chief vendor Ramakrsihna who is driven by destiny to become a Minister in the State cabinet. Chiranjeevi delivered a scintillating performance.

Even as he reined the box office with his blockbuster entertainers, Chiranjeevi always looked for an opportunity to quench his thirst for characters that would challenge the actor in him. One such character was Madhava in Apathbandhavudu (The Savior). Yet again Chiranjeevi teamed up with K. Viswanath to deliver an award winning performance as the loyal and compassionate servant who travels all the way with his wealthy master's family that is wrecked in time by the fate.

Hitler, Master, Choodalani Vundi, Annayya

These four growing up the megastar's career and also the new begining to chiranjeevi's second innings. Creates wonders of collections a new wave in Telugu cinema Economics.

Mythologicals have always commanded a special place in the annals of Telugu Cinema. With Sri Manjunatha in Year 2000, Chiranjeevi.

Indra one of Chiranjeevi's biggest blockbuster and a land mark in Indian cinema depicts him in a role set in the culrullay significant yet under developed and often drought ridden northwest region of the State of Andhra Pradesh. A volatile, tumultuous hotbed of faction feuds, where honor and pride matter more than human lives. Where 'Revenge' could some times be the sole purpose of procreation. Chiranjeevi played Indra sena Reddy whose struggle and sacrifice to bring peace, his iconic compulsions to resort to violence to end violence, bloody feuds and quench the thirst of his people.

Rated by *Chiranjeevi* himself as one of the best films in his career spanning 25 years *Tagore* features him in a powerful role as a Professor who leads a double life as an untiring crusader against corruption in public life. Disgusted with the moral decay in the society, a determined Tagore creates his own network of army called the Anti corruption Force (ACF) that eliminates the most corrupt, from all walks of life, in a systematic manner.

'Anji' features highly Technical values in south Indian Silver screen and achieve national award also.

'Sankar Dada' M.B.B.S. a witty movie and humerous performance feature by Chiranjeevi as a Rowdy Sheeter becoming a mediko about morals, biggest commercial hit in his career.













## 'రాష్ట్ర చిరంజీవి యువత' – ఒక గమనం

"ప్రపంచ శాసనకర్తలు కళాకారులే అన్నారు జార్జ్ బెర్నార్డ్‌షా, అలా అన్న ఆయనే ఇంకో మాటకూడా అన్నారు సినిమా కళాకారుల్ని తక్కువగా అంచనా వేయకండి రేపటి సమాజాన్ని ప్రభావితం చేసేది వారే" అని. ఔను ఆ మాట అక్షరాలా నిజం... నిజం చేసింది పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారు, ఆయన చూపించిన త్రోవలో ఆయన అభిమానులు...

'వేదవాక్కు' అనేమాట తరచుగా మనం వింటూ ఉంటాం, అయితే ఆచరణలో దాన్ని చిరంజీవిగారి అభిమానులు అమలు చేసి చూపారు, చూపుతున్నారు ఒక కళాకారుడికి, అందునా సినీ కథానాయకుడికి అభిమాను లుండడం సహజం, అయితే అభిమానులు తమ అభిమాన హీరో చిత్రం విడుదలైనప్పుడు థియేటర్ల దగ్గర సందడి చేయడానికో, తమ హీరో కటౌట్‌కి పూలమాలల్తో అలంకరించి ఆనందించడానికో పరిమితమయ్యేవారు తప్ప వారి ఉనికిని బలంగా చాటుకున్న దాఖలాలు దాదాపుగా లేనే లేవని చెప్పొచ్చు ఇదంతా 'చిరంజీవి'గారి ఆగమనానికి ముందు మాట, చిరంజీవిగారు తెలుగునాట అగ్రశ్రేణి హీరోగా నిలబడ్డాక తన అభిమానుల్లో 'క్రమశిక్షణ'ను పాదుకొల్పడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా తగిన సూచనలు అభిమానులకిస్తుండే వారు, వారూ పాటిస్తూండేవారు ఇదంతా 1982వ సం॥లో చట్టానికి కళ్ళులేవు విడుదలైందగ్గరి నుంచీ 1995వ సం॥ వరకూ దాదాపుగా ఈ అనుబంధం ఇలాగే కొనసాగింది, అంటే దాదాపు పన్నెండేళ్ళకుపైగా చిరంజీవిగారి అభిమానులు చిరంజీవిగారు చెన్నైలో ఉన్నా, హైదరాబాద్‌లో ఉన్నా, షూటింగ్ నిమిత్తం వేరే ఏ ప్రాంతాలకు వెళ్ళినా వారు కలసి తమ అభిమానాన్ని ప్రదర్శించి ఫోటోలు దిగి వెళ్ళడం ఆనవాయితీగా ఉండేది, అభిమానులు కూడా ఆయా ప్రాంతాలవారు విడివిడిగానే చిరంజీవిగార్ని కలిసి వెళ్ళేవారే గానీ ఒక సమైక్యత, బలమైన గొంతుకా ఉండేవికావు, ఈ పరిస్థితుల్లో సేవా కార్యక్రమాలు, చిరంజీవిగారి పుట్టినరోజున వేడుకలు, అన్నదానాలు, వస్త్రదానాలు లాంటివి ఎవరికివారే వారి వారి ఊళ్ళల్లో నిర్వహించుకునే వారేగానీ సరైన 'వేదిక' లేదు, ఇటువంటి నేపథ్యంలో 1995వ సం॥లో ప్రతిపాదించబడి 1996వ సం॥ ఆగస్ట్ 22వ తేదీ మెగాస్టార్ చిరంజీవిగారి జన్మదినాన శ్రీయుతులు మెగాస్టార్ చిరంజీవి,



చిరంజీవి ఈకో ఫ్రెండ్స్ ఆర్గనైజేషన్ వ్యవస్థాపించి పర్యావరణ పరిరక్షణలో భాగంగా మెగాబ్రదర్ కె. నాగేంద్రబాబు మొక్కలు నాటే కార్యక్రమాన్ని, వాటిని పరిరక్షించే బాధ్యతల్ని తెలుగునాట ఒక ఉద్యమంగా తీర్చిదిద్దారు. హైదరాబాద్‌లోని మౌలాలీ హౌసింగ్ బోర్డ్‌లో మొక్కను నాటుతున్న నాగేంద్రబాబు.



మెగాస్టార్ చిరంజీవి 'స్వచ్ఛంద రక్తదాన శిబిరం'ను సందర్శిస్తున్న మెగాబ్రదర్ కె. నాగేంద్రబాబు ప్రజాపిత బ్రహ్మకుమారీస్ ఈశ్వరీయ విశ్వవిద్యాలయంలో మెగాబ్రదర్ కె. నాగేంద్రబాబు, ప్రముఖ హాస్యనటులు వేణుమాధవ్, సాంస్కృతిక బంధు సారిపల్లి కొండలరావు, సంఘసేవకులు అచ్చా సుధాకర్ తదితరులు... చిరంజీవి స్వచ్ఛంద రక్తదాన శిబిరాలు ఎక్కడ నిర్వహించబడినా వాటికి అనుగుణంగా మొక్కలు నాటడం, ఆధ్యాత్మికత పెంపొందించడం వంటి కార్యక్రమాలు 'నాగేంద్రబాబు' ఎప్పుడూ నిర్వహించి తనదైన ముద్రను వేస్తున్నారు.

అల్లు అరవింద్, కె. నాగేంద్రబాబుగార్లు అధికారికంగా "రాష్ట్ర చిరంజీవి యువత"ను ప్రకటించడం జరిగింది.

1995వ సం॥లో సికింద్రాబాద్ హరిహర కళాభవన్‌లో శ్రీ కె. నాగేంద్రబాబుగారి అధ్యక్షతన రాష్ట్రంలోని అభిమానులే కాకుండా రాష్ట్రేతర ప్రాంతాల అభిమానులు కూడా హాజరై తమ మనోభావాల్ని వెల్లడించడమేగాక సేవాపథంలోకి మళ్ళాలన్న కాంక్షను బలంగా వెలిబుచ్చి రక్త, నేత్రదానాలపై అవగాహన సదస్సుగా ఆనాటి కార్యక్రమానికి కొత్త వన్నె తెచ్చారు, తత్ఫలితమే 1996లో రాష్ట్ర చిరంజీవి యువత పుట్టుక.

1996 ఆగస్టు 22వ తేదీ నుండీ మెగాస్టార్ చిరంజీవిగారు 1998 అక్టోబరు 2 'మహాత్మాగాంధీ జయంతి' రోజున చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్‌ను నెలకొల్పేంత వరకు అంటే రెండు సంవత్సరాల కాలం 'రాష్ట్ర చిరంజీవి యువత' సేవా కార్యక్రమాల్లో నిమగ్నమై తమ భవిష్యత్ గమనానికి పునాది వేసుకుంది. మొక్కలు నాటడం, బస్‌షెల్టర్లు నిర్మించడం, రక్తనేత్రదానాలపై అవగాహనను పెంపొందించడం, ఇందులో భాగంగా 1997వ సం॥ ఆగస్ట్ 22వ తేదీన మెగాస్టార్ చిరంజీవిగారు తన జన్మదినాన్ని పురస్కరించుకుని తొలి రక్తదాతగా రక్తదానం చేయండని పిలుపునిస్తే జంటనగరాలలో 2500 మంది, రాష్ట్ర వ్యాప్తంగా 25 వేల మందికి పైగా అభిమానులు స్వచ్ఛందంగా రక్తదానం చేయడం వంటి వాటితో మానవత్వానికి సరికొత్త ద్వారాలు తెరిచింది.

చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్ వ్యవస్థాపించబడ్డాక మెగాస్టార్ చిరంజీవిగారి పిలుపు మేరకు అభిమానులు సేవాపథంలో కొత్త పుంతలు తొక్కడమేగాక చిరంజీవిగారి పేరిట చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్ అంతర్భాగాలుగా విజయవాడ, కాకినాడ, రాజమండ్రి, విశాఖపట్టణంలలో ఏర్పాటైన చిరంజీవి వాలంటరీ బ్లడ్ డోనార్స్ క్లబ్‌లు ప్రగతిబాటలో పయనించడానికి కృషిచేశారు. చిరంజీవిగారికి స్ఫూర్తిగా నిలిచిన మానవీయ మూర్తి 'మదర్ థెరిసా' విగ్రహాల్ని తెలుగునాట అనేక ప్రధాన పట్టణాలలో ఆవిష్కరించి 'మేము సైతం' అన్పించుకున్న, ఘనతను, ఘనచరితను స్వంతం చేసుకున్నారు.

2000 సం॥లో 'రాష్ట్ర చిరంజీవి యువత' మొదలు పెట్టిన మెగాస్టార్ చిరంజీవిగారి జన్మదిన మహోత్సవాలు కోలాహలానికి, వైభవోపేత కమనీయ దృశ్య కల్పనకు,



రక్తదాతా సుఖీభవ! నేత్రదాతా సుఖీభవ!! చిరంజీవ సుఖీభవ!!!

మెగాస్టార్ చిరంజీవి పిలుపు మేరకు తెలుగునాట రక్తనేత్రదానంపై అవగాహన పెరిగి రక్తదానం ఒక మహోద్యమంగా రూపుదాల్చింది అనడానికి ఈ ఛాయాచిత్రం ఒక ఉదాహరణ, చిత్తూరు జిల్లా చిరంజీవి ప్రజాసేవాసమితి అధ్యక్షులు, ప్రముఖ న్యాయవాది రాయల సుధాకర్ సతీసమేతంగా చిరంజీవి బ్లడ్ బ్యాంక్‌లో రక్తదానం చేసి పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిని కుటుంబ సమేతంగా కలసి పుష్పగుచ్ఛంతో శుభాకాంక్షలందజేశారు. సుధాకర్‌ది ఓ పాజిటివ్ గ్రూపు రక్తంకాగా, ఆయన సతీమణి, చిత్తూరు జిల్లా పీలేరు జెడ్‌పిటిసి శ్రీమతి పి.వి.ఎస్. లక్ష్మిది 'ఓ నెగిటివ్' గ్రూపు రక్తం' ఇది చాలా అరుదైన బ్లడ్ గ్రూపు కావడంతో చిరంజీవిగారి సూచన మేరకు శ్రీమతి లక్ష్మి ప్రతి మూడు నెలలకొకసారి తాను రక్తదానం చేయడానికి తన సంసిద్ధతను తెలియజేశారు...

"18 సం॥లుపైబడి 60 సం॥లలోపు వయస్సుండి 45 కిలోల శారీరక బరువు కంటె ఎక్కువున్న వారెవరైనా ప్రతి మూడు నెలలకొకసారి రక్తదానం చేయవచ్చు".



చిరంజీవి కుమార్తె 'సుస్మితా విష్ణుప్రసాద్' వివాహ రిసెప్షన్‌లో అభిమానులనుద్దేశించి ప్రసంగిస్తున్న మెగాబ్రదర్ కె. నాగేంద్రబాబు, అన్నయ్య మాటల్ని ఆసక్తిగా ఆలకిస్తున్న పవర్ స్టార్ పవన్ కళ్యాణ్, గీతా ఆర్ట్స్ బాబు మరియు రచయిత.

సాంస్కృతిక శిఖరాగ్ర సంబరానికి, వీటికి మించి అంబరాన్ని చుంబించే మానవత్వ దీపికలుగా నిలుస్తూ వస్తున్నాయి.... ప్రతి ఏటా ఆగస్టు 21 సాయంత్రం రాష్ట్ర రాజధానిలో మొదలై ఆగస్టు 22 రాత్రి వరకూ ఏకధాటిగా ఈ కార్యక్రమాలు కొనసాగడం విశేషం, వీటిలో ప్రధానంగా సాంస్కృతిక కార్యక్రమాలు, రాష్ట్రంలో వివిధ రంగాల్లో విశేష కృషి చేసిన ప్రముఖుల సత్కారాలు, 10వ తరగతి, ఇంటర్మీడియెట్ పరీక్షల్లో ఉత్తీర్ణులై ప్రథమ, ద్వితీయ స్థానాల్లో నిలిచిన విద్యార్థినీ విద్యార్థులను బంగారు పతకాలతో అభినందించడం, అత్యధిక పర్యాయాలు రక్తదానం చేసిన రక్తదాతలను సత్కరించడం, ఉత్తమ చలన చిత్ర విమర్శక పురస్కారం, కీ॥శే॥ పద్మశ్రీ డా॥ అల్లు రామలింగయ్య స్మారక పురస్కారం, మెగాస్టార్ చిరంజీవి బర్త్‌డే లైఫ్‌టైమ్ ఎఛీవ్‌మెంట్ అవార్డ్ వంటి వాటిని అర్హులైన వారికి ప్రధానం చేయడమేగాక ఆనాటి కార్యక్రమం సకల కళల సంగమంలా వీక్షకులకు అనుభూతిని కలిగించే 'రాష్ట్ర చిరంజీవి యువత' మరురోజు ఉదయం అనగా మెగాస్టార్ చిరంజీవిగారి జన్మదినమైన ఆగస్టు 22వ తేదీ సర్వమత ప్రార్థనలతో ప్రారంభమయ్యే వేడుకలు ఆధ్యాత్మికతకు, భక్తి భావ రాగ సుధలకు అగ్రతాంబూలమిస్తూ 'శ్రీ చిరంజీవి మాల ఆంజనేయస్వామి దీక్ష'ను మాలధారణతో స్వీకరించి ఒక సత్సంప్రదాయానికి శ్రీకారం చుట్టడం జరిగింది. అనంతరం చిరంజీవి బ్లడ్ బ్యాంక్‌లో రక్తదాన కార్యక్రమంతోపాటు జంట నగరాలలోని వృద్ధ సేవాశ్రమాలు, అనాథ శరణాలయాలు, అంధ బాల బాలికల పాఠశాలలకు వెళ్ళి మెగాస్టార్ చిరంజీవి జన్మదిన వేడుకల్ని కేక్ కట్ చేసి వారి మధ్య జరుపుకుని వారికి విందు భోజనం ఏర్పాటు చేయడం, వస్త్రదానం చేసి రావడం వంటి కార్యక్రమాలతో ఆ రోజు జీవితకాలపు సంతృప్తిని మిగుల్చుకోవడం జరుగుతుంది. పేదలైన అభిమానులకు సినిమా థియేటర్‌ల వద్ద అన్నదాన కార్యక్రమం కూడా ఏర్పాటు చేసి పడుగూపేకలా కలసిపోయే నైజం 'రాష్ట్ర చిరంజీవి యువత'కే స్వంతం.

ఇక జన జీవన స్రవంతిలోకి వస్తే రాష్ట్రంలో వరద బీభత్సాలు, అగ్ని ప్రమాదాలు సంభవించినపుడు, ఎక్కడో గుజరాత్‌లో భూకంపం వస్తే వెళ్ళి ఆదుకున్నది, సుశిక్షితులైన సైనికుల్లా పని చేసిందీ, అన్న, వస్త్రదానాలు, వంట సామాగ్రి బాధితులకు అందించిందీ, సునామీ సముద్ర భూకంప బాధితులకు సహాయ నిధినీ, కార్గిల్ వీర జవానులకు సహాయ నిధిని, గుజరాత్ భూకంప బాధితులకు సహాయ నిధిని



అన్నయ్య చూపిన ఆశయాల దారిలో తానుసైతం అంటూ అడుగు ముందుకేస్తూ రక్తదాన శిబిరంలో అభిమానుల్ని ఉత్తేజితుల్ని చేస్తున్నారు, మెగాబ్రదర్ కె. నాగేంద్రబాబు



తాము చేసిన కార్యక్రమాల వివరాలను పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవికి వివరిస్తున్న కృష్ణాజిల్లా తిరువూరు అభిమానుల ప్రతినిధి వేమూరి సత్యనారాయణ (చంటి).




ఒమన్‌ను సందర్శించిన పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిని కలిసి అభినందించి ఆనందానుభూతిని పంచుకుంటున్న "చిరు మెగా యూత్ ఫోర్స్" "రక్తదానమే ప్రాణవేదమై నేత్రదానమే జీవిత అర్థమై మానవత్వానికి పట్టాభిషేకం జరిగినవేళ"...

'చిరు మెగా యూత్ ఫోర్స్' పేరిట మస్కట్‌లోని 'ఒమన్'లో ఉత్తరాంధ్రకు చెందిన ఇంజనీర్ 'రాందాస్ చందక', రాయసీమకు చెందిన 'రెహమాన్ ఖాన్' ఇంకా మధు, స్వామి, చిన్నారావులు 'రక్తదానం' ఎంత విలువైనదో తెలియజెపుతూ రక్తదాన శిబిరాన్ని నిర్వహించి సఫలీకృతులడమేగాక మరణించిన భారతీయుల మృతదేహాల్ని స్వదేశానికి తరలించడంలో సైతం ముఖ్యభూమిక పోషిస్తూ మానవత్వానికి నిర్వచనం చెబుతున్నారు.

అందించి ఈ క్రమంలో రాష్ట్ర ముఖ్యమంత్రిని, గవర్నర్‌ని, దేశ ప్రధానినీ ఆయా సందర్భాలలో కలసి అభినందించబడిన స్వర్ణ చరిత 'రాష్ట్ర చిరంజీవి యువత' లిఖించుకుంది...

ఈ ప్రయాణం ఇంతటితో ఆగదు, మొన్న చిరంజీవి ఛారిటబుల్ ఫౌండేషన్‌ని సందర్శించిన భారత రాష్ట్రపతి శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలాంగారు అత్యధిక పర్యాయాలు రక్తదానం చేసిన అభిమానుల్ని అభినందించాక 'రాష్ట్ర చిరంజీవి యువత' బాధ్యత మరింత పెరగడమేగాక ఈ పయనాన్ని అనంతంగా కొనసాగించగలిగే నేర్పుని, ఓర్పుని అలవరచుకోవాల్సి ఉంది. ఎందుకంటే అధికారికంగా 'రాష్ట్ర చిరంజీవి యువత' ప్రకటించబడి ఈ ఏటితో 'దశాబ్ది' పూర్తవుతోంది.

ఈ దశాబ్ది ఉత్సవాలతో ఉనికి నిలబెట్టుకుంటున్న 'రాష్ట్ర చిరంజీవి యువత' శతాబ్ది ఉత్సవాల వరకూ అదే ఉత్సాహాన్ని కొనసాగించాలి...

"నేను తెలంగాణావాదిని, నాది రాయలసీమ, మాది ఆంధ్ర అన్న ప్రాంతీయ ధోరణికాదు నేను చిరంజీవిగారి అభిమానిని, ఆయన దారిలో పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారి పిలుపు మేరకు మనది సేవా భావం, పంచాలి మంచిని, పెంచాలి మమతని, వెదజల్లాలి మానవత్వ పరిమళాల్ని, ఇది దివ్యపథం.... జై చిరంజీవా జగదేకవీరా! అసహాయ శూరా అంజనీ కుమారా !!

రాష్ట్ర చిరంజీవి యువత వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శిగా రవణం స్వామి నాయుడు, అధ్యక్షునిగా చలమలశెట్టి వెంకటేశ్వరరావు, ప్రధాన సలహాదారుగా బి. రాముయాదవ్‌లు వ్యవహరిస్తున్నారు.



రక్తదానం చేసి, తన అభిమాన కథానాయకుడు మెగాస్టార్ చిరంజీవిగారిని కలిసి ఆనందానుభూతిని పంచుకుంటున్న అభిమాని వద్లాని సుధాకర్



అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజస్

## ప్రాణం ఖరీదు

విడుదల : 22-9-1978

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : కె. వాసు

చిరంజీవి నటించగా విడుదలైన తొలిచిత్రం

చిరంజీవి పాత్ర పేరు 'నర్సయ్య'.

చిరంజీవి తన తొలి చిత్ర కథానాయిక అయిన 'రేష్మిరాయ్'తో కలసి ఆడిపాడిన యుగళగీతం 'ఏరియల్లో ఏరియల్లో' ఈ చిత్రంలోనిదే.

చిరంజీవికి ఈ గీతాన్ని నేపథ్యగానం చేసింది జి. ఆనంద్.

'ఏతమేసితోడినా ఏరు ఎండదు పొగిలి పొగిలి ఏడ్చినా పొంత నిండదు' అనే 'జాలాది' రాసిన పాపులర్ సాంగ్ ఈ చిత్రం లోనిదే.

## 'పునాదిరాళ్ళ' నుండీ 'పద్మభూషణ్' వరకూ..... మెగాస్టార్ చిరంజీవి-ఒక సుదీర్ఘ ప్రయాణం !!

కొణెదల వెంకట్రావు, అంజనాదేవిగార్లకు పుత్రోదయం - 1955 ఆగస్టు 22 సోమవారం ఉదయం పదిగంటలా ఐదు నిముషాలకు - జననం నరసాపురం మిషనరీ ఆసుపత్రి.

నామకరణం 'శివశంకర వరప్రసాద్'

తొలి ఫోటోగ్రాఫు తాత జె. ఆర్. కె. నాయుడుగారు నరసాపురం స్టూడియోలో తీయించారు.

ఓనమాలు దిద్దింది 'నిడదవోలు' శివుడి గుళ్ళో పిక్కపాశం పంతులు దగ్గర

అమ్మా ఆవూ ఇల్లూ ఈగ 'గురజాల'లో

ప్రతి మూడేళ్ళకీ నాన్నగారికి బదిలీలు

రెండు, మూడు తరగతులు 'మంగళగిరి'లో

నాలుగైదార్లు పొన్నూరులో

ఏడో క్లాసు 'మొగల్తూరు'



జయకృష్ణా మూవీస్

# మనవూరి పాండవులు

విడుదల : 9-11-1978

నిర్మాత : జయకృష్ణ

దర్శకత్వం : బాపు, సమర్పణ : కృష్ణంరాజు

చిరంజీవి పాత్ర పేరు 'పార్థు'.

చిరంజీవి నలుగురు కుర్రాళ్ళలో ఒక్కడైనా సూదంటు రాయిలా అందర్నీ ఆకట్టుకున్నారు.

ఈ చిత్రం ప్రివ్యూ చూసే ఆ సైకిలబ్బాయ్ ఎవడోగానీ అదరగొడుతున్నాడని, భవిష్యత్తు ఉంటుందనీ మహానటి సావిత్రి కితాబిచ్చారు.

ఈ చిత్రానికిగాను చిరంజీవి అక్షరాలా ఒక వెయ్యి నూట పదహార్లు పారితోషికం పొందారు, తొలి శతదినోత్సవ షీల్డుని ఈ చిత్ర సమర్పకులైన రెబల్‌స్టార్ కృష్ణంరాజుగారి చేతుల మీదుగా అందుకున్నారు.

ఎనిమిదీ తొమ్మిదీ బాపట్ల

చెల్లాయిలు విజయదుర్గ, మాధవి

తమ్ముళ్ళు నాగేంద్రబాబు, కళ్యాణ్‌కుమార్

బాల్యంలో అభిరుచులు స్టాంపుల సేకరణ, తమ్ముడు నాగబాబుతో బాక్సింగ్, బాణాలు వేయడం, వేసవి సెలవుల్లో కాలవల్లో ఈతలు కొట్టడం వగైరాలు

పదో తరగతి మళ్ళీ 'మొగల్తూరు'

ఇంటర్మీడియెట్ ఒంగోలు సీ ఎస్సార్ శర్మా కాలేజి గ్రూపు బై.పి.సి.

డిగ్రీ (బి.కాం) పుట్టిన చోటే 'నరసాపురం' ఎన్.ఎం. కాలేజీ.

చదువుతూ రంగు పూసుకుని రంగమెక్కి వేసిన నాటకాలు పరధ్యానం పరంధామయ్య పంతులు, రాజీనామా, లైటు వెలిగింది - 1976వ సం॥లో ఎన్.సి.సి. కేడెట్ కెప్టెన్‌గా న్యూఢిల్లీలో జరిగిన సాంస్కృతికోత్సవాల్లో రాజ్‌పథ్‌లో పోతురాజు పోలేరమ్మల నృత్య రూపకంలో పోతురాజు పాత్ర పోషణ.

1977లో కాస్ట్ అక్కౌంటెన్సీ చదువుతానని చెప్పి 'మద్రాసు'కు పయనం.



పూర్ణోదయ ఆర్ట్ క్రియేషన్స్

## తాయారయ్య బంగారయ్య

విడుదల : 12-1-1979

నిర్మాత : ఏడిద నాగేశ్వరరావు

దర్శకత్వం : కొమ్మినేని

ఈ చిత్రంలో రేపిస్ట్‌గా ఒక అతిథి పాత్రలో 5 నిమిషాలపాటు నటించారు.

శతదినోత్సవ చిత్రం. చిన్న డ్యాన్స్ బిట్ లాంటిది ఉంటుంది, సెట్లో చిరంజీవి ఈజ్‌కి అదిరిపోయారంతా.

గోపీకృష్ణా ఇంటర్నేషనల్

## కుక్కకాటుకు చెప్పు దెబ్బ

విడుదల : 1-3-1979

నిర్మాత : చలసాని గోపి

దర్శకత్వం : ఈరంకి శర్మ

"చలాకీగా చేస్తున్నాడు చిరంజీవని కొత్త కుర్రాడు" అంటూ నలుగురూ మాట్లాడుకున్నారు ఈ చిత్రంలో నటన, డ్యాన్సు చూసి.

కాస్ట్ అక్కౌంటెన్సీ మాటెలా ఉన్నా 1978లో సౌత్ ఇండియన్ ఫిలిం ఫెడరేషన్ ఇన్‌స్టిట్యూట్ నుండీ నటనలో డిప్లమా

1978లోనే 'పునాదిరాళ్ళు' కోసం కెమెరా ముందుకి

శివ శంకరవరప్రసాద్ కాస్తా వెండితెర కోసం 'చిరంజీవి' అయ్యాడు.

ఇదే ఏడు సెప్టెంబర్ 22న ప్రేక్షకుల ముందుకి 'ప్రాణం ఖరీదు'.

'మనవూరి పాండవులు' చిత్రానికిగాను వంద రోజుల షీల్డు, తొలిసారి పారితోషికం 1116/- రూపాయలు.

1979లో పూర్తి స్థాయి హీరోగా తొలి శతదినోత్సవ చిత్రం 'కోతలరాయుడు' విడుదల, చక్కటి గుర్తింపు.

1980 ఫిబ్రవరి 20 బుధవారం ఉదయం పదకొండూ యాభై వివాహ ఘడియ - మద్రాస్ రాజేశ్వరీ కళ్యాణ మండపం - వధువు సురేఖ.

అత్తమామలు 'అల్లు కనకరత్నం, అల్లు రామలింగయ్యగార్లు

బావ అల్లు అరవింద్



సత్యచిత్ర

## కొత్తల్లుడు

విడుదల : 31-5-1979

నిర్మాత : సత్యనారాయణ

దర్శకత్వం : పి. సాంబశివరావు

కృష్ణ హీరోగా చిరంజీవి విలన్‌గా నటించిన చిత్రం.

శ్రీ గౌరి కంబైన్స్



విడుదల : 1-6-1979

నిర్మాత : ఎన్. కుమారస్వామి

దర్శకత్వం : వాయునందనరావు

ప్లే బోయ్ తరహాపాత్ర, ప్రేమించి తను మోసం చేసిన ప్రియురాలే ఇల్లాలిగా తన జీవితంలో అడుగుపెట్టి కనువిప్పు కలిగిస్తుంది, అంగవైకల్యంతో చిరంజీవి కాస్సేపు ఈ చిత్రంలో కనిపిస్తారు, ఎంతో సమర్థవంతంగా నటించారు.

తోడల్లుడు డాక్టర్ కొప్పినీడి వెంకటేశ్వరరావు, వదిన వసంతలక్ష్మి

ఇదే ఏడు 'మొగుడు కావాలి' తొలి రజతోత్సవ చిత్రం

'పున్నమినాగు'తో మరింత ప్రఖ్యాతి, ఉత్తమ నటుడిగా తొలి ఫిలింఫేర్ అవార్డు

1981లో న్యాయం కావాలి, 47 రోజులు, కిరాయి రౌడీలు నిలబెడితే 'చట్టానికి కళ్ళు లేవు'తో కమర్షియల్ హీరోగా మలుపు

1982లో అమ్మాయి పుడితే 'సుస్మిత' అని పేరు పెట్టుకున్నారు

'ఇంట్లో రామయ్య వీధిలో క్రిష్ణయ్య' 525 రోజులు ఆడింది

'శుభలేఖ' బావ అరవింద్ తీసిన సినిమా, గుణచిత్ర కథానాయకుడిగా అన్ని వర్గాల ప్రేక్షకుల హర్షాతిరేకం

పట్నం వచ్చిన పతివ్రతలు, బిల్లా రంగా, యమకింకరుడు, మంచుపల్లకి ఒక చిత్రంలోని పాత్రతో మరో పాత్రకు పోలికే లేదు

1983లో పల్లెటూరి మొనగాడు, అభిలాష, మంత్రిగారి వియ్యంకుడు, ఆలయ శిఖరం,



1978లో 'పునాదిరాళ్ళు' చిత్రం కోసం తీసిన తొలి మేకప్ స్టిల్

ధర్మ విజయ కంబైన్స్

# పునాదిరాళ్ళు

విడుదల : 21-6-1979

నిర్మాత : ఫజులుల్లాహక్

దర్శకత్వం : రాజ్‌కుమార్ గూడపాటి

చిరంజీవి నటించడానికి ఒప్పుకున్న తొలి చిత్రం ఇది.

చిరంజీవి పాత్ర పేరు 'రాము'.

'ఏ ఊరు ఏ వాడ పిల్లా నీది' అనే గీతంలో ప్యాంట్, షర్ట్‌లపై చీరకట్టుకుని డ్యాన్స్ చేసి హుషారెత్తిస్తారు.

"రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డు" తృతీయ ఉత్తమ చిత్రం.

ఈ చిత్రం కోసమే తొలిసారి చిరంజీవి కెమెరా ముందు నిలబడింది, 1978 ఫిబ్రవరి 11, ఇదే రోజు తొలి డైలాగ్ చెప్పారు.

మహానటి సావిత్రి ఆఖరుదశలో నటించిన చిత్రం.

షూటింగ్ సమయంలో చిరంజీవి అంకితభావాన్ని, నిబద్ధతని సునిశితంగా పరిశీలించిన కెమెరామెన్ పి.ఎస్. నివాస్ చిరంజీవితో "నువ్వు ఇలాగే కష్టపడితే నీకు తిరుగుండదు, ఇదే క్రమశిక్షణను కొనసాగిస్తే నువ్వు చాలా ఎదుగుతావ్" అని అభినందించడం జరిగింది.

రోషగాడు, మగమహారాజు, గూఢచారి నెంబర్ వన్, సంఘర్షణ ఇవన్నీ ఒకెత్తు, 'ఖైదీ' ఒక్కటీ ఒక్కెత్తు, కోటి రూపాయల వసూళ్ళు సాధించి తెలుగు సినిమా ఎకనామిక్సుని ప్రభావితం చేసి తెలుగు సినీ హీరో రూపురేఖల్ని మార్చిపారేసిన 'ఖైదీ', ప్రేక్షకుల గుండెల్లో ఖైదీ 'చిరంజీవి'

నటకిషోర్, నటభాస్కర, డేరింగ్ డేషింగ్ డైనమిక్ హీరో వచ్చిన బిరుదులు

1984లో గూండా, దేవాంతకుడు, ఛాలెంజ్, ఇంటిగుట్టు హిట్లు

1985లో వారసుడు పుడితే 'రామ్‌చరణ్ తేజ' అంటూ సంబరపడిపోయారు, ఈ యేడు చట్టంతో పోరాటం, దొంగ, జ్వాల, రక్తసింధూరం, అడవిదొంగ, విజేత స్థాయిని పెంచాయి, 'సుప్రీమ్ హీరో'ని చేశాయి

1986, 1987ల్లో కొండవీటి రాజా, రాక్షసుడు, చంటబ్బాయ్, దొంగమొగుడు, మగధీరుడు, ఆరాధన, చక్రవర్తి, పసివాడి ప్రాణం, స్వయంకృషి తీపిగుర్తులు, ఆకాశమెత్తుకు పెరిగిన 'ఇమేజ్'

'స్వయంకృషి'లో నటనకు ఉత్తమనటుడిగా తొలిసారి రాష్ట్ర ప్రభుత్వ బంగారు నంది అవార్డు



భారత్ ఫిలింస్

## ఇది కథ కాదు

విడుదల : 29-6-1979

నిర్మాత : టి. విశ్వేశ్వరరావు

దర్శకత్వం : కె. బాలచందర్

'శాడిస్ట్ భర్త' పాత్రలో మెప్పించి ఒప్పించడమేగాక 'What a spell bounding performence' అంటూ విమర్శకుల ప్రశంసలు కూడా అందుకున్నారు చిరంజీవి. ప్రసిద్ధ దర్శకులు కె. బాలచందర్ దర్శకత్వంలో చిరంజీవి తొలిసారిగా నటించిన చిత్రం.

చిరంజీవి కమల్‌హాసన్‌లు కలసి నటించిన చిత్రమేగాక విజయవంతంగా ప్రదర్శించబడింది.

చిరంజీవి సరసన 'జయసుధ' కథనాయికగా నటించిన తొలి చిత్రం.

1988లో మంచిదొంగ, యముడికిమొగుడు, మరణమృదంగం, ఖైదీనెం. 786 హిట్లు, నిర్మాతగా మారి అంజనా ప్రొడక్షన్స్ పతాకంపై నిర్మించిన 'రుద్రవీణ' చిత్రానికి జాతీయ అవార్డు, వంద చిత్రాలు పూర్తయిన శుభ సందర్భము, సుప్రీం హీరో కాస్తా 'మెగాస్టార్'గా అవతరించిన విశేషమూ కూడా ఇదే యేడు

ఆస్కార్ ఉత్సవాలకు అతిథిగా ఆహ్వానం అందుకున్న తొలి తెలుగు సినీ కళాకారుడిగా సరిక్రొత్త ఘనత, రష్యన్ చలన చిత్రోత్సవాలకు తమ్ముడు నాగేంద్రబాబుతో

రష్యన్ భాషలోకి పసివాడి ప్రాణం, స్వయంకృషి

1989లో పుట్టిన అమ్మాయికి 'శ్రీజ' అని నామకరణం

ఈ యేడు అత్తకుయముడు అమ్మాయికి మొగుడు, స్టేట్‌రౌడీ ఘన విజయాలు

1990లో కొండవీటి దొంగ, జగదేకవీరుడు అతిలోకసుందరి, కొదమసింహం హిట్లు, వరుసగా మూడూ కాస్ట్యూమ్ డ్రామాలే, సెప్టెంబరు 28న అల్లు అరవింద్ 'ప్రతిబంధ్' పేరిట హిందీ చిత్రం నిర్మిస్తే ఉత్తరాదిన ఒక ఊపు ఊపేసింది, తెలుగువాడి వాడీ, వేడీ 'చిరంజీవి' రూపంలో రుచి చూపించింది



రవిచిత్ర ఫిలింస్

## శ్రీరామబంటు

విడుదల : 3-8-1979

నిర్మాత : వై.బి.రావు

దర్శకత్వం : ఐ.ఎస్. మూర్తి

చిరంజీవి దశను కొంత మార్చిన చిత్రం, విజయవంతంగా ప్రదర్శించబడింది.

శ్రీ చరిత చిత్ర

## కోతలరాయుడు

విడుదల : 15-9-1979

నిర్మాత : తమ్మారెడ్డి వి.కె.

దర్శకత్వం : కె. వాసు

యాంటీ హీరో షేడ్స్ ఉన్నా చిరంజీవి "పూర్తి స్థాయి హీరో"గా నటించగా విడుదలై "తొలి శతదినోత్సవ చిత్రం"గా నిలిచింది. చిరంజీవి టైటిల్ రోల్ ధరించిన ఈ చిత్ర శతదినోత్సవ వేడుకలు చెన్నైలోని హోటల్ పామ్‌గ్రోవ్‌లో జరిగాయి.

1991లో 'గ్యాంగ్‌లీడర్', 'రౌడీ అల్లుడు' బాక్సాఫీస్‌ని ఆక్రమించుకున్నారు, 'గ్యాంగ్‌లీడర్' తెలుగు నేలపై ఒకే రోజు ఏలూరు, హైదరాబాదు, తిరుపతి, విజయవాడల్లో వందరోజుల వేడుకలు జరుపుకున్నాడు

1992లో 'ఘరానా మొగుడు' చిత్రమూ, హండ్రెడ్డేసు ఫంక్షనూ జాతీయ స్థాయి వార్తలకెక్కాయి, చిరంజీవి రాజకీయ ప్రవేశంపై ఊహాగానాలు చెలరేగాయి

'ఆపద్బాంధవుడు' చిత్రంలోని నటనకుగాను మరోసారి ఉత్తమ నటుడిగా రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డు

1993లో ఆజ్‌కా గూండారాజ్ (హిందీ), ముఠామేస్త్రి ఇమేజ్‌కి తగ్గ చిత్రాలు

1994లో ముగ్గురు మొనగాళ్ళు ముగ్గురూ చిరంజీవులే

1995లో అల్లుడా మజాకా అంచనాలందుకున్నా తక్కినవే తారుమారు అయ్యాయి

ఎనిమిది మాసాలు 'మేకప్'కు దూరం 'తెలుగు'లో



శ్రీ శారద ఇంటర్‌నేషనల్

## అగ్ని సంస్కారం

విడుదల : 21-2-1980

నిర్మాతలు : జి. వసుమతిదేవి, పి. రమాదేవి

దర్శకత్వం : జి.వి. ప్రభాకర్

చిరంజీవి అల్లు రామలింగయ్య కుమార్తె సురేఖను పరిణయమాడింది 20-2-1980. ఆ మరుసటి రోజు విడుదలైన 'అగ్ని సంస్కారం' చిత్రానికి నవ వధూవరులిద్దరూ వెళ్ళి చూసొచ్చారు, అలా పెళ్ళయ్యాక చిరంజీవి తన శ్రీమతికి చూపించిన తొలి చిత్ర రాజంగా 'అగ్ని సంస్కారం' నిలిచి పోయింది.

1996లో కన్నడ 'సిపాయి' చిత్రం. కురిపించింది కనక వర్షం

1997లో 'హిట్లర్'గా పునరాగమనం. మోగించిన విజయభేరి

ఇదే యేడు 'మాస్టర్'గా విజృంభణ

హిట్లర్, మాస్టర్ చిత్రాల్లోని నటనకుగాను స్క్రీన్ వీడియోకాన్‌వారి 'ఉత్తమ నటుడి' అవార్డు

తెలుగు సినీ చరిత్రలో తొలి Dts చిత్రంగా నిలిచిన 'మాస్టర్'

1998లో బావగారూ బాగున్నారా, చూడాలని వుంది, 1999లో స్నేహం కోసం, ఇద్దరు మిత్రులు. 2000 సహస్రాబ్దిలో అన్నయ్య దాకా అప్రతిహతంగా జైత్రయాత్ర

'మాస్టర్'లో పాట పాడ్డం, బావగారూ బాగున్నారాలో బంగీ జంపు ఆటవిడుపు

1998 అక్టోబర్ 2 మహాత్మాగాంధీ జయంతి రోజు 'చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్' ఆవిర్భావం

విజయాల బాటలో మానవత్వానికి సరికొత్త నిర్వచనాలు ఇచ్చి సేవాపథంలో దివ్య ఆరోగ్య జ్యోతుల్ని వెలిగించింది. చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్



సత్యచిత్ర

## కొత్తపేట రౌడి

విడుదల : 7-3-1980
నిర్మాతలు : సత్యనారాయణ, సూర్యనారాయణ
దర్శకత్వం : పి. సాంబశివరావు

చిరంజీవి విలన్‌గానే నటించిన మరో చిత్రం ఇది, అయితే ఒకవైపు హీరోగా రాణిస్తూ వైవిధ్యం కోసం విలన్‌గా కూడా నటించగా చిరంజీవిని కొందరు నిర్మాతలు సున్నితంగా మీకు హీరోగా ఉజ్వల భవిష్యత్తుంది, విలన్ వేషాలు మానెయ్యండని చెప్పారట 'ఈ చిత్రం చూస్తే' జ్యోతిలక్ష్మితో కలసి చిరంజీవి చేసిన డ్యాన్స్ అప్పట్లో కుర్రకారుని ఓ ఊపు ఊపేసింది.

అంజలి పిక్చర్స్

## చండీప్రియ

విడుదల : 7-3-1980 నిర్మాత : ఆదినారాయణరావు
దర్శకత్వం : వి. మధుసూదనరావు

ప్రతిష్ఠాత్మక సంస్థ 'అంజలి పిక్చర్స్'లో 'విక్టరీ మధు సూదనరావు' దర్శకత్వంలో చిరంజీవి నటించిన ఏకైక చిత్రం ఇది. సుప్రసిద్ధ సంగీత దర్శకులు ఆదినారాయణరావు ఈ చిత్ర నిర్మాత. శోభన్‌బాబుతో కలసి నటించిన తొలి చిత్రం.

2001లో 'శ్రీమంజునాథ' పూర్తి స్థాయి భక్తి రస పౌరాణిక చిత్రం, మహా శివుడిగా, వృద్ధభోక్తగా, అఘిరాగా, జంగమదేవరగా అద్వితీయ పాత్రపోషణం రస మధురం

2002లో 'ఇంద్ర'ప్రదేశ్‌గా మారిన ఆంధ్రప్రదేశ్ పాత రికార్డులకు తిలోదకాలిస్తూ 'ఇంద్ర'తో అత్యధిక అర్ధశత, శత, రజతోత్సవ దినకేంద్రాల రికార్డు

'ఇంద్ర' చిత్రంలో పాత్ర పోషణకుగాను మూడవసారి రాష్ట్ర ప్రభుత్వ బంగారు నంది అవార్డు

2003లో 'ఠాగూర్'గా మరో చైతన్యవంతమైన పాత్ర ద్వారా విశేష ఆదరణ, అత్యధిక అర్ధశత, శతదినోత్సవ కేంద్రాల రికార్డుని (ఇంద్ర) అధిగమించి సరికొత్త రికార్డుల సృష్టి, నేటికీ ఇవే కొలమానాలు, ఎవరికైనా లక్ష్యాలు

'ఠాగూర్'కు మాటీవీ, సంతోషం ఫిలిం అవార్డులు

2004లో విడుదలైన 'అంజి' "అత్యున్నత సాంకేతిక విలువలుగల" చిత్రంగా జాతీయ అవార్డుకి ఎంపిక



టి.వి. ఫిలింస్

## ఆరని మంటలు

విడుదల : 15-3-1980

నిర్మాతలు : కె. మహేంద్ర, టి. వెంకటేశ్వర్లు

దర్శకత్వం : కె. వాసు

చెల్లెల్ని హత్య చేసిన హంతకులని వెదికి పగ తీర్చుకోవాలనుకునే అన్నగా చిరంజీవి చక్కగా నటించడమే గాక ఈ చిత్రంలో ఎన్నో విచిత్ర వేషధారణల్లో కూడా కనిపిస్తారు.

సౌమ్య సినీ ఆర్ట్స్

## జాతర

విడుదల : 19-4-1980

నిర్మాత : ఆర్.ఎస్. రామరాజు

దర్శకత్వం : ధవళ సత్యం

అభ్యుదయ భావాలుగల ఈ చిత్రంలో చిరంజీవిని హీరోయిన్ ఇంద్రాణి 'సుక్కల్లో సెందురుడు' అంటూ ఉంటుంది, అప్పట్లో చాలా పాపులర్ అయిందా డైలాగ్.



ఇదే యేడు 'శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్'గా తెలుగునాట వినోదభరిత వైవిధ్య పోషణతో ఆనంద తాండవం

ఇప్పటి వరకూ 69వేల పేద రోగులకు చిరంజీవి బ్లడ్ బ్యాంక్ ద్వారా ఉచిత రక్తదానం

కంటి చూపులేని అంధులకు 1700 మందికి చిరంజీవి ఐ బ్యాంక్ ద్వారా నేత్రదానం

1996లో తమ్ముడు పవన్ 'కళ్యాణ్', 2003లో మేనల్లుడు అల్లు అర్జున్ కథానాయకులుగా చిత్రరంగ ప్రవేశం

"భారతదేశంలోని శక్తివంతులైన 50 మంది భారతీయులలో చిరంజీవి స్థానం'' అంటూ ఇండియాటుడే వెల్లడ

పున్నమినాగు, శుభలేఖ, రుద్రవీణ, ముఠామేస్త్రి, స్నేహం కోసం, ఇంద్ర, శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్‌తో కలిపి 7 ఫిలింఫేర్ అవార్డులు ఇప్పటి వరకూ అందుకున్న ఏకైక తెలుగు కళాకారుడిగా అరుదైన ఘనత

వరుసగా రాష్ట్ర ప్రభుత్వం నుండీ 3 సార్లు బెస్ట్ వాలంటరీ సర్వీస్ ఆర్గనైజేషన్‌గా చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్‌కు అవార్డులు



అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజస్

# మోసగాడు

విడుదల : 22-5-1980

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

చిరంజీవి నటించగా విడుదలైన తొలి చిత్రం 'ప్రాణం ఖరీదు'ని నిర్మించిన పతాకంపై చిరంజీవి విలన్‌గా 'మోసగాడు' చిత్రంలో నటించారు.

'శ్రీదేవి' చిరంజీవి సరసన నటించిన తొలి చిత్రం.

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో చిరంజీవి నటించిన తొలి చిత్రం.

విలన్ అయినా చిరంజీవి శ్రీదేవితోను, జయమాలినితోను చేసిన డ్యాన్సులు థియేటర్లకి కుర్రకారుని లాక్కెళ్ళగలిగాయి.

శతదినోత్సవ చిత్రం.



అత్యుత్తమ ఆదాయపు పన్ను చెల్లింపుదారుడిగా విశిష్టాత్మక సమ్మాన్ అవార్డు

సినిమా ఎక్స్‌ప్రెస్ అవార్డ్, తమిళనాడు శివాజీగణేషన్ అవార్డు అందివచ్చాయి అణకువ పెంచాయి

అభిమానుల్ని సేవ, ఆధ్యాత్మికత, మనోవికాసం వైపు పయనింపజేసి 'మానవతావాది'గా అవతరించిన మెగాస్టార్

అభిమానుల ఆశీస్సులే ఉంటే ఇంకో పాతికేళ్ళు మెగాస్టార్‌గానే కొనసాగుతానని ఉద్ఘాటన

మానవీయ మూర్తి మదర్‌థెరిసా చిరంజీవి సేవా కార్యక్రమాలకు 'స్ఫూర్తి' కావడంతో ఆంధ్రదేశం అంతటా అభిమానులచే మదర్ థెరిసా విగ్రహాల ఆవిష్కరణ

దేశ విదేశాల్లో సైతం చిరంజీవి అభిమానులచే సేవా కార్యక్రమాల నిర్వహణ

శంకర్‌దాదాలోని నటనకుగాను రెండోసారి సంతోషం ఫిలిం అవార్డు

2005లో అందరివాడు, జై చిరంజీవ వినోద ప్రధానంగా సాగిన చిత్రాలు



ఏ.వి.ఎం. ప్రొడక్షన్స్

# పున్నమినాగు

విడుదల : 13-6-1980

నిర్మాతలు : కుమరన్, శరవణన్, బాలసుబ్రహ్మణ్యన్

దర్శకత్వం : రాజశేఖర్

అసమాన నటనా వైదుష్యంతో ప్రేక్షకుల్ని, పరిశ్రమని 'నాగరాజు'గా మంత్రముగ్ధుల్ని చేశారు చిరంజీవి, ప్రసిద్ధ నిర్మాణ సంస్థ ఏ.వి.ఎం. ప్రొడక్షన్స్‌లో చిరంజీవి నటించిన చిత్రం.

'పున్నమి రాత్రీ' అనే పాపులర్ గీతం ఈ చిత్రంలోనిదే.

'కోడెనాగుకై కొదమనాగిని కన్నులు మూసే రాత్రీ' అంటూ తన కళ్ళతో శృంగార బీభత్సం సృష్టించిన చిరంజీవి ఈ చిత్రంలోని నటనకుగాను ఉత్తమనటుడిగా తొలిసారి 'ఫిలింఫేర్' అవార్డుని పొందారు.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రం.

2006 జనవరి 26న భారత ప్రభుత్వం నుండీ ప్రతిష్టాత్మక 'పద్మభూషణ్' పురస్కార గ్రహీతగా ప్రకటన

2006 మార్చి 2న 'మామగారి'గా ప్రమోషన్, చి॥ విష్ణుప్రసాద్‌తో కుమార్తె సుస్మిత వివాహం, కమనీయం ఈ కళ్యాణోత్సవం

2006 మార్చి 5న అభిమానులకు ప్రత్యేకంగా వివాహ రిసెప్షన్ ఇచ్చి "ఈ బంధంతో మీతో నాకు ఉన్న అనుబంధం రెట్టింపైందని భావోద్వేగంగా ప్రకటించిన మెగాస్టార్ చిరంజీవి

2006 మార్చి 29న దేశ రాజధాని ఢిల్లీలో భారత రాష్ట్రపతి శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలామ్‌గారి చేతుల మీదుగా 'పద్మభూషణ్' స్వీకారం, తెలుగువారి గుండెల్లో చిరకాలం తీపి గురుతు ఈ సంఘటన

ఇదే యేడు స్వంత భవనంలోకి చిరంజీవి ఛారిటబుల్ ట్రస్ట్

2006 జూన్ 10 చిరంజీవి బ్లడ్ బ్యాంక్‌లో కాంపోనెంట్ యూనిట్‌ని ప్రారంభించిన రాష్ట్రపతి భారతరత్న శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలామ్, "కళాకారుడికి సామాజిక బాధ్యత ఉండాలని అందుకు నిదర్శనం చిరంజీవిగారు'' అని రాష్ట్రపతి ఉవాచ. ప్రతి తెలుగువాడూ గుండె నిండుగా గర్వించిన రోజు



రవిచిత్ర

## నకిలీ మనిషి

విడుదల : 1-8-1980

నిర్మాత : వై.వి. రావు

దర్శకత్వం : ఎస్.డి. లాల్

చిరంజీవి హీరోగా, విలన్‌గా కూడా తానే ద్విపాత్రాభినయం చేసి నటనలో వైవిధ్యాన్ని ప్రదర్శించారు.

చిరంజీవి ద్విపాత్రాభినయం చేసిన తొలి చిత్రం.

సుజాత ఫిలింస్ ప్రైవేట్ లిమిటెడ్

## కాళి

విడుదల : 19-9-1980

నిర్మాత : రామ్‌జీ     దర్శకత్వం : ఐ.వి. శశి

ప్రసిద్ధ మలయాళ దర్శకుడు ఐ.వి. శశి దర్శకత్వంలో చిరంజీవి నటించిన చిత్రం. "చిరంజీవి, రజనీకాంత్ కలసి హీరోలు"గా నటించిన ఏకైక చిత్రం. మెస్ట్రో ఇళయరాజా చిరంజీవి చిత్రానికిగాను తొలిసారి సంగీతం అందించింది ఈ చిత్రానికే.

యావత్ తెలుగు సినీ పరిశ్రమా 2006 ఏప్రిల్ 23 'పద్మభూషణ్ చిరంజీవి'ని సముచిత రీతిన సత్కరించడమేగాక అగ్రశ్రేణి జాతీయనటుడు అమితాబ్‌బచ్చన్‌ని ముఖ్య అతిథిగా ఆహ్వానించగా చిరంజీవి గమనంతో, నియమంతో, అభినయంతో 'తెలుగు'కి అంతర్జాతీయ వెలుగు వచ్చిందని, పద్మభూషణ్ చిరంజీవి భవిష్యత్తులో 'భారతరత్న' చిరంజీవి కావాలని సభాముఖంగా ఆకాంక్షించి ఆశీర్వదించిన బిగ్ బి అమితాబ్ బచ్చన్

2006 సెప్టెంబర్‌లో చీకటిని పారద్రోలి చిరుదివ్వెని వెలిగించి, ఆ దివ్వె వే వేల జ్యోతులుగా ప్రకాశవంతంగా ప్రజ్వలించడానికి 'స్టాలిన్'గా అవతరించనున్న పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవి

సర్వేజనా స్సుఖినోభవంతు....



కౌముది ఆర్ట్స్

## తాతయ్య ప్రేమలీలలు

విడుదల : 19-9-1980

నిర్మాత : ఎం.ఎస్. రెడ్డి

దర్శకత్వం : బి.వి. ప్రసాద్

నేటి ప్రసిద్ధ నిర్మాత ఎం. శ్యాంప్రసాద్‌రెడ్డి అయిన అప్పటి అగ్ర నిర్మాత ఎం.ఎస్. రెడ్డి నిర్మించిన చిత్రం.

ఈ చిత్రం షూటింగ్‌లో ఉన్నప్పుడే 'చిరంజీవి' నిజ జీవితంలో పెళ్ళికొడుకు కావడం జరిగింది.

ఎస్.వి.ఎస్. ఫిలింస్

## లవ్ ఇన్ సింగపూర్

విడుదల : 27-9-1980

నిర్మాత : ఎం. చంద్రకుమార్

దర్శకత్వం : ఓ.ఎన్.ఆర్. ఆంజనేయులు

విదేశీ హీరోయిన్ 'మెర్లిన్' చిరంజీవి సరసన నాయికగా నటించింది.

తొలిసారి విదేశాల్లో షూటింగ్ జరుపుకున్న చిరంజీవి చిత్రం.

### తెర తీయగరాదా...

కెరీర్ తొలినాళ్ళలో చిరంజీవి ఒక తమిళ చిత్రంలో హీరోగా నటించడానికి ఒప్పుకున్నారు, ఆ చిత్రం కొద్ది రోజులు షూటింగ్ జరిగి ఆగిపోయింది, విశేషమేమిటంటే ఈ చిత్రంలో చిరంజీవి సరసన కథానాయిక కె.ఆర్. విజయ, ఆవిడే ఈ సంగతి చెప్పారు, ఈ చిత్రం పూర్తై విడుదలై ఉండి ఉంటే తమిళంలో కూడా చిరంజీవి విజృంభించి ఉండేవారని కె.ఆర్. విజయ అభిప్రాయపడ్డం జరిగింది.

విక్టరీ వెంకటేష్, యాక్షన్ కింగ్ అర్జున్, నటకిరీటి రాజేంద్రప్రసాద్ హీరోలుగా రూపొందించబడిన 'త్రిమూర్తులు' చిత్రంలో మొదటి పాటలో తారలందరితో పాటు చిరంజీవి కూడా కాస్సేపు కనిపించి కనువిందుచేశారు.

'చిన్నారి చేతన' అనే 3D చిత్రాన్ని తెలుగులో విడుదల చేస్తూ ప్రారంభంలో 3D కళ్ళద్దాలు ఎలా వాడాలో చెప్పే జాగ్రత్తలు తెరపై చిరంజీవి చేత చెప్పించారు, ఒక వ్యక్తికి 3D కళ్ళద్దాల్ని చిరంజీవి అమర్చి చూపిస్తారు, ఆ వ్యక్తి అల్లు అరవింద్.

చిరంజీవి నటించినా విడుదల కాని చిత్రాలు వడ్డీకాసులవాడు, చిన్నపులి పెద్దపులి, ఇవి నిర్మాతల వ్యక్తిగత కారణాల వల్ల విడుదల కాలేదు, వీటిలో



ప్రభుచిత్ర

## ప్రేమ తరంగాలు

విడుదల : 24-10-1980

నిర్మాత : ఎమ్.వి.హెచ్. రాయపరాజు

దర్శకత్వం : ఎస్.పి. చిట్టిబాబు

నేటి మెగామేకర్ ఎం.ఎస్. రాజు తండ్రి ఎమ్.వి. హెచ్. రాయపరాజు చిరంజీవితో నిర్మించిన చిత్రం ఇది. చిరంజీవి తొలిసారిగా లాయర్ పాత్ర ధరించింది ఈ చిత్రంలోనే.

చరిత చిత్ర

## మొగడు కావాలి

విడుదల : 15-11-1980

నిర్మాత : తమ్మారెడ్డి వి.కె. దర్శకత్వం : కట్టా సుబ్బారావు

చిరంజీవి చిత్రాల్లో తొలి రజతోత్సవ చిత్రం, ఈ చిత్ర రజతోత్సవ వేడుకలు చెన్నైలోని హోటల్ పామ్ గ్రోవ్‌లో జరిగాయి. 'ఓ చిలకా' అనే పాపులర్ గీతం ఈ చిత్రంలోనిదే. ఓ డబ్బున్న అమ్మాయికి కిరాయి మొగుడిగా కుదిరి ఆ అమ్మాయి మనసు మార్చే పాత్రలో చిరంజీవి చక్కగా రాణించారు. చిరంజీవి డ్యాన్సులకి ప్రేక్షకులు ఆనందానికి లోనై తెరపైకి డబ్బులు విసరడం మొదలైంది 'మొగుడు కావాలి'తోనే.

చిన్నపులి పెద్దపులి చిత్రానికి పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు.

1990లో అల్లు అరవింద్ 'అత్తకు యముడు అమ్మాయికి మొగుడు' చిత్రాన్ని తమిళంలో రజనీ కాంత్ కథా నాయకుడిగా గీతా ఆర్ట్స్ పతాకంపై 'మాప్పిళ్ళై' పేరిట నిర్మించారు, గీతా ఆర్ట్స్ చిత్రాలన్నింటికీ పద్మశ్రీ అల్లు రామలింగయ్యగారు సమర్పకులైతే ఈ "మాప్పిళ్ళై" చిత్రానికి 'చిరంజీవి' సమర్పకులు, అంతేకాదు రజనీకాంత్ స్నేహితుడిగా ఒకే ఒక ఫైట్‌లో చిరంజీవి నటించారు.

చిరంజీవి కథానాయకుడిగా సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో 'భూలోకవీరుడు' అనే చిత్రం, రామ్‌గోపాల్‌వర్మ దర్శకత్వంలో మరో చిత్రం వైజయంతి మూవీస్ అధినేత సి. అశ్వనీదత్ మొదలు పెట్టినా ఆ రెండూ ముందుకు సాగలేదు, ఆ రెంటికోసం తీసిన రెండు పాటల్ని తర్వాత నిర్మించి విడుదల చేసిన 'చూడాలని వుంది' చిత్రం ప్రదర్శించబడుతున్న థియేటర్లలో ప్రత్యేకంగా జతపరిచారు.

1996వ సం॥లో కన్నడ చిత్రం 'సిపాయి'లో చిరంజీవి ప్రధాన పాత్రను పోషించారు, కర్ణాటకలో శతదినోత్సవం జరుపుకున్న 'సిపాయి' చిత్రాన్ని



రీకో ఫిలింస్

## రక్తబంధం

విడుదల : 13-12-1980

నిర్మాతలు : ఎస్. విజయలక్ష్మి, పి.ఎస్. కృష్ణ

దర్శకత్వం : ఆలూరి రవి

చిరంజీవి, ప్రసాద్‌బాబు, నూతన్‌ప్రసాద్ ముగ్గురూ హీరోలుగా నటించిన చిత్రం.

భారత్ ఫిలింస్

## ఆడవాళ్ళు మీకు జోహార్లు

విడుదల : 15-1-1981

నిర్మాత : టి. విశ్వేశ్వరరావు    దర్శకత్వం : కె. బాలచందర్

'ఇది కథకాదు'లో చిరంజీవి నటించిన తీరు సునిశితంగా పరిశీలించిన దర్శకులు కె. బాలచందర్ తదుపరి అదే సంస్థ నిర్మించిన ఆడవాళ్ళు మీకు జోహార్లులో కూడా చిరంజీవి ప్రతిభను వెలికి తీసే పాత్రనిచ్చి ప్రోత్సహించారు. చిరంజీవి కూడా కె. బాలచందర్ నమ్మకాన్ని నిలబెట్టేలా తన పాత్రకు పూర్తి న్యాయం చేశారు.

1998వ సం॥లో తెలుగులోకి 'మేజర్' పేరిట అనువదించి విడుదల చేశారు. 'ఈశ్వరీ ప్రొడక్షన్స్'పై నిర్మించబడిన 'సిపాయి' దర్శకుడు 'హీరో' రవి చంద్రన్.

1998వ సం॥లోనే సహజనటి జయసుధ జెఎస్‌కె కంబైన్స్ పతాకంపై నిర్మించిన 'హ్యాండ్సప్' చిత్రంలో చిరంజీవి క్లైమాక్స్ లీడ్‌గా వచ్చే సన్నివేశంలోను, ఒక ఫైట్‌లోను పాల్గొన్నారు, క్లైమాక్స్‌లో వచ్చే జయసుధ భర్తగా చిరంజీవి నటించి నవ్వుల్ని పండించారు, ఈ చిత్రానికి దర్శకుడు 'శివనాగేశ్వరరావు'.

2006వ సం॥లో 'స్టైల్' చిత్రంలో చిరంజీవి 'మెగాస్టార్ చిరంజీవి'గానే నటించి క్లైమాక్స్ సన్నివేశాలకు బలాన్ని చేకూర్చారు, క్లైమాక్స్‌లో చేసిన ఫైట్ కూడా వినోదభరితంగా సాగుతుంది, స్టైల్ చిత్ర దర్శకుడు 'లారెన్స్'.

ఆంగ్లాంధ్ర భాషల్లో మొదలై, కొంత భాగం చిత్రీకరించబడిన 'అబు' నిర్మాతల వ్యక్తిగత కారణాల వల్ల కొనసాగలేకపోయింది.

'హనుమాన్' 3D యానిమేషన్ బాలల చిత్రానికి చిరంజీవి తన స్వరాన్నిచ్చారు, కథాక్రమాన్ని చిరంజీవి స్వరం మనకు వినిపిస్తుంది, అయితే చిత్ర ప్రచార నిమిత్తం ఉపయోగించిన నిలువెత్తు చిరంజీవి స్టిల్స్ చిన్నారుల్ని విశేషంగా ఆకట్టుకోవడం జరిగింది.



పల్లవి పిక్చర్స్

## పార్వతీ పరమేశ్వరులు

విడుదల : 6-2-1981

నిర్మాత : ఎస్. వెంకటరత్నం

దర్శకత్వం : ఎం.ఎస్. కోటిరెడ్డి

'యమగోల' లాంటి సూపర్ హిట్ నిర్మించిన పల్లవి పిక్చర్స్‌లో చిరంజీవి హీరోగా నటించిన చిత్రం.

ఈ చిత్రంలో ఒక పాటలో పూర్తిగా మహాశివుడి గెటప్‌లో చిరంజీవి కనిపించి కనువిందు చేశారు, పాటలోనే అయినా చిరంజీవి పౌరాణిక గెటప్ తొలిసారిగా వేసిన చిత్రం ఇదే.

'వంట ఇంటి భీములం పాకశాస్త్ర యోధులం' అనే పాపులర్ గీతంలో చిరంజీవి, అల్లు రామలింగయ్య, కైకాల సత్యనారాయణలు కలసి వంట చేస్తూ, డ్యాన్స్ చేస్తూ వినోదాన్ని పంచుతారు.

టి.వి. ఇంటర్నేషనల్

## తోడు దొంగలు

విడుదల : 12-2-1981

నిర్మాత : కె. మహేంద్ర

దర్శకత్వం : కె. వాసు

చిరంజీవి, కృష్ణ హీరోలుగా కలసి నటించిన చిత్రం.



### "థలస్సీమియా"

ఈ వ్యాధి బారినపడిన 'చిన్నారులు' ఒక్క జంట నగరాల్లోనే 540 మందికిపైగా ఉన్నారు, 'థలస్సీమియా' అంటే 'రక్తం విరిగిపోవడం', వీరికి ఎప్పటికప్పుడు Fresh Blood వారి శారీరక స్థితిని బట్టి ఒక యూనిట్, రెండు యూనిట్స్ అవసరమౌతాయి, 2000 సం॥ నుండీ 'చిరంజీవి బ్లడ్ బ్యాంక్' 540 మంది చిన్నారులకూ రక్తనిధుల్ని అందిస్తోంది మరి...



దేవీ ఫిలిం ప్రొడక్షన్స్

## తిరుగులేని మనిషి

విడుదల : 3-4-1981

నిర్మాత : కె. దేవీవరప్రసాద్

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

కీ॥శే॥ పద్మశ్రీ డా॥ ఎన్.టి. రామారావుతో చిరంజీవి కలసి నటించిన ఏకైక చిత్రం.

ఎన్.టి.ఆర్. బావమరిదిగా చిరంజీవి ధీటుగా నటించి అందరి దృష్టినీ ఆకర్షించారు.

అప్పటికి నంబర్ వన్ హీరో ఎన్.టి.ఆర్ అయినా ఈ చిత్రంలో మొదటిపాట చిరంజీవి మీద సోలో డ్యాన్స్‌గా చిత్రీకరించారంటే చిరంజీవి డ్యాన్సులకి యువతరం ఎంతగా ఆకర్షించబడిందో అర్థమౌతుంది.

క్లైమాక్స్ లీడ్‌గా వచ్చే క్లబ్ సాంగ్‌లో ఎన్.టి.ఆర్, చిరంజీవి ఇరువురూ కలసి గిటార్లు వాయిస్తూ డ్యాన్సులు చేయడం విశేషం.

పరిమళా ఆర్ట్ క్రియేషన్స్

## ప్రేమనాటకం

విడుదల : 18-4-1981

నిర్మాతలు : శంకరయ్య స్వామి, నందకుమార్

దర్శకత్వం : కట్టా సుబ్బారావు



“నాకు జన్మనిచ్చింది అమ్మానాన్నలైతే జీవితాన్నిచ్చింది అన్నయ్య. అలాంటి అన్నయ్య ‘పద్మభూషణ్’ కూడా అందుకోవడం నాకు. మా వంశంలో ముందు ఏడు తరాల వారికి. రాబోయే ఏడు తరాల వారికి కూడా గొప్ప థ్రిల్. గొప్ప అనుభూతి, గొప్ప గౌరవం.

మీ ప్రయత్నం విజయవంతం కావాలని మనస్ఫూర్తిగా అభినందిస్తూ

మీ

(కె. నాగబాబు)




శ్రీ క్రాంతి చిత్ర

# న్యాయం కావాలి

విడుదల : 15-5-1981

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

ప్లేబోయ్ తరహా యాంటి హీరో షేడ్స్ ఉన్న పాత్రని చిరంజీవి పోషించారు.

డి. కామేశ్వరి నవల 'కొత్త మలుపు' ఆధారంగా 'న్యాయం కావాలి' రూపొందించబడింది. ఒక విధంగా చిరంజీవి నవలా చిత్రాల వెల్లువకు నాంది పలికింది 'న్యాయం కావాలి' చిత్రమే.

ఎ. కోదండరామిరెడ్డి చిరంజీవి కలయికలో తొలి చిత్రం.

చిరంజీవి, రాధిక కలసి నటించిన తొలి చిత్రం.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రం. తిరుపతి, హైదరాబాద్, ఏలూరు, విజయవాడ, విశాఖపట్టణం, విజయనగరంలో మహిళాదరణ ఎక్కువగా పొందిన చిత్రం.

బ్రదర్ చిరంజీవిలోని క్రమశిక్షణ, వినయ విధేయతలే అతడిని ఉన్నత స్థానానికి తీసుకు వెళ్ళాయి.

- కీ॥శే॥ ఎన్.టి. రామారావు



అమృతా ఫిలింస్

# ఊరికిచ్చిన మాట

విడుదల : 24-6-1981

నిర్మాతలు : ఎ. సూర్యనారాయణ, ఎం. వెంకట్రావు

దర్శకత్వం : ఎం. బాలయ్య

గ్రామీణ యువకుడిగా పూర్తి స్థాయిలో చిరంజీవి నటించిన సందేశాత్మక చిత్రం.

గ్రామీణ ప్రాంతాలు వైద్య సహాయం అందక ఎంత నిరాదరణకు గురౌతున్నాయో కరుణ రసార్ద్ర భరితంగా ఆవిష్కరించబడిన చిత్రం.

ఉత్తమ నటుడిగా చిరంజీవి 'సినీ హెరాల్డ్' వారి అవార్డునందుకున్నారు.

తృతీయ ఉత్తమ చిత్రంగా రాష్ట్ర ప్రభుత్వ బంగారు నంది అవార్డు అందుకున్న చిత్రం.



చిరంజీవి కళాకారుడు కాదు, కళాకార్మికుడు.

- కీ॥శే॥ రావు గోపాలరావు



అనిల్ ప్రొడక్షన్స్

## రాణికాసుల రంగమ్మ

విడుదల : 1-8-1981

నిర్మాత : టి. ప్రకాశరావు

దర్శకత్వం : టి.ఎల్.వి. ప్రసాద్

అలనాటి అగ్రదర్శక నిర్మాత తాతినేని ప్రకాశరావు ఈ చిత్ర నిర్మాత.

చిరంజీవి, శ్రీదేవి కలయికలో రెండో చిత్రం.

చిరంజీవి, శ్రీదేవి, జగ్గయ్య, నూతన్ ప్రసాద్‌లు పోటాపోటీగా నటించిన చిత్రం.

ప్రేమాలయ

## 47 రోజులు

విడుదల : 3-9-1981

నిర్మాత : ఆర్. వెంకట్రామన్  దర్శకత్వం : కె. బాలచందర్

ఇది కథ కాదు, ఆడవాళ్ళూ మీకు జోహార్లు తర్వాత పూర్తి స్థాయిలో 'యాంటీ హీరో'గా కె. బాలచందర్ దర్శకత్వంలో చిరంజీవి నటించిన చిత్రం.

చిరంజీవి సరసన జయప్రద పూర్తిస్థాయి కథానాయికగా నటించిన తొలి చిత్రం.

చిరంజీవి తన నటనతో పండిత పామర జనాన్ని విశేషంగా ఆకర్షించారు, విజయవంతంగా ప్రదర్శించబడిన చిత్రం.

చిరంజీవి కళ్ళంటే నాకెంతో ఇష్టం, ఆ కళ్ళల్లో పులి చూపు, లేడి చూపూ రెండూ ఉన్నాయి, ఎలా కావాలంటే అలా మలుచుకోగల నటుడు చిరంజీవి....

– 'బాపు'



శ్రీ ఆలయమ్మన్ క్రియేషన్స్

## శ్రీరస్తు శుభమస్తు

విడుదల : 26-9-1981

నిర్మాతలు : కె. నరసింహారావు, వై. వెంకటేశ్వరరావు

దర్శకత్వం : కట్టా సుబ్బారావు

సహజనటి సరిత చిరంజీవి సరసన నటించిన ఏకైక చిత్రం.

ప్రభుచిత్ర

## ప్రియ

విడుదల : 23-10-1981

నిర్మాత : ఎం.వి.హెచ్. రాయపరాజు

దర్శకత్వం : ఎస్.పి. చిట్టిబాబు

మనసు కవి 'ఆచార్య ఆత్రేయ' రచన చేసిన చిత్రం.



చిరంజీవిని చూస్తే నాకు ఈర్ష్య. అతడు నాకన్నా అందగాడు కాదు, కానీ శాస్త్రీయ, జానపద, డిస్కో బ్రేక్ ఇలా ఏ డ్యాన్స్ అయినా అది చిరంజీవి చేస్తేనే అన్పించేట్టు చేస్తాడు, అందుకే చిరంజీవి అంటే నాకు ఆనందంతో కూడిన అసూయ!

– కమల్‌హాసన్



శ్రీకర్ ప్రొడక్షన్స్

# చట్టానికి కళ్ళు లేవు

విడుదల : 30-10-1981

నిర్మాత : వి. సత్యనారాయణ దర్శకత్వం : ఎస్.ఏ. చంద్రశేఖర్

'చట్టానికి కళ్ళు లేవు' కమర్షియల్ హీరోగా చిరంజీవి కెరీర్‌ని మరో మలుపు తిప్పింది.

తొలిసారి విగ్గు పెట్టుకుని నీగ్రోగా ఒక పాటలో చిరంజీవి డ్యాన్స్ చేయడం ప్రేక్షకుల్ని అప్పట్లో విశేషంగా ఆకర్షించింది, నేటి తమిళ హీరో విజయ్ తండ్రి ఎస్.ఎ. చంద్రశేఖర్ చిత్ర దర్శకుడు.

తన తండ్రిని, కుటుంబ సభ్యులను హత్య చేసిన హంతకులపై చట్టంలోని లొసుగులను ఆధారం చేసుకుని ప్రతీకారం తీర్చుకునే యువకుడిగా చిరంజీవి చాలా బాగా నటించిన చిత్రమిది.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రమిది.

హైదరాబాద్ 'కిశోర్'లో శతదినోత్సవం జరుపుకున్న తొలిచిత్రం న్యాయం కావాలి కాగా 'సంధ్య' 70 ఎం.ఎం. థియేటర్‌లో శతదినోత్సవం జరుపుకొన్న 'చట్టానికి కళ్ళు లేవు' చిత్రంతో 'చిరంజీవి'కి హైదరాబాద్‌లో విపరీతమైన ఫాన్ ఫాలోయింగ్ ఏర్పడింది, హైదరాబాద్ ఆర్టీసీ క్రాస్‌రోడ్స్‌లో బ్యానర్లు కట్టడం, బాణాసంచా పేల్చడం, కటౌట్‌ని అలంకరించడం మొదలైంది 'చట్టానికి కళ్ళు లేవు' చిత్రంతోనే.

తన స్టెప్స్‌తో ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని చేసే చిరంజీవిని చూసి అసూయపడతాను

*- రజనీకాంత్*




శ్రీ క్రాంతి చిత్ర

# కిరాయి రౌడీలు

విడుదల : 24-12-1981

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

కిరాయిరౌడీలు చిత్రంతో తెలుగు సినీ పరిశ్రమకి 'తలకోన' అనే ఫారెస్ట్ లొకేషన్ దొరికింది.

విజయవంతంగా ప్రదర్శించబడిన చిత్రం.

మా ముందున్న ఏకైక లక్ష్యం చిరంజీవిగారు. అసలు ఆయనంటూ లేకుంటే మాకొక లక్ష్యం లేకుండా పోయుండేది, అంతటి గొప్ప ఆర్టిస్టు చిరంజీవిగారు!!

- వెంకటేష్



సత్యా వేణు మూవీస్

# బందిపోటు సింహం

విడుదల : 21-5-1982

నిర్మాత : పి. శ్రీనివాసరావు

దర్శకత్వం : ఎస్.పి. ముత్తురామన్

ప్రసిద్ధ దర్శకుడు ఎస్.పి. ముత్తురామన్ దర్శకత్వంలో చిరంజీవి నటించిన ఏకైక చిత్రం.

ఈ చిత్రం 'రాణువవీరన్' అనే తమిళ చిత్రానికి తెలుగు అనువాదం, విచిత్రం ఏమిటంటే ఇందులో 'రజనీకాంత్' హీరో, 'చిరంజీవి' విలన్.

విలనిజంలో కూడా హీరోయిజం చూపించడంలో చిరంజీవికి చిరంజీవే సాటి అని ఈ చిత్రం చూస్తే అర్థమౌతుంది.



నేను అభిమానించే ఏకైక హీరో మెగాస్టార్ చిరంజీవి

– గోవిందా



ప్రశాంతి క్రియేషన్స్

# శుభలేఖ

విడుదల : 11-6-1982

నిర్మాతలు : వి.వి. శాస్త్రి, అల్లు అరవింద్

దర్శకత్వం : కె. విశ్వనాథ్

కళాతపస్వి కె. విశ్వనాధ్ దర్శకత్వంలో చిరంజీవి నటించిన తొలి చిత్రం.

చిత్రంలో చిరంజీవి పాత్ర పేరు నరసింహ'మూర్తి'.

'ఐతే నిజమైతే' అనే పాపులర్ గీతం 'శుభలేఖ'లోనిదే. వరకట్న సమస్యని చర్చించడమేగాక 'ఉత్తమ కథ'గా రాష్ట్ర ప్రభుత్వ బంగారు నంది అవార్డుని కైవసం చేసుకుంది.

కూచిపూడి, కథకళి, కథక్ నృత్య రీతుల్ని అభినయించి డిస్కో డ్యాన్సులే కాదు శాస్త్రీయ నృత్యాలకు కూడా తాను సరితూగుతానని నిరూపించుకోవడమేగాక రెండోసారి చిరంజీవి ఉత్తమ నటుడిగా ఫిలింఫేర్ అవార్డ్‌ని స్వంతం చేసుకున్నారు.

'శుభలేఖ' చిత్ర నిర్మాతల్లో ఒకరైన అల్లు అరవింద్ చిరంజీవికి స్వయాన బావమరిది, వీరి కలయిక ఇంత గొప్ప చిత్రంతో మొదలు కావడం విశేషం.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రం.

రజనీకాంత్ + కమల్‌హాసన్ = చిరంజీవి

– కె. బాలచందర్



శ్రీక్రాంతి చిత్ర

## ఇది పెళ్ళంటారా

విడుదల : 16-7-1982

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : విజయభాస్కర్

భూమి చిత్ర

## సీతాదేవి

విడుదల : 30-7-1982

నిర్మాత : టి. రామన్

దర్శకత్వం : ఈరంకి శర్మ

విజయకళామందిర్

## రాధా మై డార్లింగ్

విడుదల : 30-7-1982

నిర్మాత : పి. త్రినాథరావు దర్శకత్వం : బి. భాస్కర్

చిరంజీవి నటించిన యూత్‌ఫుల్ లవ్‌స్టోరీ.



'చిరంజీవి' God of Andhra Pradesh

- ప్రవేశ్ సిప్పి




అనిల్ ప్రొడక్షన్స్

# టింగురంగడు

విడుదల : 1-10-1982

నిర్మాత : తాతినేని ప్రకాశరావు

దర్శకత్వం : తాతినేని ప్రసాద్

తాతినేని ప్రకాశరావు నిర్మాతగా వారబ్బాయి ప్రసాద్ దర్శకుడిగా రాణికాసుల రంగమ్మ తరవాత చిరంజీవితో నిర్మించిన మరో మంచి చిత్రం ఇది.

కథాబలం గల ఈ చిత్రంలో అలనాటి మేటి విలన్ 'నాగభూషణం'తో ధీటుగా నటించి చిరంజీవి ఔననిపించుకున్నారు.

'చిరంజీవి' టైటిల్‌ని టైటిల్స్‌లోకాక క్లైమాక్స్ ఫైట్ మొదలుకాగానే గుర్రంపై వస్తున్న చిరంజీవిపై టైటిల్ కార్డ్ వేసిన చిత్రం ఇది.

"చిరంజీవి ఇమేజ్ అనితర సాధ్యం! చిరంజీవి లాంటి నటుడు భారతీయుడు కావడం గర్వకారణం."

- అనిల్‌కపూర్



శ్రీనివాసా ప్రొడక్షన్స్

# పట్నం వచ్చిన పతివ్రతలు

విడుదల : 1-10-1982

నిర్మాత : ఎ. రాధాకృష్ణమూర్తి

దర్శకత్వం : మౌళి

ఈ చిత్రానికి 'విజయబాపినీడు' నిర్మాణకర్తగా వ్యవహరించగా 'మౌళి' దర్శకత్వంలో చిరంజీవి నటించిన ఏకైక చిత్రం.

'మీసాల రాయుడి'గా కాస్సేపు ఒక పాటలో చిరంజీవి కనిపించడమేగాక, చిత్ర ద్వితీయార్థంలో కథను బట్టి కోతి పిల్లను తన భుజంపై ఎప్పుడూ ఉంచుకుని బాగా నవ్వించారు.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రం.

'చిరంజీవిలోని డిసిప్లిన్, డెడికేషన్ ఇంతదాకా ఏ హీరోలోను నేను చూడలేదు'.

- ఎస్.ఎస్. సిప్పీ



పి.ఎన్.ఆర్. పిక్చర్స్

# బిల్లా రంగా

విడుదల : 15-10-1982

నిర్మాత : పింజల నాగేశ్వరరావు

దర్శకత్వం : కె.ఎస్.ఆర్. దాస్

విజయవంతంగా ప్రదర్శించబడి శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న ఈ చిత్రంలో బిల్లాగా చిరంజీవి పూర్తి స్థాయి మాస్ హీరోగా రాణించారు మాస్ చిత్రాల అగ్ర దర్శకుడు కె.ఎస్.ఆర్. దాస్ దర్శకత్వంలో చిరంజీవి నటించిన తొలి చిత్రం ఇది.

ఇండస్ట్రీకి లాస్ట్ నంబర్‌వన్ హీరో మెగాస్టార్ చిరంజీవిగారే!

– మహేష్‌బాబు






విడుదల : 22-10-1982

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : రాజ్‌భరత్

పూర్తి స్థాయి నిర్మాతగా మారి అల్లు అరవింద్ చిరంజీవితో నిర్మించిన 'యమకింకరుడు' హాలీవుడ్ చిత్రం 'మ్యాడ్‌మ్యాక్స్' స్ఫూర్తితో సాగుతుంది.

మాట మాట చిన్న మాట, కంటికి నువ్వే దీపం అనే పాపులర్ గీతాలున్న యమకింకరుడులో మోటార్ బైక్‌తో ఎంతో రిస్క్ తీసుకుని చిరంజీవి చేసిన విన్యాసాలు ప్రేక్షకుల్ని ఎంతగానో అలరించాయి.

టైటిల్స్‌లో 'కథ : అల్లు అరవింద్' అని టైటిల్ కార్డు వేసిన చిత్రం యమకింకరుడు

చిరంజీవితో నేను 23 సినిమాలకు దర్శకత్వం వహించాను. తపన, ఏకాగ్రత, నిరంతర కృషి, క్రమశిక్షణ, చిరంజీవిలో నేను పరిశీలించిన అంశాలు, ఎంత కంఫర్టబుల్ ఆర్టిస్ట్ కాకపోతే చిరంజీవితో నేను అన్ని సినిమాలు చేయగలను!! హి ఈజ్ బిగ్, బిగ్గర్ ద్యాన్ ది వర్డ్!!

– ఎ. కోదండ రామిరెడ్డి



అనంతలక్ష్మి ఇంటర్నేషనల్

## మొండిఘటం

విడుదల : 6-11-1982

నిర్మాత : డి. భాస్కరరావు

దర్శకత్వం : రాజాచంద్ర

'నేనే మొండి ఘటాన్ని' అనే పాపులర్ గీతం ఈ చిత్రంలోనిదే.

గోదావరి చిత్ర

## మంచు పల్లకి

విడుదల : 19-11-1982

నిర్మాత : ఎం.ఆర్. ప్రసాదరావు దర్శకత్వం : వంశీ

భావుకత్వానికి మారుపేరైన 'వంశీ'కి దర్శకుడిగా తొలిచిత్రం కాగా అగ్ర నవలా రచయిత యండమూరి వీరేంద్రనాథ్ సంభాషణలు అందించిన చిత్రం 'మంచుపల్లకి'. చిత్రకారుడైన గాయకుడుగా చిరంజీవి ఎంతో నవ్యతతో తన పాత్రకు పూర్తి న్యాయం చేయగా చిరంజీవి సుహాసిని కలయికలో ఇదే తొలి చిత్రం.

విష్ యూ హ్యాపీ న్యూ ఇయర్, మేఘమాదేహమా, మనిషే వాణిక్యం అనే పాపులర్ గీతాలు 'మంచు పల్లకి'లోనివే. యువత మనోభావాలకు దర్పణంపట్టిన మంచి కథ చిత్రం 'మంచు పల్లకి'.

ఇండస్ట్రీలో ఇంకో మెగాస్టార్ పుట్టలేదు, పుట్టబోదు, ఎప్పటికీ చిరంజీవి ఒక్కరే మెగాస్టార్..

- ప్రకాష్‌రాజ్



గుణచిత్ర

## బంధాలు అనుబంధాలు

విడుదల : 26-11-1982

నిర్మాత : మోహన్

దర్శకత్వం : భార్గవ

శోభన్‌బాబు హీరో అయిన ఈ చిత్రంలో పోలీస్ అధికారిగా చిరంజీవి ఒక ప్రత్యేక పాత్రని పోషించి కథకు కీలక వ్యక్తిగా నిలుస్తారు.

సత్యాదేవి కంబైన్స్

## ప్రేమ పిచ్చోళ్ళు

విడుదల : 14-1-1983

నిర్మాతలు : రమేష్, జయరామారావు దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

కమర్షియల్ హీరోగా చిరంజీవి నిలదొక్కుకున్నాక 'సంక్రాంతి'కి విడుదలైన ప్రేమపిచ్చోళ్ళు చిరంజీవి, రాధిక, కోదండరామిరెడ్డిల కలయికలో హాస్యభరిత చిత్రం. విచిత్రం ఏమిటంటే టైటిల్ హీరో హీరోయిన్లనిగాక గుమ్మడి, అల్లు రామలింగయ్య, రావుగోపాలరావులని ఉద్దేశించి పెట్టిన చిత్రం.

చిరంజీవి అంటే ఒక బంగారు నాణెం, ఏ నాణాకైనా ఒక పక్క బొమ్మ, ఒక పక్క బొరుసూ ఉంటే చిరంజీవి అనే నాణానికి రెండు వైపులా బొమ్మే ఉంది. ఒక బొమ్మలో మహోన్నత వ్యక్తి ఉంటే, మరో బొమ్మలో మహోన్నత నటుడు ఉన్నాడు.

– సి. అశ్వనీదత్



రాజ్యలక్ష్మి ఆర్ట్ మూవీస్

# పల్లెటూరి మొనగాడు

విడుదల : 5-2-1983

నిర్మాత : మిద్దే రామారావు

దర్శకత్వం : ఎస్.ఎ. చంద్రశేఖర్

గ్రామీణ యువకుడు 'రాజన్న'గా చిరంజీవిపాత్ర ఆకట్టుకుంటుంది, 'ఆచారీ కుడి చెయ్యి' అనే చిరంజీవి ఊతపదం బాగా వ్యాప్తి చెందింది. విజయవంతంగా ప్రదర్శితమైంది.

విశేషాదరణ పొందిన "జడలోని మల్లె పువ్వు కడగంటీ చిరునవ్వు" అనే యుగళగీతం ఈ చిత్రంలోనిదే.

చిరంజీవి వందరోజుల హీరోకాదు, 365 రోజుల హీరో

- డా॥ దాసరి నారాయణరావు



క్రియేటివ్ కమర్షియల్స్

# అభిలాష

విడుదల : 11-3-1983

నిర్మాత : కె.ఎస్. రామారావు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

యండమూరి వీరేంద్రనాథ్ నవల అభిలాష ఆధారంగా భారతీయ శిక్షాస్మృతిలోని సెక్షన్ 302కి వ్యతిరేకంగా రూపొందించబడిన 'అభిలాష' చిత్రంలో 'లాయర్ చిరంజీవి'గా చిరంజీవి నటన 'రాజ్‌కపూర్'ని స్ఫురణకు తెచ్చిందని విమర్శకులు అభిప్రాయపడ్డం జరిగింది.

చిరంజీవి హీరో రావుగోపాలరావు విలన్ కాంబినేషన్ 'కమర్షియల్ ఫార్ములా'గా మొదలైంది ఈ చిత్రంతోనే...

శతదినోత్సవ వేడుకల్ని జరుపుకున్న 'అభిలాష' చిత్రానికి ఇళయరాజా అందించిన సంగీతం విశేషాదరణ పొందింది, 'లోక్‌సింగ్' కెమెరా, 'సత్యమూర్తి' చిత్రానువాదం ఆకట్టుకున్నాయి.

"యురేకాసకామికా, ఉరకలై గోదావరి, వేళాపాళలేదు, బంతీ చామంతి, సందె పొద్దులకాడ" గీతాలన్నీ ఎవర్‌గ్రీన్ హిట్స్...

24 గంటల్లో 22 గంటలు పని చేసే హీరో మెగాస్టార్ చిరంజీవి

- టి. త్రివిక్రమరావు



శ్రీ లలితా మూవీస్

# ఆలయ శిఖరం

విడుదల : 7-5-1983

నిర్మాత : జి. జగదీష్ చంద్రప్రసాద్

దర్శకత్వం : కోడి రామకృష్ణ

జట్కా బండి నడిపి పొట్ట పోసుకునే శ్రీనుగా చిరంజీవి అభినయం బావుంటుంది, నీ హృదయం ఆలయ శిఖరం, కొండలెక్కిన దేవుడావంటి మంచి గీతాలున్న 'ఆలయశిఖరం' చిరంజీవి కోడి రామకృష్ణల కలయికలో విజయవంతమైన చిత్రం.



తెలుగు సినిమా ఇండస్ట్రీలో ఇప్పటికే 1 నుండీ 50 వరకూ చిరంజీవిగారే స్టార్ హీరో

– కోడి రామక్రిష్ణ



శ్రీ క్రాంతి చిత్ర

# శివుడు శివుడు శివుడు

విడుదల : 9-6-1983

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

జానపద బాణీలో సాగే చిత్రం, శాస్త్రీయ నృత్యాల్ని చిరంజీవి పూర్తి స్థాయిలో అద్భుతంగా ఒక పాటలో అభినయించారు. 'కోతి బావా కోతి బావా' వంటి గుర్తుండి పోయే గీతం ఈ చిత్రంలోనిదే...

'శివయ్య'గా చిరంజీవి ఎంతో అమాయకమైన నటనను ప్రథమార్థంలో ప్రదర్శించి, ద్వితీయార్థం వచ్చేసరికి వీరోచితమైన పోరాటాలు చేసి ఆ రెంటి మధ్యా చక్కటి సమన్వయాన్ని సాధించారు.

చిరంజీవిగారికి తప్ప మిగతా ప్రపంచానికంతా ఆయన మెగాస్టార్... తనకు మాత్రం చిరంజీవే!!

- వి.వి. వినాయక్



కమలా సినీ ఆర్ట్స్

# పులి బెబ్బులి

విడుదల : 16-6-1983

నిర్మాత : ఆర్.వి. గురుపాదం

దర్శకత్వం : కె.ఎస్.ఆర్. దాస్

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్




విడుదల : 30-6-1983

నిర్మాత : టి. త్రివిక్రమరావు

దర్శకత్వం : కోడి రామకృష్ణ

చిరంజీవి గూఢచారిగా నటించి వినోదానికి అగ్రాసనం వేసిన చిత్రం, విచిత్ర వేషధారణలు ఎక్కువే అయినా ఆద్యంతం బిగిసడలని చిత్రీకరణ చిత్ర విజయానికి దోహదపడింది.

ఉదయించే సూర్యుడు సాయంత్రానికి అలసిపోతాడు, అలుపెరగని సూర్యుడు చిరంజీవి

- బ్రహ్మానందం



శ్యాంప్రసాద్ ఆర్ట్స్

# మగమహారాజు

విడుదల : 15-7-1983

నిర్మాత : ఎం. రవీంద్రనాథ్ చౌదరి

దర్శకత్వం : విజయబాపినీడు

దర్శకుడిగా విజయబాపినీడుకి తొలి చిత్రం.

చిరంజీవి ఇంటర్వ్యూకి రావుగోపాలరావు ఆఫీసుకి వెళ్ళి రావు గోపాల్రావునే ప్రశ్నించడం వంటివి ఆంధ్రాని ఒక ఊపు ఊపాయి.

ఘన విజయం సాధించి శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'మగమహారాజు' చిరంజీవిని కుటుంబ కథా చిత్రాల కథా నాయకుడిగా ఒక మెట్టు పెంచింది.

'సీతే రాముడి కట్నం' వంటి మంచి గీతం ఉన్న 'మగమహారాజు'లో చిరంజీవి లేని సన్నివేశాల్లో సైతం చిరంజీవి ప్రాధాన్యం కనిపిస్తుంది, ఇదే చిత్రానికి ఆయువుపట్టు.

నిద్రాహారాలు మాని రాత్రనక పగలనక సైకిల్ తొక్కి డబ్బు సంపాదించే గీతంలో చిరంజీవి నటన కంటతడి పెట్టిస్తుంది. ఆంధ్రదేశంలో ఏ మూల చూసినా "నీ దారి పూలదారీ పోవోయి బాటసారి నీ ఆశలే ఫలించగా మోగించు విజయభేరి" అనే గీతం వినిపించిందంటే 'మగమహారాజు' అంత ప్రగాఢ ముద్ర వేశాడు మరి. ఈ చిత్రంలోని నటనకుగాను చెన్నై 'కళాసాగర్' విజయవాడ 'రోటరీ క్లబ్' ఉత్తమ నటుడిగా ఎన్నుకున్నాయి.



చిరంజీవిగారు ఆంధ్రప్రదేశ్‌కి మదర్ థెరిస్సా లాంటివారు

– చిన్ని క్రిష్ణ



పిఎన్ఆర్ ఆర్ట్ పిక్చర్స్

## రోషగాడు

విడుదల : 29-7-1983

నిర్మాత : పింజల నాగేశ్వర్రావు

దర్శకత్వం : కె.ఎస్.ఆర్. దాస్

చిరంజీవి ద్విపాత్రాభినయం చేసిన 'రోషగాడు' 'డాన్' చిత్ర పోలికలతో కనిపిస్తుంది, కమర్షియల్‌గా విజయాన్ని సాధించింది.

చంద్రమణి ప్రొడక్షన్స్

## మా ఇంటి ప్రేమాయణం

విడుదల : 11-8-1983

నిర్మాత : చంద్రమణి

దర్శకత్వం : ఆలూరి రవి

ఒక స్పెషల్ సాంగ్‌లో డ్యాన్స్ మాత్రం చేశారు క్లైమాక్స్‌లో!!

చిరంజీవి ఈజ్ ద సీక్రెట్ ఆఫ్ మై ఎనర్జీ

- ఛోటా.కె. నాయుడు




సంయుక్త మూవీస్



విడుదల : 28-10-1983

నిర్మాతలు : ఎం. తిరుపతి రెడ్డి, కె. ధనుంజయరెడ్డి

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

తెలుగు సినిమా హీరో రూపురేఖల్ని, తెలుగు సినిమా ఎకనామిక్సునే కాక చిరంజీవి కెరీర్‌ని కూడా బలంగా ప్రభావితం చేసిన చిత్రం. చిరంజీవి నట ప్రస్థానాన్ని ఖైదీకి ముందు, ఖైదీకి తరువాత అని విభజించేంతగా 'ఖైదీ' ఒక మరపురాని మధురమైన మజిలీ. తక్కువ సంభాషణలతో, ఎక్కువ హావభావాలతో పగతో రగిలిపోయే 'సూర్యం'గా చిరంజీవి నటన హాలీవుడ్ నటులను స్ఫురణకు తెస్తుంది. కోటి రూపాయల వసూళ్ళతో ఖైదీ చిత్రం చిరంజీవి స్థానాన్ని పదిలం చేయగా ఖైదీ ప్రభంజనం చిరంజీవి, రచయితలు పరుచూరి బ్రదర్స్, దర్శకుడు కోదండ రామిరెడ్డిలకు 'స్టార్ ఇమేజ్' తీసుకు వచ్చింది, శతదినోత్సవ వేడుకలు ఘనంగా జరుపుకుంది. తెలుగు సినిమా సాహిత్యం కథ కథనం శిల్పంలో సైతం 'ఖైదీ' స్థానాన్ని సంపాదించింది. ఇదేమిటబ్బా, గోరింటపూసింది, రగులుతోంది మొగలిపొద వంటి విశేషాదరణ గీతాలు గల 'ఖైదీ'లో ప్రత్యేక తరహా నాగినీ నృత్యం దాంతోపాటు కాలేజ్ ఎపిసోడ్‌లో వచ్చే నృత్యరూపకంలో చిరంజీవి విశ్వామిత్రుడిగా, కౌశికుడిగా నృత్యాభినయం చెయ్యడం చిరంజీవిలోని తపనని చెప్పకనే చెబుతాయి. ఫారెస్ట్ లొకేషన్ 'తలకోన'ని పూర్తిస్థాయిలో తెరపై ఆవిష్కరించిన తొలి తెలుగు చిత్రం 'ఖైదీ'.

"చిరంజీవి మంచి విలన్ అవుతాడనుకొని నా చెల్లెలు సురేఖనిచ్చి పెళ్ళి చేశాను, ఇలా అయిపోతాడను కోలేదు, ఏమిటో నేను షేక్ హ్యాండిచ్చిన మహిమ, పై కొచ్చాడు."

– అల్లు అరవింద్



ముద్దు ఆర్ట్ మూవీస్

## మంత్రిగారి వియ్యంకుడు

విడుదల : 4-11-1983

నిర్మాత : జయక్రిష్ణ దర్శకత్వం : బాపు

బాపు దర్శకత్వంలో చిరంజీవికి మరో వైవిధ్యభరితమైన చిత్రం. చిరంజీవి పాత్ర పేరు బాబ్జీ. చిత్రం మొదలైన అరగంటకుగానీ 'హీరో' పాత్ర ప్రవేశించదు, తర్వాత మొత్తం చిరంజీవి విశ్వరూపాన్ని ప్రదర్శిస్తారు. కాలేజి కుర్రాడిగా చలాగ్గా చిరంజీవి కనిపించి కనువిందు చేసిన 'మంత్రిగారి వియ్యంకుడు' టైటిల్ రోల్ మాత్రం 'అల్లు రామలింగయ్య' పోషించారు. వెండితెరపై చిరంజీవి అల్లు రామలింగయ్యలిరువురూ 'మామా అల్లుళ్ళు'గా విజృంభించిన చిత్రం ఇది. బహుళ జనాదరణ పొందిన కొబ్బరికాయల సుబ్బారాయుడే, మనసుకు దోస్తీ, అమ్మగదెబుజ్జి గదే వంటి మధుర గీతాలున్న మంత్రిగారి వియ్యంకుడు ఒక వర్గం ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకుంది.

ఒకే ఒక సన్నివేశంలో చిరంజీవి తండ్రి 'కె. వెంకట్రావుగారు' నటించారు.

## ఆంధ్రదేశం అంతా నాదే

నా అభిమానులు ఆంధ్రదేశంలో ఊరూరా ఉన్నారు. ఆ విధంగా, ప్రతి ఊరితో నాకు అనుబంధం ఉంది. అందుకే, మీ ఊరేదీ అని ఎవరైనా అడిగితే నా అభిమానులున్న ప్రతి ఊరూ నాదేనని చెబుతా! ఆంధ్రదేశమంతా నాదేనంటా!



సురేష్ ప్రొడక్షన్స్

# సంఘర్షణ

విడుదల : 29-12-1983

నిర్మాత : డా॥ డి. రామానాయుడు

దర్శకత్వం : కె. మురళీ మోహనరావు

సుప్రసిద్ధ నిర్మాత డి. రామానాయుడు సురేష్ ప్రొడక్షన్స్ పతాకంపై చిరంజీవి హీరోగా నిర్మించిన ఏకైక చిత్రం.

దర్శకుడు కె. మురళీ మోహనరావుకి తొలి చిత్రం.

కార్మిక నాయకుడిగా చిరంజీవి అద్భుతంగా నటించిన 'సంఘర్షణ'లోని కట్టు జారిపోతావుంది, సన్నజాజిపందిరి కింద మెల్లమెల్లగ, నిద్దుర పోకే ఓ వయిసా వంటి మధుర గీతాలు నేటికీ వినిపిస్తూనే ఉన్నాయి, విజయవంతంగా ప్రదర్శించ బడింది, విజయశాంతి చిరంజీవి సరసన నటించిన తొలి చిత్రం.



## సంగీతం

'ప్రాణం ఖరీదు' చిరంజీవి తొలి చిత్రం, ఆ చిత్రం మొదలుకొని 'అత్తకు యముడు అమ్మాయికి మొగుడు' చిత్రం దాకా మొత్తం 41 చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించి 'రికార్డు' సృష్టించిన ఘనత కీ॥శే॥ చక్రవర్తిగారిదే... ఆ తరువాత స్థానాలు వరుసగా ఇళయరాజా, రాజ్‌కోటి, కె.వి. మహాదేవన్, మణిశర్మలు పొందారు.



బి.ఆర్. ప్రొడక్షన్స్

# అల్లుళ్ళొస్తున్నారు జాగ్రత్త

విడుదల : 11-2-1984

నిర్మాత : కె. బాబూరావు

దర్శకత్వం : కె. వాసు

చిరంజీవి, చంద్రమోహన్ హీరోలుగా హాస్యభరిత చిత్రం.



## గీత రచయిత

చిరంజీవి చిత్రాలలో అత్యధిక చిత్రాల్లో అత్యధిక గీతాలు వ్రాసిన ఘనత వేటూరి సుందర రామమూర్తి గారిదే!!!



రాజ్యలక్ష్మి
ప్రొడక్షన్స్




విడుదల : 23-2-1984

నిర్మాత : మిద్దే రామారావు

దర్శకత్వం : ఎ. కోదండ రామిరెడ్డి

ప్రాణాలకు తెగించి క్లైమాక్స్‌లో రైలు చక్రాల క్రింద చిరంజీవి చేసిన విన్యాసాలు ప్రేక్షకుల్ని థియేటర్లకి లాక్కెళ్ళాయి, ఇప్పుడు చూసినా ఆ విన్యాసాలు ఒళ్ళు గగుర్పొడుస్తాయి.

చిరంజీవి, రాధల కాంబినేషన్ తొలి చిత్రం.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'గూండా'లో కాళిగా, రవిగా (ద్విపాత్రాభినయం కాదు) రెండు షేడ్స్ ఉన్న పాత్రల్ని చక్కగా పోషించారు చిరంజీవి.

గుండెలు తీసిన బంటు, ఆటగాడి పాటకేమో వందనాలు కొమ్మెక్కి కూసింది వంటి మధురగీతాలు ప్రేక్షకుల్ని బాగా అలరించాయి.



## గాయకుడు

మెగాస్టార్ చిరంజీవికి ఎక్కువసార్లు పాటలు పాడిన ప్లే బాక్ సింగర్ ది ఒన్ అండ్ ఓన్లీ ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం!!!



గీతా ఆర్ట్స్

# హీరో

విడుదల : 23-3-1984

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : విజయబాపినీడు

వినోదభరిత చిత్రం 'హీరో'లో అల్లు అరవింద్ చిరంజీవి అన్నదమ్ములుగా నటించడం విశేషమైతే అల్లు అరవింద్ హాస్యాన్ని ఎంతో అద్భుతంగా పండించారు.

హాలీవుడ్ చిత్రాల ప్రభావం ఎక్కువగా ఉన్న చిత్రం హీరో.

## సంభాషణలు

'కోతలరాయుడు' చిత్రం మొదలుకొని 'అంజి' చిత్రం వరకు మొత్తం 36 చిత్రాలకు సంభాషణలు వ్రాసిన అత్యధిక చిరంజీవి చిత్రాల సంభాషణల రచయితగా 'సత్యానంద్' ప్రథమ స్థానాన్ని వహించగా ఆ తరువాతి స్థానాలు కీ॥శే॥ జంధ్యాల, జి. సత్యమూర్తి, పరుచూరి బ్రదర్స్, గొల్లపూడి, కీ॥శే॥ ఎం.వి.వి.ఎస్. బాబూరావు, కాశీ విశ్వనాధ్‌లు పొందారు.



దమయంతి ఆర్ట్ పిక్చర్స్

# దేవాంతకుడు

విడుదల : 12-4-1984

నిర్మాత : నారాయణరావు

దర్శకత్వం : ఎస్.ఎ. చంద్రశేఖర్

చట్టానికి కళ్ళు లేవు, పల్లెటూరి మొనగాడు వంటి హిట్స్ చిరంజీవి ఖాతాలో జమచేసిన దర్శకుడు ఎస్.ఎ. చంద్రశేఖర్ చిరంజీవితో చేసిన హ్యాట్రిక్ ఫిలిం ఇది.

విజయవంతంగా ప్రదర్శించబడిన దేవాంతకుడు చిత్రానికి నటుడు నారాయణరావు నిర్మాత.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న దేవాంతకుడు చిత్రం టైటిల్స్‌లో 'డేరింగ్ డేషింగ్ డైనమిక్ హీరో చిరంజీవి' అని టైటిల్ కార్డ్ వేశారు.



## ఎడిటింగ్

కీ॥శే॥ కె.వి. మార్తాండ్, వెల్లైస్వామి, గౌతంరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు, మార్తాండ్. కె. వెంకటేష్ అత్యధిక చిత్రాలకు ఎడిటర్స్‌గా చిరంజీవితో పనిచేశారు.

 

శ్యాంప్రసాద్ ఆర్ట్స్

# మహానగరంలో మాయగాడు

విడుదల : 28-6-1984

నిర్మాత : ఎం. రవీంద్రనాథ్ చౌదరి

దర్శకత్వం : విజయబాపినీడు

చిరంజీవి అత్యధికంగా విచిత్ర వేషధారణల్లో కనిపించిన చిత్రం ఇది.

హరిదాసుగా 'భయమే నీ శత్రువు' అని హరికథ చెప్పే ఎపిసోడ్ ఈ చిత్రానికే హైలైట్.

'చిరంజీవి'కి అసిస్టెంట్లుగా అల్లు అరవింద్, దర్శకుడు మౌళి నటించి వినోదాన్ని బాగా పంచడం ఒకెత్తు అయితే రావుగోపాలరావు, అల్లు రామలింగయ్యల సెపరేట్ కామెడీ ట్రాక్ ఇప్పటికీ ఎవర్ గ్రీన్.

మహానగరంలో మాయగాడు చిరకాలంగా ఈ మానవుడు చిరంజీవిగా ఉన్నాడు, అనే పాపులర్ గీతం ఇందులోనిదే.



## కెమెరా

మెగాస్టార్ చిరంజీవితో "శుభలేఖ" మొదలుకొని 'బిగ్ బాస్' వరకూ 31 చిత్రాలకు 'కెమెరా' బాధ్యతలు వహించిన చరిత కీ॥శే॥ లోక్‌సింగ్‌గారిదే.. తరువాతి స్థానాలు ఛోటా. కె. నాయుడు, కీ॥శే॥ కె.ఎస్. హరి, కీ॥శే॥ కె.ఎస్. ప్రకాష్, కె. దత్తులు పొందారు.



క్రియేటివ్ కమర్షియల్స్ ఛాలెంజ్

విడుదల : 9-8-1984
నిర్మాత : కె.ఎస్. రామారావు
దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

'గాంధీ' అనే పాత్రతో చిరంజీవి సమాజాన్ని విపరీతంగా ప్రభావితం చేసి, ఒక సగటు యువకుడు తలచుకుంటే 'చట్టబద్ధంగా' ఏ పనైనా సాధించగలడు, ఎంత ఎత్తుకైనా ఎదగగలడని నిరూపించిన చిత్రం 'ఛాలెంజ్' శతదినోత్సవ వేడుకలు జరుపుకుంది.

"చిరంజీవి, కె.ఎస్. రామారావు, ఇళయరాజా, లోక్‌సింగ్, యండమూరి, ఎ. కోదండరామిరెడ్డి"ల కాంబినేషన్‌లో 'అభిలాష' తర్వాత 'ఛాలెంజ్' వారి స్థాయిని బాగా పెంచింది. చిరంజీవి, రావుగోపాల్రావుల పోటాపోటీ నటనని ప్రేక్షకులు విపరీతంగా ఎంజాయ్ చేసిన 'ఛాలెంజ్'లో ఇందువదన, భామా, సాయంకాలం, ఓం శాంతీ వంటి నేటికీ వన్నె తరగని గీతాలున్నాయి.

యండమూరి వీరేంద్రనాథ్ 'డబ్బు టుది పవరాఫ్ డబ్బు' నవల ఆధారంగా నిర్మించబడిన చిత్రం ఛాలెంజ్.



## కొరియోగ్రఫీ

చిరంజీవితో అత్యధిక చిత్రాలకు 'కొరియోగ్రాఫర్'గా పనిచేసిన రికార్డ్ 'తార' స్వంతం చేసుకోగా ఆ తరువాతి స్థానాలు సుందరం మాస్టారు, రాజు సుందరం, ప్రభు దేవా, లారెన్స్, బృంద, సలీమ్ మాస్టర్‌లు పొందగా, ఇంకా సుచిత్ర, కళ, సరోజ్‌ఖాన్, తదితరులు 'చిరంజీవి' చేత అద్భుతమైన డ్యాన్సులు చేయించారు. తాజాగా అశోక్‌రాజ్, హరీష్‌పాయ్ తదితరులు కూడా మెగాస్టార్‌తో కలసి పని చేస్తున్నారు.



వర్మా ప్రొడక్షన్స్

## ఇంటిగుట్టు

విడుదల : 14-9-1984

నిర్మాత : డి.వి.ఎన్. రాజు

దర్శకత్వం : కె. బాపయ్య

విజయవంతంగా ప్రదర్శించబడిన 'ఇంటిగుట్టు' చిరంజీవిని కె. బాపయ్య డైరక్ట్ చేసిన తొలి చిత్రం.

ఎవిఎం ప్రొడక్షన్స్

## నాగు

విడుదల : 11-10-1984

నిర్మాతలు : కుమరన్, షణ్ముగం, పద్మాకుమరన్

దర్శకత్వం : తాతినేని ప్రసాద్

పున్నమినాగు తర్వాత ఎవిఎం ప్రొడక్షన్స్‌లో చిరంజీవి నటించిన చిత్రం. 'ముక్కు మీద కోపం ముట్టుకుంటే తాపం' అనే విశేషాదరణ పొందిన గీతం 'నాగు'లోదే.

### ఫైట్స్

'విజయన్' మాస్టర్ ఫస్ట్ ర్యాంక్ సాధించగా రాజు, కణల్ కన్నన్ తరువాత స్థానాలు పొందారు.



శ్రీ క్రాంతిచిత్ర

## అగ్నిగుండం

విడుదల : 22-11-1984

నిర్మాత : క్రాంతికుమార్

దర్శకత్వం : క్రాంతికుమార్

దర్శకుడిగా క్రాంతికుమార్‌కి తొలి చిత్రం.

మహేశ్వరి మూవీస్

## రుస్తుం

విడుదల : 21-12-1984

నిర్మాత : ఎస్.పి. వెంకన్నబాబు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

పూర్తి స్థాయి గ్రామీణ వాతావరణంలో రూపొందించబడిన 'రుస్తుం' చిత్రంలో ఎద్దుతో చిరంజీవి తలపడే పోరాట సన్నివేశాలు ప్రేక్షకుల్ని అలరించాయి.

రామన్న రాముదోంకు రామభజన అనే రామభక్తి గీతం 'రుస్తుం'లోనిదే. చిరంజీవి పాత్రపేరు 'హరి'.



### ఆర్ట్

పద్మశ్రీ తోట తరణి, అశోక్, చలం, భాస్కర రాజు పెక్కు చిరంజీవి చిత్రాలకు కళా దర్శకత్వం నెరిపారు.



దేవీ ఫిలిం ప్రొడక్షన్స్

# చట్టంతో పోరాటం

విడుదల : 11-1-1985

నిర్మాత : కె. దేవీవరప్రసాద్

దర్శకత్వం : కె. బాపయ్య

విజయవంతంగా ప్రదర్శించబడిన 'చట్టంతో పోరాటం' న్యాయశాస్త్రంలోని ఒక నిబంధనని ఆధారంగా చేసుకుని మాస్, ఫ్యామిలీ డ్రామా, ఎంటర్‌టైన్‌మెంట్‌లతో రూపొందించబడింది.

'యమధర్మరాజు' గెటప్‌లో చిరంజీవి ఇమిడిపోయి ఒక నాటక సన్నివేశంలో పాటలు పద్యాలుతో అలరిస్తారు.

ఎన్‌టిఆర్ తర్వాత చిరంజీవితో చిత్రాల్ని నిర్మించే సంప్రదాయానికి కె. దేవీ వరప్రసాద్ శ్రీకారం చుట్టిన చిత్రం.

## హీరోయిన్స్

'న్యాయం కావాలి' మొదలుకొని 'రాజా విక్రమార్క' దాకా మొత్తం 18 చిత్రాల్లో రాధిక, 'సంఘర్షణ' మొదలుకొని 'మెకానిక్ అల్లుడు' దాకా మొత్తం 18 చిత్రాల్లో 'విజయశాంతి', 'గూండా' మొదలుకొని 'కొదమసింహం' దాకా మొత్తం 16 చిత్రాల్లో 'రాధ' చిరంజీవి సరసన అత్యధిక చిత్రాల్లో హీరోయిన్స్‌గా నటించారు.



విజయలక్ష్మీ ఆర్ట్ మూవీస్




విడుదల : 14-3-1985

నిర్మాత : టి. త్రివిక్రమరావు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

'గోలీమార్, దొంగ దొంగ, ఇది పందెం వంటి విశేషాదరణ పొందిన గీతాలున్న 'దొంగ' ఘన విజయాన్ని సాధించిన చిత్రం, శతదినోత్సవ వేడుకలు కూడా జరుపుకున్న 'దొంగ' పూర్తిస్థాయి మాస్ ఎంటర్‌టైనర్, చిరంజీవి పాత్ర పేరు 'ఫణి'.

అజయ్ క్రియేషన్స్

## చిరంజీవి

విడుదల : 18-4-1985

నిర్మాతలు : కె. లక్ష్మీనారాయణ, కె. రామారావు

దర్శకత్వం : సి.వి. రాజేంద్రన్

ప్రేక్షకులని కంట తడిపెట్టించే విధివంచితుడైన 'చిరంజీవి' కథ ఈ చిత్రం, అనుకోని పరిస్థితుల్లో హంతకుడై చివరికి అసువులు బాసే చిరంజీవిగా చిరంజీవి పాత్రకు న్యాయం చేశారు. ఒక తమిళ చిత్రం ఆధారంగా ఈ చిత్రం నిర్మించబడింది.

## పసితనం, కసితనం కలబోసిన తెలుగుదనం 'చిరంజీవి'... "చిరంజీవి!"

కండసిరిని మించిన కంటి సిరి, మనవూరి పాండవులు చిత్రం తీసేవేళ ఈ కన్ను ఫోర్సు చూశారా అంటూ ఒక అబ్బాయిని చూపించారు నిర్మాత జయకృష్ణ, చూడబోయాము, "చారడేసి కళ్ళతో బారెడేసి బాణాలేసి", చూసి మురిసిపోయాము, ఆ చిత్రంలో అతనిపై మొదటి షాటు, అతని కన్ను మెల్లిగా వేలుకోవడమే, ఆ తరువాత 'మంత్రిగారి వియ్యంకుడు'లో ఆ కళ్ళూ, రబ్బరు బొమ్మ లాంటి ఒళ్ళూ చేసిన చమత్కారాలూ, అద్భుతాలూ అన్నీ ఇన్నీ కాదు. పదిమందిని ఒంటి చేత్తో చావగొట్టాడన్నా, రైలు బండిని చెరుగ్గడలా విరిచి నమిలేసాడన్నా, నమ్మించగల ఆ కంటిసిరి, చిరుకేసరి, అది తెలుగు సినిమాకే సిరి.

అతని విజయం వడ్డించిన విస్తరి కాదు, ఎవరెస్టు శిఖరం మీదకి హెలికాప్టరు నుండి దిగలేదు, రెండు కాళ్ళు, రెండు చేతులూ, 32 పళ్ళూ, కొండలాటి గుండె సాధనాలుగా అడుగు అడుగుకీ అడుగులేస్తూ, పడుతూ లేస్తూ, పైకి చేరి జెండా ఎగరేసిన రియల్ హీరో... చిరంజీవి!!!

– "బాపు, రమణ"



పి.ఎన్.ఆర్. పిక్చర్స్

## జ్వాల

విడుదల : 14-7-1985

నిర్మాత : పింజల నాగేశ్వరరావు

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

చిరంజీవి ద్విపాత్రాభినయంతో అనమాన అభినయంతో విజయవంతంగా ప్రదర్శించబడిన 'జ్వాల' దర్శకుడిగా రవిరాజా కెరీర్‌ని నిర్ణయించింది, రవిరాజా చిరంజీవిని డైరక్ట్ చేసిన తొలి చిత్రం 'జ్వాల'.

నీకై వేచి ఉన్నాను, కలికి చిలక వంటి బహుళ ప్రజాదరణ పొందిన గీతాలు జ్వాలలోనివే.

శ్రీ వెంకటకృష్ణా ఫిలింస్




విడుదల : 26-7-1985

నిర్మాత : ఎ. గోపాలక్రిష్ణారెడ్డి  దర్శకత్వం : రాజ్‌భరత్

చిరంజీవి ఇంట్రడక్షన్ సన్నివేశం, క్లైమాక్స్‌లో పోరాటాలు బావుంటాయి.

## ఆలోచనా ధోరణి

చిరంజీవి ఆలోచనా ధోరణి అంతర్లీనంగా సాగే గంగా ప్రవాహంలా ఉంటుంది. ఓ పాత్రికేయుడు ఆయన్నోసారి "మీరు పదేళ్ళ తరువాత చేయవలసిన పనులూ, ఆలోచనలు ఇప్పుడే చేస్తున్నారని ప్రశ్నిస్తే దానికి చిరంజీవి సమాధానం ఈ క్రింది విధంగా సాగింది....

"బహుశా నా సినిమా జీవితం మొదట్లో నేను పడ్డ పాట్లు నాకీ ధోరణి అలవాటు చేశాయేమో?! అయితే ఈ ధోరణి అలవడడానికి ఏ సంఘటన కానీ, వ్యక్తి కానీ కారణం కాదు కానీ... "మెగాస్టార్ చిరంజీవిది గోల్డెన్ స్పూన్ బర్త్. కొణిదెల శివశంకర వరప్రసాద్‌ది కష్టాలు, నష్టాలు తెలిసిన మనస్తత్వం" అని!!!



గోపీ మూవీస్

## రక్త సింధూరం

విడుదల : 24-8-1985

నిర్మాత : ఎ. శేషారత్నం

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

వామపక్ష భావాలుగల 'గండ్ర గొడ్డలి'గా చిరంజీవి నిరుపమానమైన నటనని ప్రదర్శించిన 'రక్తసింధూరం' మరో యండమూరి నవలా చిత్రం.

చిరంజీవి ద్విపాత్రాభినయం చేయగా విజయవంతమై శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'రక్త సింధూరం'లో కదిలిందీ కల్కి అవతారము, ఇది సరిగమపాడిన స్వరవీణ వంట మధుర గీతాలున్నాయి.

చిరంజీవి రాధతో 'క్రికెట్' ఆడే దృశ్యాలు వినోదాన్ని పెంచాయి.

### 'సివిల్ సెన్స్'

చిరంజీవిలో ఈ పాళ్ళు ఎక్కువే. సివిల్ సెన్స్ గురించి మాట్లాడ్డమేకాదు, ఆచరణలో ముందుంటారు మెగాస్టార్... ఆయన ఏ హోటల్లో దిగినా, గెస్ట్ హౌసుల్లో మకాం చేసినా సరే ఖాళీ చేసేటప్పుడు చాలా ఖచ్చితంగా అక్కడి వస్తువులన్నీ యథాస్థానంలో సర్దేస్తారు. హోటల్ మేనేజ్‌మెంట్ తన శుభ్రత గురించి, ప్రవర్తన గురించి ఏమీ కామెంట్ చేయకూడదన్నది మెగాస్టార్ మెంటాలిటి. విదేశాల్లో అయితే ఈ క్లీనింగ్ విషయంలో మరీ పట్టుదలగా ఉంటారు. లేకపోతే హోటల్ మేనేజ్‌మెంట్ ఈ ఇండియన్లంతా ఇంతే అని చిరాకు పడకూడదని చిరంజీవి అభిప్రాయం...



గోపీ ఆర్ట్ పిక్చర్స్




విడుదల : 19-9-1985

నిర్మాత : చలసాని గోపి  దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

'చిరంజీవి' పూర్తి స్థాయి హీరోగా 'కె. రాఘవేంద్రరావు' దర్శకత్వంలో నటించిన 'అడవిదొంగ' అతి పెద్ద కమర్షియల్ ఎంటర్‌టైనర్‌గా నిలిచి చిరంజీవి కెరీర్‌ని మరో మలుపు తిప్పింది.

సగం చిత్రానికి పైగా మాటలే లేని టార్జాన్ పాత్రని ధరించిన చిరంజీవి అన్ని వర్గాల ప్రేక్షకుల్ని విశేషంగా ఆకర్షించిన 'అడవిదొంగ'లో నృత్యాలు, పోరాటాలు, సన్నివేశాలు వేటికవే సాటిగా, మిన్నగా కనిపించి కనువిందు చేస్తాయి. చిరంజీవి పాత్ర పేరు 'కాళిదాసు'.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'అడవిదొంగ' చిత్రం తర్వాత ఏ పాత్రపడితే ఆ పాత్ర, ఏ చిత్రమైనా ఫర్లేదు అనే పద్ధతికి చిరంజీవి స్వస్తి పలికారని చెప్పవచ్చు, 'ఎంపిక' చేసుకుని మరీ చిరంజీవి నటించడం 'అడవిదొంగ'తోనే మొదలైంది.

## తొలి నేపథ్య గాయకుడు

చిరంజీవి తొలి ప్లే బాక్ సింగర్ జి. ఆనంద్, 'ప్రాణం ఖరీదు'లో చిరంజీవి, రేష్మరాయ్‌ల యుగళ గీతానికిగాను చిరంజీవికి తొలిసారిగా పాడారు జి. ఆనంద్!!



గీతా ఆర్ట్స్

## విజేత

విడుదల : 23-10-1985

నిర్మాత : అల్లు అరవింద్ దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

చిరంజీవి నటన ఒక వైపు, కథాబలం మరోవైపు సమతూకంలా నిలిచి గెలిచిన 'విజేత' శతదినోత్సవ వేడుకలు జరుపుకోవడానికి 'విజయవాడ' వెళితే ప్రేక్షకాభిమానుల అత్యుత్సాహం ముందు తట్టుకోలేక చెన్నై వచ్చి చోళా హోటల్‌లో ఆ వేడుకల్లో పాలుపంచుకున్నారు.

చెల్లెలి పెళ్ళి కోసం కిడ్నీ అమ్మే త్యాగభరితమైన మధుసూదనరావు (చినబాబు)గా చిరంజీవి నటించిన 'విజేత'లో ఫుట్‌బాల్ క్రీడాకారుడిగా చిరంజీవి యువతకు బాగా చేరువయ్యారు అన్ని వర్గాల ప్రేక్షకుల్ని చిరంజీవి మరో మారు అలరించిన 'విజేత' చిత్రం చిరంజీవి కెరీర్‌లో మరో మధురమైన మజిలీ. 'విజేత' వంటి గొప్ప చిత్రాన్ని నిర్మించి అల్లు అరవింద్ తమ అవినా'బావ' సంబంధాన్ని బలపరుచుకున్నారు. ఎంత ఎదిగిపోయావయ్యా, నీ మీద లోలోన, సిక్సో క్లాకు వంటి విశేషాదరణ పొందిన గీతాలున్న 'విజేత' చిత్ర శతదినోత్సవ వేడుకలు తొలిసారి ఔట్‌డోర్‌గా 'విజయవాడ'లో ఏర్పాటు చేయబడి ప్రేక్షకాభిమానుల బలం ఎంతుందో 'అర్థం' చేసుకోవడం జరిగింది.

## గాయకుడు

మెగాస్టార్ చిరంజీవి బాత్‌రూమ్‌లో కూని రాగాలు తీయడం, షూటింగ్ స్పాట్‌లో సాంగ్ పిక్చరైజేషన్ ఉంటే 'హమ్' చేయడం మాత్రమే చేస్తారు. అలాంటి చిరంజీవి చేత ఏకంగా "తమ్ముడూ.. అరె తమ్ముడూ" అంటూ "మాస్టర్" సినిమాలో ఏకంగా పాటనే పాడించిన ఘనత "ది గ్రేట్ అల్లు అరవింద్ గారిదే" తర్వాత 'స్నేహం కోసం' ఫస్ట్ సాంగ్‌లో చిరంజీవి గొంతు కలిపారు, 'మృగరాజు'లో 'ఛాయ్' పాట పాడారు. 'శంకర్‌దాదా MBBS'లో కూడా పాటలో గొంతు కలిపారు.



లక్ష్మీ ఫిలింస్ డివిజన్

# కిరాతకుడు

విడుదల : 1-1-1986

నిర్మాత : లక్ష్మీ ఫిలింస్ డివిజన్

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

సాంకేతికంగా అత్యున్నత ప్రమాణాలతో రూపొందించబడి ప్రేక్షకుల అభిరుచిలో మార్పు రాని కాలంలో కొంచెం ముందుగా విడుదలైన చిత్రం కిరాతకుడు.

చిరంజీవి నటన, డ్యాన్సులు ఒకదానితో ఒకటి పోటీ పడిన కిరాతకుడు చిత్రంలో ఆయన పాత్ర పేరు 'చరణ్'.

నన్నీలోకం రమ్మనలేదు, సంపంగి ముద్దు, ఒక ముద్దు చాలు వంటి మధురగీతాలున్న కిరాతకుడు చిత్రంపై హాలీవుడ్ యాక్షన్ చిత్రాల ప్రభావం బలంగా కనిపిస్తుంది.

## తొలి దండ, తొలి పారితోషికం, తొలి షీల్డు

'చిరంజీవి'కి ఈ మూడూ అంది వచ్చింది 'మనవూరి పాండవులు' సినిమాతోనే.. 'మనవూరి పాండవులు' చిత్రంలో నటించినందుగ్గాను చిరంజీవికి అక్షరాలా 1116/- వెయ్యి నూట పదహార్లు పారితోషికంగాను, శతదినోత్సవ వేడుకల్లో నిర్మాతల్లో ఒకరైన జయకృష్ణ దండవేస్తే, మరో నిర్మాత, హీరో అయిన 'కృష్ణంరాజు' షీల్డ్‌ని అందించారు...

**కొసమెరుపు :-** చిరంజీవి, కృష్ణంరాజు ఈ ఇద్దరి పశ్చిమగోదావరి జిల్లా 'మొగుల్తూరు' కావడం విశేషం...



దేవీ ఫిలింస్ ప్రొడక్షన్స్



విడుదల : 31-1-1986

నిర్మాత : కె. దేవీవరప్రసాద్

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

టైటిల్ రోల్ ధరించిన చిరంజీవి ఫక్తు మాస్ కమర్షియల్ ఫార్ములా చిత్రమైన ఈ చిత్రంలో బాగా నటించి ఒప్పించారు. శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'కొండవీటి రాజా'లో 'మంచమేసి దుప్పటేసి మల్లెపూలు చల్లానురాజా' అనే గీతం ఇప్పటికీ ఎవర్ గ్రీన్.

"ప్రతిభ గల వ్యక్తి చరిత్రలో మిగిలిపోతాడు, అతని జీవితం మార్గదర్శకం, స్ఫూర్తిదాయకం, ఆచరణీయం.. అదృష్టవంతుడి గురించి కూడా చరిత్రలో చెప్పుకొంటారు, కానీ అది యాదృచ్ఛికం మాత్రమే. అది మార్గదర్శకం కాదు, స్ఫూర్తిదాయకం కానేరదు, ఆచరణీయం అంతకంటేకాదు."



శ్యాంప్రసాద్ ఆర్ట్స్

# మగధీరుడు

విడుదల : 7-3-1986

నిర్మాత : ఎం. రవీంద్రనాథ్‌చౌదరి

దర్శకత్వం : విజయబాపినీడు

విజయవంతంగా ప్రదర్శించబడిన మగధీరుడు చిత్రంలో ఒక పౌరాణిక నాటక సన్నివేశంలో చిరంజీవి సత్య హరిశ్చంద్రుడిగా పాత్ర పోషణ చేశారు.

'ఇంటి పేరు అనురాగం ముద్దుపేరు మమకారం' అనే విశేషాదరణ కల్గినగీతం ఇందులోనిదే.

"నేను విమానం ఎక్కినప్పుడల్లా క్రిందకు చూస్తాను. ఇలా చాలామంది చూస్తారు, వాళ్ళు మేఘాలను, క్రింద కనిపించే దృశ్యాలను చూసి ఆనందిస్తారు. అదేమిటోగానీ నేను క్రిందకు చూసినప్పుడల్లా నాలో ఒక రకమైన భావనలు కలుగుతాయి. వాటిని నా పరిభాషలో ఫిలసాఫికల్ ఆలోచనలు అనుకొంటూ ఉంటాను. క్రిందకు చూస్తే పెద్ద నగరం చిన్నగా అగుపిస్తుంది. ఆ నగరంలోని వీధులు మరీ చిన్నగా కనిపిస్తాయి. ఆ వీధుల్లోని ఇళ్ళు ఇంకా చిన్నగా, అందులోని గదులు, ఆ గదుల్లో నివసించే మనుషులు ఇంకా చిన్నగా అగుపిస్తారు. వాళ్ళు అనేక సమస్యలతో సతమతమౌతుంటారు. జీవన సమరం చేస్తూంటారు. వారెందుకు అభివృద్ధి చెందలేదు. వారి మానసిక పరిస్థితి ఎందుకు పరిపక్వత చెందలేదు, అలా అలా ఆలోచిస్తూంటాను. నాలో నేను విశ్లేషించుకుంటూ ఉంటాను.

ఈ రకమైన ఆలోచనలు ఒక రోజులో వచ్చినవి కావు, అలా అలా ఎదిగినవే.. చిన్నప్పట్నుంచి మంచిగా ప్రవర్తించాలి, బాగుండాలి, పెద్దలు చెప్పింది వినాలి, మంచివాడు అన్పించుకోవాలి, అందుకు తగిన రీతిలో నన్ను నేను మలుచుకుంటూ వున్నాను. ఆ విధానమే నన్ను ఇలా నిలిపిందనిపిస్తోంది."



సంయుక్తా మూవీస్

# వేట

విడుదల : 28-5-1986

నిర్మాత : ఎం. తిరుపతిరెడ్డి

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

హాలీవుడ్ చిత్రాల పోకడలు, ఛాయలు మెండుగా ఉన్న 'వేట'లో పలు విధాలైన గెటప్స్‌తో చిరంజీవి ఆకట్టుకుంటారు. ఓ లేడికూన ఈ వేటలోన అనే విషాదగీతం ఇందులోనిదే.

## తమిళనాడులో విడుదలైన చిరంజీవి తొలి సినిమా

'ఆరని మంటలు' సినిమా రీ రికార్డింగ్ జరుగుతుండగా చూసిన 'మోహన్' ఆ చిత్ర సంగీత దర్శకుడు 'సత్యం'గారితో "హీరోగా చేసిన ఈ కుర్రాడు చాలా బాగా చేశాడు" అని చెప్పడమే కాక 'ఆరని మంటలు'ని కొని తమిళ్‌లో డబ్ చేసి విడుదల చేశారు, తమిళనాడులో విడుదలైన చిరంజీవి తొలి సినిమా అదే.. అన్నట్టు కాలప్రవాహంలో ఆ 'మోహన్' మెగాస్టార్ చిరంజీవిగారితో డైరక్ట్‌గా తెలుగులో 'హిట్లర్' నిర్మించిన 'ఎడిటర్ మోహన్' కావడం విశేషం.



జ్యోతి ఆర్ట్ పిక్చర్స్

## చంటబ్బాయ్

విడుదల : 22-8-1986

నిర్మాత : భీమవరపు బుచ్చిరెడ్డి దర్శకత్వం : జంధ్యాల

హాస్య బ్రహ్మ 'జంధ్యాల' పెక్కు చిరంజీవి చిత్రాలకు సంభాషణలు అందించినా, చిరంజీవిని డైరక్ట్ చేసిన ఏకైక చిత్రం 'చంటబ్బాయ్', మల్లాది వెంకటకృష్ణమూర్తి చంటబ్బాయ్ నవల ఆధారంగా నిర్మించబడింది.

చంటబ్బాయ్‌లోని పాండురంగారావు పాత్రతో చిరంజీవి ఆబాలగోపాలాన్ని అలరించడమేగాక చిన్న పిల్లలకు బాగా చేరువయ్యారు.

చంటబ్బాయ్‌లోని చిరంజీవి హాస్య రసపోషణ, ఒక పాటలో మిస్‌మేరీ (చిరంజీవి స్త్రీ పాత్రధారణ చేశారు), పోతురాజు, హరిదాసు, మరో పాటలో ఏకంగా చార్లీ చాప్లిన్ పాత్రల్ని ధరించి మెండుగా, దండిగా వినోదాన్ని అందించారు. ఇప్పుడు చూసినా, ఇంకెప్పుడు చూసినా తనివితీరా ఆనందింపజేసే నవ్వుల నిధి 'చంటబ్బాయ్'.

చిరంజీవి అసిస్టెంట్‌గా 'అల్లు అరవింద్' నటించి నవ్వించిన చిత్రం చంటబ్బాయ్.

'ఉత్తరాన వెలసిందీ ధృవనక్షత్రం' అనే మధురగీతం చంటబ్బాయ్ లోనిదే.



## హీరోలుగా
## చిరంజీవితో కలిసి నటించిన
## ఇతర హీరోలు

కీ॥శే॥ ఎన్.టి. రామారావు, అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణ, శోభన్‌బాబు, కృష్ణంరాజు, కమల్‌హాసన్, రజనీకాంత్, చంద్రమోహన్, మురళీమోహన్, మోహన్‌బాబు, రాజేంద్రప్రసాద్, రవిచంద్రన్, డా॥ రాజశేఖర్, సురేష్, రవితేజ, వెంకట్, శ్రీకాంత్ తదితరులు... కాగా 'హిట్లర్' చిత్రంలో బహుముఖ ప్రజ్ఞాశాలి డా॥ దాసరి నారాయణరావు మెగాస్టార్ చిరంజీవికి తండ్రిగా నటించారు.




విడుదల : 2-10-1986

నిర్మాత : కె.ఎస్. రామారావు,దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

మరో యండమూరి నవలా చిత్రం 'రాక్షసుడు' పూర్తిగా స్కోప్‌లో నిర్మించిన చిత్రం. ఇందులో చిరంజీవి పాత్రకసలు పేరేలేదు. ఒక పాత్ర చిరంజీవిని 'ఫ్రెండ్' అంటే మరో పాత్ర 'జి.కె. పెంపుడు కొడుకు' అని ఒక హీరోయిన్, రాధ 'పురుషా' అనీ చిరంజీవిని సంబోధిస్తే మరో హీరోయిన్ సుహాసిని చిరంజీవిని పేరే అడగదు, చాలా పకడ్బందీగా ఉంటుంది పిలుపుల వ్యవహారం... (రచయితలు అభినందనీయులు).

సంగీతపరంగా శ్రోతల్ని విశేషంగా అలరించిన 'రాక్షసుడు' స్క్రీన్‌ప్లేపరంగా కూడా ఎక్కువ మార్కుల్నే సంపాదించుకుంది. అచ్చా అచ్చా, మళ్ళీ మళ్ళీ ఇది రానిరోజు, నీ మీద నాకు, గిలిగా గిలిగిలిగా, జయ జయ ప్రియభారత, హేనాటీ లవ్ బోయ్ వంటి మధురగీతాలున్న 'రాక్షసుడు' చిత్రంలో 'కులుమనాలి', కాశ్మీర్ అందాలు కనువిందు చేశాయి. శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రం.

చిరంజీవి సోదరుల్లో ఒకరైన నాగేంద్రబాబు నటుడిగా తెరపైన కనిపించిన తొలి చిత్రం 'రాక్షసుడు'.

## రుచులు

చిరంజీవికి ఇష్టమైన వంటకం ఉప్పు చేప పప్పు చారు..

అత్తయ్య అల్లు కనకరత్నంగారు చేసే ఆనపకాయ దప్పళం అన్నా కూడా చాలా ఇష్టం.. చిరంజీవిగారి భోజన ప్రియత్వాన్ని గురించి వ్రాయాలంటే ఈ పేజీ సరిపోదు, దాన్ని బట్టి ఆయనెంతటి భోజన ప్రియులో మీరే ఊహించుకోండి!!



దీపక్‌రాజ్ పిక్చర్స్

## ధైర్యవంతుడు

విడుదల : 27-11-1986

నిర్మాతలు : యాక్నేస్వామి, రామ్‌దీపక్

దర్శకత్వం : పి. లక్ష్మీదీపక్

డి.వి.ఎస్. ప్రొడక్షన్స్



విడుదల : 18-12-1986

నిర్మాత : డి.వి.ఎస్. రాజు

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

సుప్రసిద్ధ నిర్మాణ సంస్థ డి.వి.ఎస్. ప్రొడక్షన్స్‌లో చిరంజీవి నటించిన ఏకైక చిత్రం.

## చిరు సూక్తులు

1. సాధనతో లక్ష్యాన్ని ఛేదించండి.
2. సమయాన్ని సద్వినియోగం చేసుకొని పట్టువదలని ఆత్మవిశ్వాసంతో ముందడుగు వేయండి.
3. మనం బ్రతికి పదిమందిని బ్రతికించాలి. మనం ఆనందపడి పదిమందిని ఆనందపరచాలి.
4. జనంమీద బ్రతకడంకంటే జనం కోసం బ్రతకడం అలవర్చుకోవాలి.
5. ఆకలికి తిండి అవసరం కాని తిండి కోసమే బ్రతక్కూడదు.
6. ఓర్పును మించిన తపస్సులేదు. ఆత్మవిశ్వాసాన్ని మించిన ఐశ్వర్యం లేదు.
7. మనం శాంతియుతమై ఉంటే ఇల్లు శాంతినిలయమౌతుంది.
8. దివ్యమైన జీవితాన్ని కోరుకోవాలి కాని దీర్ఘ జీవితాన్ని కాదు.
9. గొప్ప వ్యక్తిత్వం, మంచితనం, మేధస్సు, ప్రేమ, దయ ఇవియే నిజమైన ఆస్తులు.

వివిధ సందర్భాలలో మెగాస్టార్ చిరంజీవిగారు అభిమానులను ఉద్దేశించి చెప్పిన సూక్తులు!!



మహేశ్వరీ ప్రొడక్షన్స్

దొంగమొగుడు

విడుదల : 9-1-1987

నిర్మాత : ఎస్.పి. వెంకన్నబాబు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

రవితేజగా, నాగరాజుగా చిరంజీవి ద్విపాత్రాభినయం చేసిన దొంగమొగుడు వినోద ప్రధానమైన ఇతివృత్తంలో ప్రేక్షకుల్నెంతగానో అలరించిన చిత్రం. శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న చిత్రం.

రవితేజగా జంటిల్‌మెన్ తరహా బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌గా ఒకవైపు, నాగరాజుగా బ్లాక్‌లో టిక్కెట్లు అమ్ముకునే వాడిగా మరోవైపు చిరంజీవి నటనలో ఆరితేరిపోయారనిపించే చిత్రం దొంగమొగుడు. పిలక పంతులుగా ఒక పాటలో తెగనవ్వించిన చిరంజీవి 'దొంగమొగుడు' యండమూరి 'నల్లంచు తెల్లచీర' నవలలోని కొన్ని పాత్రల చుట్టూ, సన్నివేశాల చుట్టూ తిరుగుతుంది. నల్లంచు తెల్లచీర, ఈ చెంపకి సెలవీయకు, ఇడ్లీపాప, కోకమ్మవంటి మధురగీతాలు.

## "నవరస నవలా చక్రవర్తి"

తెలుగు చలన చిత్ర చరిత్రలో అత్యధిక నవలా చిత్రాల్లో నటించిన 'కథానాయకుడు' కూడా చిరంజీవి కావడం విశేషం... శ్రీమతి డి. కామేశ్వరి నవల క్రొత్త మలుపు ఆధారంగా నిర్మించిన 'న్యాయం కావాలి' ఎంత పెద్ద హిట్టో తెలిసిందే... తర్వాత కూడా ఎందరో రచయిత్రుల నవలల ఆధారంగా చిరంజీవితో చిత్రాలు రూపొందించబడ్డాయి. ఆ సరికి యండమూరి వీరేంద్రనాథ్, మల్లాది వెంకటకృష్ణమూర్తి నవలా రచయితలుగా చాలా పాపులర్.. 'అభిలాష'తో సీరియస్‌గా, సీరియల్‌గా మొదలైన చిరంజీవి నవలా చిత్రాలు చాలానే ఉన్నాయి, ఛాలెంజ్, రక్తసిందూరం, చంటబ్బాయ్, రాక్షసుడు, దొంగ మొగుడు, మరణమృదంగం, రుద్రనేత్ర, స్టూవర్ట్‌పురం పోలీస్‌స్టేషన్ మొదలైన చిత్రాలన్నీ నవలల ఆధారంగా రూపొందించినవే!!!



గీతా ఆర్ట్స్

# ఆరాధన

విడుదల : 27-3-1987

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : భారతీరాజా

హృదయంతో చిత్రాల్ని వెండితెరపై ఆవిష్కరించే ప్రముఖ దర్శకుడు 'భారతీరాజా' చిరంజీవిని వినూత్న కోణంలో ప్రదర్శింపజేసిన చిత్రం ఆరాధన.

విజయవంతంగా ప్రదర్శించబడిన 'ఆరాధన'లో చిరంజీవిపాత్ర పేరు 'పులిరాజు'.

ప్రేమకోసం పరితపించే పల్లెటూరి యువకుడిగా చిరంజీవి నుండీ అద్భుతమైన నటనను వెలికితీసి విమర్శకుల ప్రశంస లందుకునేలా చేసిన చిత్రం 'ఆరాధన'.

'అరె ఏమైందీ', తీగనైమల్లెలా వంటి విశేషాదరణ పొందిన గీతాలు 'ఆరాధన'లోనివే.

## "దేవుడూ చిరంజీవి!!!"

"నా చిన్నతనంలో దేవుడంటే భక్తికంటే భయం ఎక్కువగా ఉండేది. తరువాత దేవుడు నిర్దాక్షిణ్యంగా ఎవరినీ బాధపెట్టడని, ఎంతో దయగలవాడని అర్థమై భయం స్థానంలో భక్తి ఏర్పడింది. దేవుళ్ళందరంటే భక్తి వున్నప్పటికీ, ఒకే దేవుడిని బలంగా నమ్మాలన్న ఉద్దేశమో ఏమో తెలియదుగానీ నాకు ఆంజనేయస్వామి అంటే ఎంతో భక్తి, మానసికంగా ధైర్యంగా ఉండడానికిగానీ, శారీరకంగా బలంగా ఉండడానికిగానీ, ఏదైనా సాధించడానిగ్గానీ ఆంజనేయస్వామి అండదండలుంటే బావుంటుందని అనుకున్నానేమోగానీ, చిన్నప్పుడు ఆంజనేయస్వామి అంటే చాలా గాఢమైన భక్తి నాలో నాటుకుపోయింది. అప్పటి నుంచే ఆంజనేయుడు నా ఇష్టదైవం. నాకు సంతోషం కలిగినా, కష్టమొచ్చినా మానసికంగా ఆయనతోనే నేను షేర్ చేసుకుంటూ వస్తున్నాను. మా ఇంట్లో హనుమాన్ చాలీసాగానీ, ఆంజనేయ దండకంగానీ చదవడం అంటూ జరిగినా, ఆంజనేయుడి ప్రతిమకు పూజ చేయడం జరిగినా అది నాతోనే ప్రారంభమైంది. అలా ఆంజనేయస్వామి మా కుటుంబానికి ఇష్టదైవం, కుల దైవం అయ్యారు.

'ఇష్టదైవం' ప్రసక్తి వచ్చినపుడు శ్రీ చిరంజీవి పై విధంగా చెప్పారు.



వసంత ఆర్ట్ ప్రొడక్షన్స్

## చక్రవర్తి

విడుదల : 4-6-1987

నిర్మాత : డా|| కె. వెంకటేశ్వరరావు

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

'అంజి' అనే గ్రామీణ యువకుడు 'చక్రవర్తి'గా ఎదిగే ఆసక్తికర ఇతివృత్తంతో చెల్లెలి సెంటిమెంట్‌తో సాగే వినోద ప్రధానమైన చిత్రం 'చక్రవర్తి' శతదినోత్సవ వేడుకలు జరుపుకున్నాడు.

దర్శకుడిగా 'రవిరాజా'ను మరోమెట్టు పైకెక్కించిన 'చక్రవర్తి' చిత్ర నిర్మాత చిరంజీవి తోడల్లుడైన డా|| కె. వెంకటేశ్వరరావు అయితే చిత్ర సమర్పకులు 'అల్లు అరవింద్'.

ఏల జోలపాడేనయ్యా సామీ, వన్నెలరాణీ వంటి విశేషాదరణగల్గిన గీతాలు చక్రవర్తిలోనివే.

"తారా మణిహారం తెలుగు సినిమా చరిత్ర" "చిరంజీవి" గురించి ఏమంటోంది?!

ప్రగాఢ ముద్ర

## వెండితెర దీప్తి : వాణిజ్య వ్యాప్తి

## చిరంజీవి

అప్పటివరకు మంద్ర మందాకినిలా ఉన్న తెలుగు సినిమా పరిశ్రమకు పాపికొండల వద్ద గోదావరి వంటి ఉధృతాన్ని, వేగాన్ని సంతరింపజేసి, అంతవరకూ ప్రయాణిస్తున్న బాటను మలుపు తిప్పి సరికొత్త దారుల్లో సంతరింప చేసిన, చేస్తున్న ఘనత చిరంజీవిది. వయో, లింగ భేదం లేకుండా ఆబాలగోపాలాన్ని అనునిత్యం అలరిస్తున్న నేటి తరం అగ్రకథా నాయకుడు చిరంజీవి.

చిన్న పిల్లల నుంచి వృద్ధుల వరకు ప్రతి ఇంట్లో, ప్రతి ఒక్కరూ చిరంజీవిని తమవాడిగా భావిస్తారు. తమ సొంత మనిషిలా అనుకుంటారు. ఆయన నటించిన సినిమా చూడడం ఒక అవసరంలా చేసుకుంటారు. అందుకే తెలుగు సినిమా వాణిజ్య పరిధికి కేంద్రబిందువు, తెలుగు సినిమా చరిత్రను మలుపు తిప్పిన అభినయ సింధువు అయ్యారు చిరంజీవి. చిరంజీవి అంటే యువతకు ఆరాధన.



గీతా ఆర్ట్స్




విడుదల : 23-7-1987

నిర్మాత : అల్లు అరవింద్ దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

'ఖైదీ', 'అడవిదొంగ' చిత్రాల తర్వాత చిరంజీవి కెరీర్‌ని మరో బలమైన మలుపు తిప్పిన ఘనాతిఘన విజయం 'పసివాడి ప్రాణం'. తెలుగునాట కొన్ని థియేటర్లలో 5 ఆటలతో 175 రోజులు ప్రదర్శించబడి ఒక సరిక్రొత్త అధ్యాయాన్ని లిఖించుకున్న 'పసివాడి ప్రాణం' అప్పటివరకు ఉన్న తెలుగు సినిమా కలెక్షన్ల స్టామినా పెంచిన చిత్రం.

చిరంజీవి 'మధు'గా ఆద్యంతం హీరోయిజం తొణికిసలాడే పాత్రను ధరించిన 'పసివాడి ప్రాణం' తెలుగులో బ్రేక్‌డ్యాన్స్‌లకు తొలి బోణీ చేసిన చిత్రం, చాలాకాలం వరకు ప్రేక్షకులు చిరంజీవి బ్రేక్‌డ్యాన్స్ మాయలోనే ఉండిపోయారంటే అతిశయోక్తి కాదు.

చక్కని చుక్కల సందిట బ్రేక్‌డ్యాన్స్, కాశ్మీర్మలోయలో, ఇదేదో గోలగా ఉంది, అందం శరణం గచ్ఛామి వంటి మధురగీతాలు, ఆ గీతాల చిత్రీకరణకు కాశ్మీరు, కులుమనాలీ లొకేషన్లు అందమైన కాన్వాసులయ్యాయి.

'లోక్‌సింగ్' కెమెరా పనితీరు ఎంతైనా అభినందించదగ్గది.

ఈ చిత్ర ఘనవిజయంతో అల్లు అరవింద్ అగ్ర నిర్మాతగా, 'గీతా ఆర్ట్స్' అగ్రనిర్మాణ సంస్థగా అవతరించాయి.

పెద్దవాళ్ళకు ఆత్మీయ భావం. ఇక చిన్న పిల్లలకు మైమరపు. కన్నె పిల్లలకు మెరుపు.

- పెద్దాడమూర్తి, ఎల్. వేణుగోపాల్, రవి కొలికపూడి, నారాయణరాజు, కె.ఆర్.యు. వినాయకరావు

చిరంజీవి గురించి ఇలా మొదలై దాదాపుగా చిరంజీవి కెరీర్‌లోని ముఖ్యాంశాలను 'తారా మణిహారం తెలుగు సినిమా చరిత్ర' నందు 521వ పేజి మొదలు 524వ పేజి వరకు 4 పేజీలలో పొందుపరిచారు.

"తారా మణిహారం తెలుగు సినిమా చరిత్ర" నందు పేర్కొనబడిన అత్యుత్తమ తెలుగు చలన చిత్రాలలో "చిరంజీవి" నటించగా 2000 సం॥లోపు విడుదలైన చిత్రాలలో మేలిమి ముత్యాలైన కొన్ని చిత్రాలు పై జాబితాలో చోటు చేసుకొన్నాయి... అవి.

1. మనవూరి పాండవులు 1978
2. అభిలాష 1983
3. ఖైదీ 1983
4. స్వయంకృషి 1987
5. రుద్రవీణ 1988
6. గ్యాంగ్‌లీడర్ 1991

70 సం॥ల తెలుగు సినిమా ప్రస్థానంలో వివిధ దశలను ప్రతిబింబించిన, ఎంపిక చేసిన కొన్ని చిత్రాలలో పై చిత్రాలకు స్థానం లభించింది.



పూర్ణోదయా మూవీక్రియేషన్స్

# స్వయంకృషి

విడుదల : 3-9-1987

నిర్మాత : ఏడిద నాగేశ్వరరావు దర్శకత్వం : కె. విశ్వనాథ్

'పసివాడి ప్రాణం' విడుదలై కమర్షియల్ చిత్రాల విజయాలకు కొలమానంలా నిలుస్తుంటే 50 రోజుల తేడాతో విడుదలైన 'స్వయంకృషి' కళాత్మక సందేశాత్మక చిత్రంగా ఘన విజయం సాధించడం విశేషం కాగా విదేశీ చలన చిత్రోత్సవాల్లో ప్రదర్శించబడి రష్యన్ భాషలోకి అనువదించబడడం మరో విశేషం. కళాతపస్వి కె. విశ్వనాథ్ దర్శకత్వంలో చిరంజీవి నటించిన రెండో చిత్రం, కళాత్మక చిత్రాల కేరాఫ్ అడ్రస్‌గా మారిన 'పూర్ణోదయ' సంస్థలో చిరంజీవి పూర్తి స్థాయి హీరోగా నటించిన తొలి చిత్రం, కీ॥శే॥ రమేష్‌నాయుడు సంగీతం అందించిన ఆఖరి చిత్రం 'స్వయంకృషి'.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న స్వయంకృషి చిత్రంలో చెప్పులు కుట్టే 'సాంబయ్య' పాత్ర ద్వారా చిరంజీవి తొలిసారి రాష్ట్ర ప్రభుత్వ బంగారు నందిని తొలిసారిగా ఉత్తమ నటనకుగాను అందుకున్నారు.

ఒకవైపు కమర్షియల్ చిత్రం, మరోవైపు కళాత్మక చిత్రం విడుదలై ఘన విజయాలు సాధించడం చర్విత చరణం, కళాకారుడిగా చిరంజీవి స్థాయికి నిదర్శనం.

"అభిమానులం మనం
చెయ్యెత్తి జై కొడదాం!!"
**"చిరంజీవి వెనక ఉన్నది చిరంజీవే"**
అని చాటుదాం!!!

వ్యక్తికి నిర్వచనం శక్తి అన్నారు మహాకవి శ్రీశ్రీ... ఆ మహాకవి ఎప్పుడు, ఎందుకు ఆ మాటన్నారో కానీ ప్రతి వ్యక్తి ఓ మహాశక్తి.. ప్రతి రాయిలోనూ శిల్పం ఉంటుంది, దానిని సుత్తితో బద్దలు కొట్టి ఉలితో చెక్కితే కానీ శిల్పంరాదు, అలాగే ప్రతి వ్యక్తిలో అంతర్గతంగా ఉన్న శక్తిని వెలికి తీయాలంటే మనలో ఉన్న ఆ శక్తిని మనమే తెలుసుకోవాలి, మనల్ని మనవే సాన బెట్టుకోవాలి, స్థిరంగా అడుగు తీసి అడుగువేయాలి, ఆచితూచి అడుగువేయాలి, అప్పుడే ఆ వ్యక్తిలోని శక్తి వ్యవస్థాగతంగా ఎందరికో బలమైన పునాది అవుతుంది. ఎటొచ్చీ మనలో ఏ శక్తి దాగుందో తెలుసుకోవాల్సింది మనమే కానీ వేరెవ్వరూ కాదు...



రోజా మూవీస్

# జేబుదొంగ

విడుదల : 25-12-1987

నిర్మాత : ఎం. రామలింగరాజు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

అగ్రనిర్మాత ఎం. అర్జునరాజు సమర్పణలో రోజామూవీస్ పతాకంపై నిర్మించబడిన 'జేబుదొంగ' చిత్రంలో 'చిట్టిబాబు'గా చిరంజీవి హాస్యరసాన్ని బాగా పండించారు.



తాళం కప్పు వేసేసి ఉంది, తాళం చెవి నీవే ఎక్కడో దాచేసావు, వెతకాల్సింది, విజయం సాధించాల్సింది, సాధించడానికి శోధించాల్సింది మనమే... నువ్వురా.. గెలు... సాధించు.. ఈ ప్రపంచం మనందరిదీ.. ప్రతి వ్యక్తీ అప్పుడు ఓ మహాశక్తితో సమానం.. భగవంతుడు తానే ప్రతీసారీ అవతారమెత్తి ప్రతి పని చేయాల్సి వచ్చినపుడు మహాత్ముణ్ణి, మదర్‌థెరిసాని, థామస్ ఆల్వా ఎడిసన్‌ని, న్యూటన్‌ని, రామక్రిష్ణ పరమహంసని, రమణ మహర్షిని, ఏసుక్రీస్తుని, మహమ్మద్ ప్రవక్తనీ ఇలా ఎందరికో సృష్టినిచ్చాడు... వీళ్ళందరూ వారి గమ్యం ఏమిటో స్పష్టంగా నిర్దేశించుకొని ఆ గమ్యం చేరినవాళ్ళు, గమ్యం చేరే కొద్దీ ఉత్సాహం పెంచుకుంటూ వెళ్ళారే కానీ పట్టుకోల్పోలేదు

నరేంద్రుడిలో వివేకానందుడు,

గౌతముడిలో బుద్ధుడు,

మోహన్‌దాస్‌లో మహాత్మాగాంధీ

కొణెదల శివశంకర వరప్రసాద్‌లో ఓ మెగాస్టార్ చిరంజీవి.. ఉన్నారని వాళ్ళు గుర్తించారు,



దేవి ఫిలిం ప్రొడక్షన్స్

# మంచిదొంగ

విడుదల : 14-1-1988

నిర్మాత : కె. దేవీవరప్రసాద్

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

'వీరేంద్ర' అనే దొంగ కాలక్రమంలో కష్టపడి (అదీ జైలుగోడల మధ్య నుండి) చదువుకుని పోలీస్ ఆఫీసర్ కావడం అనే ఇతివృత్తంతో ఆసక్తికరంగా రూపొందించబడిన 'మంచిదొంగ' చిరంజీవి కెరీర్‌లో మరో ఘనవిజయాన్ని నమోదు చేసుకుని శతదినోత్సవ వేడుకలు జరుపుకుంది.

కన్నుకొట్టేవాడే కొంటెమొగుడు, బెడ్‌లైటు తీసెయ్యనా, వంటి మధురగీతాలు 'మంచిదొంగ'లోనివే.

ఆ వ్యక్తులు తమలో దాగున్న శక్తుల్ని వెలికితీశారు, వీరి ప్రభావం అనూహ్యం, అనన్య సామాన్యం. చిరంజీవి ఒక నటుడు, కళాకారుడు. శ్రమైక జీవన సౌందర్యానికి, అభినయ ప్రతిభకు, అచంచలమైన వ్యక్తిత్వానికి ప్రతీక చిరంజీవి. శ్రమ అతడి ఆయుధం, అందుకు ఉదాహరణగా ఓ కథ ఉంది, హిమాలయాల్లో తపస్సు చేసుకొంటున్న ఓ మహర్షి దగ్గరకు చిరంజీవే వెళ్ళి దేవుడ్ని చూడాలని ఉందని ప్రశ్నిస్తే "కొండలు, కోనలు, మెరిసే నక్షత్రాలు, పారే సెలయేళ్ళు, ఇవన్నీ భగవంతుడే కదా!" అని ఆ మహర్షి సమాధాన మిచ్చారట, ఏదో అసంతృప్తితో వెను తిరిగి వస్తున్న చిరంజీవికి ఓ బండ రాయిని బద్దలు కొడుతోన్న శ్రామికుడి చెమట చుక్క ఇంద్ర ధనుస్సులా కనిపించిందట, దేవుడెలా ఉంటాడో తెలిసి వెనక్కు మరలాడట ఆనందంతో చిరంజీవి. కష్టం ఆయనకు ఎంతో ఇష్టం, 25 సం॥లు పైబడి కష్టపడ్డారు, ఇంకా పడుతూనే ఉన్నారు. తాను



అంజనా ప్రొడక్షన్స్

# రుద్రవీణ

విడుదల : 4-3-1988

నిర్మాత : కె. నాగేంద్రబాబు  దర్శకత్వం : కె. బాలచందర్

తన మాతృమూర్తి అంజనాదేవి పేరిట, సోదరుడు నాగేంద్రబాబు నిర్మాతగా చిరంజీవి నెలకొల్పిన 'అంజనా ప్రొడక్షన్స్' పతాకంపై తొలి ప్రయత్నంగా 'అన్నాహజారే' స్ఫూర్తితో సంగీత నేపథ్యాన్ని ప్రతిబింబిస్తూ రూపొందించిన 'రుద్రవీణ' చిత్రం ఒక వర్గం ప్రేక్షకుల్ని విశేషంగా ఆకట్టుకుంది.

చిరంజీవి, జెమినీ గణేషన్, శోభనల నటన ఇళయరాజా సంగీతం, బాలచందర్ దర్శకత్వం, ఒక మంచి చిత్రాన్ని నిర్మించాలన్న నాగేంద్రబాబు తపన ఫలించి రుద్రవీణ చిత్రం జాతీయ స్థాయిలో నర్గీస్‌దత్ జాతీయ సమైక్యత చిత్రం అవార్డును భారత ప్రభుత్వం నుండీ అందుకోగా రాష్ట్ర ప్రభుత్వం నాగబాబుకు స్పెషల్ జ్యూరీని, ఇళయరాజాకు ఉత్తమ సంగీత దర్శకుడు, పాండురంగన్‌కు ఉత్తమ శబ్దగ్రాహకుడుగా నంది అవార్డుల్ని అందించింది. విశేషమేమిటంటే 'రుద్రవీణ' చిత్రానికిగాను జాతీయ సమైక్యతా చిత్రం అవార్డుతోపాటు ఇళయరాజాకు జాతీయస్థాయిలో ఉత్తమ సంగీత దర్శకుడు, ఎస్పీ. బాల సుబ్రహ్మణ్యంకు ఉత్తమ గాయకుడు అవార్డులు దక్కాయి.

చిరంజీవి నటనకుగాను ఉత్తమనటుడిగా ముచ్చటగా మూడవసారి 'ఫిలింఫేర్' అవార్డునందుకుంది 'రుద్రవీణ' చిత్రానికే, ఈ చిత్రంలో చిరంజీవి పాత్ర పేరు సూర్యనారాయణశాస్త్రి.

నవ్వుతూ ఉంటే ఎదుటివారు కూడా నవ్వుతూండాలి, ఆనందంగా ఉండాలన్నది చిరంజీవి సిద్ధాంతం, విజయ మంటే ఎదుటివాడ్ని ఓడించడం కాదు, తన్ను తాను గెలవడం అని ఆయన ఎన్నిసార్లు తన చర్యలద్వారా, ప్రవర్తనద్వారా, విజయాల ద్వారా నిరూపించారో ప్రత్యేకించి నేను వ్రాయనవసరం లేదు, మనిషిని మనిషిగా గౌరవించే సంస్కారం చిరంజీవిగారిలో ప్రస్ఫుటంగా చూడొచ్చు ఎవరైనా!

స్ఫూర్తి ఎవరన్న ప్రశ్నకోసారి సమాధానం చెబుతూ "నన్ను కన్న నా తల్లిదండ్రులు, కుటుంబం, సహచరులు, అభిమానులు, ప్రజలు, ప్రేక్షక దేవుళ్ళు వీళ్ళందరూ నాకు స్ఫూర్తి, "నేనేమిటో?" నాకు తెలియజెప్పింది వీళ్ళే... వీళ్ళే ఎప్పటికప్పుడు స్పందించకపోయి ఉంటే నేనేమై పోయేవాణ్ణో, అందుకే ఎందరో మహానుభావులు, వారంతా నా స్ఫూర్తిదాతలు" అన్నారు వినమ్రంగా.. ఆయన గంభీరమైన



డైనమిక్ మూవీ మేకర్స్




విడుదల : 29-4-1988

నిర్మాతలు : సుధాకర్, హరిప్రసాద్, నారాయణరావు

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

చిరంజీవి కెరీర్‌లో కమర్షియల్ బ్లాక్‌బస్టర్‌గా నిలిచిన 'యముడికి మొగుడు' సోషియోఫాంటసీ వినోదభరిత కాలక్షేప చిత్రం. 'కాళి'గా, బాలరాజుగా రెండు పాత్రల్ని ఒకే నటుడైన చిరంజీవి సమన్వయంతో పోషించి ప్రతిభావంతం చేసిన తీరు అనన్య సామాన్యం. చిరంజీవి, రాధ, కైకాల సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రావుగోపాలరావు, ప్రసాద్‌బాబు, సుత్తివేలు, సుధాకర్, కోటశ్రీనివాసరావు, అన్నపూర్ణ ఇలా ప్రతి పాత్రా ప్రాధాన్యాన్ని సంతరించుకోవడంతో వినోదం సమపాళ్ళలో పండి విశేషాదరణకు ఈ చిత్రం నోచుకుంది. చిరంజీవి చిత్రానికిగాను 'రాజ్ కోటి' సంగీతం తొలిసారిగా అందించిన యముడికి మొగుడుతో తెలుగునాట మరో సంగీత విప్లవం మొదలైంది, భిన్న రుచుల్ని, విభిన్న ధోరణుల్ని తమ సంగీత దర్శకత్వంతో మొదలుపెట్టిన 'రాజ్‌కోటి' యముడికి మొగుడులో ప్రతిపాటనీ సూపర్ హిట్ చేశారు.

ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ శిక్షణా కాలంలో 'చిరంజీవి' స్నేహితులైన నారాయణరావు (సీనియర్), సుధాకర్, హరిప్రసాద్‌లను నిర్మాతలుగా, దర్శకుడిగా రవిరాజా పినిశెట్టిని పూర్తి స్థాయి కమర్షియల్ దర్శకుడిగా నిలబెట్టిన చిత్రం యముడికి మొగుడు. 'యముడికి మొగుడు' చిత్ర శతదినోత్సవ వేడుకలు చెన్నై మెరీనా బీచ్‌లో జరిగాయి, ఆ వేడుకల్లో అప్పుడు ఆంధ్రలో ఆత్మహత్యలు చేసుకున్న పత్తిరైతుల కుటుంబాల వారిని పిలిపించి చిరంజీవి ఆర్థిక సహాయమందించడం జరిగింది.

హుందాతనం మూర్తీభవించుకొన్న మనిషి.. ఆ హుందాతనానికి తోడుగా ఒదిగి ఉండడం చాలా గొప్ప ఆభరణం.

స్వామి వివేకానంద ఒక మాట చెప్పారు "మన భవిష్యత్తుకు మనమే శాసనకర్తలం" అని.. బహుశా తన భవిష్యత్తుపై విద్యార్థి దశలోనే ఒక అవగాహనకు వచ్చారేమో ఆయన అందుకే కాబోలు ఎన్.సి.సి. కేడెట్‌గా క్రమశిక్షణాయుతమైన జీవితానికి ఆ రోజులనుండే అలవాటుపడ్డారు, ఏ పరిస్థితులలోనైనా శారీరకంగా, మానసికంగా దృఢంగా ఉండగలిగారు.. అంతేకాదు ఓడిపోయిన ప్రతిసారీ ఓటముల్ని లెక్కబెట్టారు కాబట్టే "గెలుపు" దానంతట అదే నడిచి వచ్చింది, అలా గెలవడానికి మాత్రం, ఈ ప్రపంచమంతా నిద్రలో జారుకొన్నా తను మాత్రం మేలుకొనే పరిశ్రమించాడు.. కాబట్టే ప్రథమ స్థానానికి చేరుకొన్నాడు, పడిలేచినా పతాక మాత్రం ఎగురవేస్తూనే ఉన్నాడు, తన మీద తనకు నమ్మకం కూడా ఎక్కువే, Belief is Power... ఆ






విడుదల : 10-6-1988

నిర్మాత : ఎం. రవీంద్రనాథ్ చౌదరి

దర్శకత్వం : విజయబాపినీడు

మ్యూజికల్ హిట్‌గా నిలిచిన ఖైదీ నెం : 786 శతదినోత్సవ వేడుకలు జరుపుకుని చిరంజీవి, విజయబాపినీడు కలయికలో తదుపరి చిత్రానికై ఎదురు చూసేలా చేసిన చిత్రం.

గువ్వా గోరింకతో, అటు అమలాపురం గీతాలు ఎప్పటికీ పాపులర్.

నమ్మకమే విజయ శిఖరాల మీద అగ్రాసనాన్ని 'చిరంజీవి'గారికి అందించింది. విజయం వరించిన ప్రతిసారి వినయం మరింత పెంపొందిందే తప్ప అహాన్ని మాత్రం దరిచేరనీయలేదు.. ప్రతి ఒక్కరు ఏం చెప్పినా వినడం ఆయనలోని సుగుణం, అందులోని మంచిని మాత్రమే గ్రహించి మిగతాది మరచిపోవడం ఇంకా గొప్ప సుగుణం, ఆ గొప్ప సుగుణం ఉంది కాబట్టే ఎవరేం చెప్పినా విని మంచి చెడ్డల్ని బేరీజు వేసుకొని తరువాత తను చెయ్యాలనుకొన్నది చేస్తారే కానీ ఆవేశకావేశాలకులోను కావడం అస్సలుండదు.. "అన్నయ్య" సినిమాలో చిరంజీవిగారు ఒక డైలాగ్ చెప్పారు "చేతిలో స్పానర్‌తో, గుండెలో ఓ పట్టుదలతో, మనసులో ఓ ఆశయంతో చిన్న మెకానిక్ షెడ్‌లో బతుకారంభించిన వాణ్ణి బాబాయ్, మళ్ళీ అక్కడికే వెళతాను" అని... "అథః పాతాళంలోకి జారిపోయినా ఆత్మవిశ్వాసంతో మళ్ళీ ఆరంభించు" అని దానర్థం...



క్రియేటివ్ కమర్షియల్స్

# మరణమృదంగం

విడుదల : 4-8-1988

నిర్మాత : కె.ఎస్. రామారావు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

చిరంజీవి 'సుప్రీం హీరో' నుండి 'మెగాస్టార్'గా ఎదిగిన చిత్రం. మరో యండమూరి నవలా చిత్రం 'మరణ మృదంగం'లో 'జానీ'గా అద్వితీయమైన పాత్ర పోషణతో చిరంజీవి మెప్పిస్తారు.

చిరంజీవి, సుహాసిని, రాధల క్రేజీ కాంబినేషన్‌లో శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న మరణమృదంగంలో కొట్టండి తిట్టండి, గొడవే గొడవమ్మ, సరిగమపదనిసరసనస, కరిగిపోయాను కర్పూరవీణలా వంటి మధురగీతాలున్నాయి.

ఓసారి టీవీ ఇంటర్వ్యూలో "మీరందించే సందేశం ఏమిటని" చిరంజీవిగారిని ప్రశ్నిస్తే "నేను నిరంతర విద్యార్థిని.. సందేశాల్ని విని నా జీవితానికి అన్వయించుకొని ఆచరిస్తున్నవాణ్ణే కానీ, సందేశాలిచ్చే స్థాయికి అపుడే చేరకోలేదని అనుకొంటున్నాను" అన్నారు.

చిరంజీవిగారు ఎప్పుడో నిర్మించిన "రుద్రవీణ" సినిమా దాదాపు టీవీల పుణ్యామా అంటూ ప్రేక్షకులందరికీ చిరపరిచితమైన సినిమా.. అన్నా హజారే లాంటి గొప్ప వ్యక్తి జీవిత కథ ఆదర్శంగా, గ్రామాలే మనకు ప్రాణవాయువులు, అటువంటి గ్రామాల్ని మెుక్కగా ఉన్నప్పుడే రక్షించుకోవాలన్న ఇతివృత్తంతో సంగీత ప్రధానంగా సాగుతుంది, జాతీయ అవార్డు కూడా వచ్చింది 'రుద్రవీణ'కి.. అందులో కథా నాయకుడు ''సూర్యం'' మార్పుకోసం కృషి చేస్తాడు, వివాహం కూడా వదులుకొంటాడు, అతడి ఉదాత్త వ్యక్తిత్వంతో గ్రామాలకు గ్రామాలు ప్రగతిబాటలో పరుగులు



అంజనా ప్రొడక్షన్స్

# త్రినేత్రుడు

విడుదల : 22-9-1988

నిర్మాత : కె. నాగేంద్రబాబు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

1978 సెప్టెంబరు 22తో మొదలుపెట్టి 1988 సెప్టెంబరు 22 నాటికి వంద చిత్రాలు పూర్తి చేసుకున్న చిరంజీవి చిత్రం 'త్రినేత్రుడు'.

ఇదే తేదీకి విడుదల చెయ్యాలనుకుని చేసినా చిరంజీవి శతచిత్రం 'త్రినేత్రుడు'గానే పరిగణించడం జరుగుతోంది. స్వీయ నిర్మాణంలో రెండో చిత్రం 'త్రినేత్రుడు' శతదినోత్సవం జరుపుకుని నాగబాబుని నిర్మాతగా మరోమెట్టు పైకెక్కించాడు. లవ్‌లీలకుముకి, ఓరినాయనో, వంటి మధురగీతాలు త్రినేత్రుడులోనివే.

తీస్తాయి, రాష్ట్రపతి కూడా 'సూర్యం' కోసం ఆ గ్రామంలో అభినందనసభ ఏర్పాటు చేస్తే వస్తాడు.. తెరపై కథగా ఆ సినిమా ఇలా ఉంటుంది.. తెర వెనుక నిజజీవితంలో కూడా సూర్యం పాత్రధారి 'చిరంజీవి' మార్పుకోసం కృషి చేశారు, అదిగో ఆ కృషి ఫలితమే ఈరోజు రక్తదాన, నేత్రదాన మహోద్యమాలుగా ఆంధ్రనాట సేవా కార్యక్రమాలు సామాజిక విప్లవాన్ని సృష్టించాయి, చిరంజీవి ఒక్కరివల్లే ఇది సుసాధ్యమైంది, ప్రపంచ చలనచిత్ర చరిత్రలో మరే నటుడూ ఇటువంటి ప్రజోపయోగ కార్యక్రమాలకై పూర్తిస్థాయిలో ఎందుకని పిలుపునివ్వలేక పోయారని నేను ప్రశ్నించడం లేదు, అలా ప్రశ్నించడం నా అభిమతమూ కాదు, కళాకారుడిగా సామాజిక బాధ్యతను తెలియపరచిన చిరంజీవి, మానవత్వ పరిమళాల్ని వెదజల్లిన చిరంజీవి పుణ్యాలరాశిని మూటగట్టు కొంటున్నాడన్న విషయం మాత్రం వాస్తవం! 42 వేల మంది పేదరోగుల్ని ఉచిత రక్తదానం వల్ల చిరంజీవి బ్లడ్ బ్యాంక్ కాపాడింది, 865 మంది






విడుదల : 11-11-1988

నిర్మాత : కె. కృష్ణమోహనరావు

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

దర్శకేంద్రులు కె. రాఘవేంద్రరావు స్వీయ నిర్మాణ సంస్థలో చిరంజీవి తొలి చిత్రం.

కంటి చూపులేని అంధులకు ఉచితంగా నేత్రదానం చేసింది చిరంజీవి ఐ బ్యాంక్ (2004 జూన్ నాటికి) అభిమానులంటే కటౌట్‌లకు పూలదండలు వేసి పాలాభిషేకాలు చేసేవాళ్ళు, బ్యానర్లు కట్టి బాణా సంచా పేల్చేవాళ్ళు మాత్రమే కాదు రక్త, నేత్రదానాలు చేసే వాళ్ళు కార్గిల్ యుద్ధంలో భారత వీరులు.

అసువులు బాస్తే వారి కుటుంబాలకు ఆర్థిక సహాయం చేసేవాళ్లు, వరదలు, అగ్ని ప్రమాదాలు సంభవిస్తే వెళ్ళి ఆదుకొనేవాళ్ళు, సహాయక చర్యలు చేపట్టేవాళ్ళు, ఎక్కడో గుజరాత్ రాష్ట్రంలో భూకంపం వస్తే వెళ్ళి శిబిరాలు నిర్మించి సదుపాయాలు సమకూర్చి పెట్టేవాళ్ళు, భారత ప్రధానిని కలిసి అరగంటకు పైగా చిరంజీవిగారు చేస్తున్న సేవాకార్యక్రమాలు వివరించడమే కాక భూకంప బాధితుల సహాయార్థం 3 లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చి వచ్చినవాళ్ళు.. వాళ్ళు చిరంజీవిగారి అభిమానులు" అందుకే అన్నాను తెరపైన రుద్రవీణలో సూర్యం పాత్ర ఒక్కటే కాదు, తెరవెనుక సూర్యం పాత్రధారి



గీతా ఆర్ట్స్




విడుదల : 14-1-1989

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

చిరంజీవి కెరీర్‌లో మరో మధురమైన మలుపు 'అత్తకు యముడు అమ్మాయికి మొగుడు', నిర్మాతగా అల్లు అరవింద్ స్థానాన్ని 'గీతా ఆర్ట్స్' స్థాయిని పెంచిన అత్తకు యముడు అమ్మాయికి మొగుడు చిత్రంతో కళాభినేత్రి వాణిశ్రీ తిరిగి చిత్రరంగ ప్రవేశం చేశారు.

కాకినాడలో రజతోత్సవ వేడుకలు జరుపుకున్న 'అత్తకు యముడు అమ్మాయికి మొగుడు' వసూళ్ళలో సరిక్రొత్త చరిత్ర సృష్టించి చిరంజీవి పోషించిన 'రవి' పాత్రకు జనం నీరాజనాలు పట్టేలా చేసింది.

''చిరంజీవి, వాణిశ్రీ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య''లున్న సన్నివేశాలు ప్రేక్షకుల్ని విపరీతంగా ఆకట్టుకుని చిత్ర ఘన విజయానికి దోహదపడ్డాయి.

దిగు దిగు భామా, మెరుపులా, కలలో పెట్టని ముద్దులు, ఓం శాంతీ వంటి మధురగీతాలు ఇందులోనివే.

'చిరంజీవి' కూడా నాయకుడే.. మహానాయకుడు.. ఆ మహానాయకుడి చిరునామా "మానవత్వం". అభిమానుల గురించి చిరంజీవిగారు ఎప్పుడూ ఒకమాట వారితో అంటూంటారు "మీరే నా కళ్ళు.. కాపాడే దేవుళ్ళు" అని!

రుద్రవీణలోనే కాదు 'ఇంద్ర'లో "నెత్తుటి మరకలు కాదు, ఈ సీమలో చిందాల్సింది నీటి చుక్కలు" అని చాటారు, ఠాగూర్‌లో అయితే "ప్రభుత్వంతో పని చేయించుకోవడం మన హక్కు! ఆ హక్కుని లంచంతో కొనకు'' అని పిలుపునిచ్చారు, వినోదమేకాదు తన సినిమాల ద్వారా, తన పాత్రల ద్వారా ప్రజాకోటిని ఎప్పటికప్పుడు చైతన్యపరుస్తున్న చిరంజీవిగారు ఒక సందర్భంలో చెప్పిన మాటలు యధాతథంగా ఇక్కడ వ్రాస్తున్నాను "ప్రతి మనిషి సాటి మనిషిని ప్రేమించడం నేర్చుకోవాలి, మన దగ్గర రెండుంటే, ఒకటిలేని వాడికివ్వాలి, ఇవ్వడంలో ఆనందం పొందు.. 'మనందరం' సమాజంలో భాగమే.. ఈ సమాజాన్ని సంస్కరించడానికి ఎవరో వస్తారని,






విడుదల : 23-3-1989

నిర్మాతలు : టి. సుబ్బరామిరెడ్డి, పి. శశిభూషణ్

దర్శకత్వం : బి. గోపాల్

కళాబంధు టి. సుబ్బరామిరెడ్డి చిరంజీవితో నిర్మించిన ఏకైక చిత్రం 'స్టేట్‌రౌడీ' దర్శకుడిగా బి.గోపాల్‌కి చిరంజీవితో తొలి చిత్రం.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'స్టేట్‌రౌడీ' నైజాంలో సృష్టించిన వసూళ్ళ ప్రభంజనంతో తొలిసారిగా నైజాంలో చిరంజీవి 'స్టామినా'ని అంచనావేయడానికి దోహదపడింది.

చిరంజీవి చిత్రానికిగాను ఉత్తరాదికి చెందిన అగ్రశ్రేణి సంగీత దర్శకుడు 'బప్పీలహరి' తొలిసారి సంగీతం అందించారు.

రాధారాధా, తథిగిణతోం, ఊహల పల్లకిలో, వన్ టూ త్రీ ఫోర్ వంటి విశేషాదరణ పొందిన గీతాలు స్టేట్‌రౌడీలోనివే...

'స్టేట్‌రౌడీ' చిత్రంలో ఒక ప్రత్యేక సన్నివేశంలో 'అర్జునుడి'గా చిరంజీవి కాస్సేపు కనిపించి కనువిందు చేశారు.

ఏదో చేస్తారని ఎదురు చూడడంకంటే, సమాజంలో భాగమైన మనమే ఎందుకా పనిని మొదలు పెట్టకూడదని ఆలోచించాలి, ఆచరించాలి". పరిశ్రమలో ఎవరు విజయాలు సాధించినా భుజం తట్టి ప్రోత్సహించడం, ఎవరిలో ప్రతిభ ఉందని తెలిసినా వారిని దగ్గరకు తీసుకోవడం చిరంజీవిగారి హృదయ నైర్మల్యానికి నిలువెత్తు నిదర్శనం!

ఈ ప్రత్యేక వ్యాసం యొక్క ముఖ్యోద్దేశ్యం అని కాదు గానీ "మనిషి పోతాడు, మాట నిలుస్తుంది ప్రాణం పోతుంది, దానం నిలుస్తుంది." ఈ ప్రపంచాన్ని మార్చు అని ఎదుటివాడ్ని కోరడంకంటే, ఆ మార్పు నీతోనే ఎందుకు ప్రారంభం కాకూడదని ఆలోచించిన చిరంజీవిగారు ఒక ఎత్తైన సింహాసనాన్ని అధిష్టించారు, ఆ సింహాసనం అందరికీ అందనిది, అదేమిటో తెలుసా? "కులం, మతం, జాతి, వర్గం, ప్రాంతం, కుటుంబం, దేశం, ప్రపంచం" వీటన్నిటికంటే అతీతమైనది, అందుకోవాల్సిందీ "మానవత్వం".



శ్రీ కళ్యాణ వేంకటేశ్వర ఫిలింస్

# రుద్రనేత్ర

విడుదల : 16-6-1989

నిర్మాత : సి. హెచ్. వరహాలక్ష్మీ నరసింహరాజు

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

'ఏజెంట్ నేత్ర'గా చిరంజీవి తొలిసారిగా నటించిన 'జేమ్స్‌బాండ్' చిత్రం 'రుద్రనేత్ర', రుద్రనేత్రలోని యాక్షన్ సన్నివేశాలు చాలా బావుంటాయి.

ఎల్ అంటె ఒ అంటె, ఏక్ దో తీన్ సఖీ ప్రియా, అందమివ్వు ఆదివారము, ఖజురహోలో కసి ప్రేమ వంటి మధురగీతాలు 'రుద్రనేత్ర'లోనివే.

చిత్రం చాలాభాగం విదేశాల్లో షూటింగ్ జరుపుకుంది.

మానవత్వమే అన్నిటికన్నా ఎత్తైన సింహాసనం ఆ సింహాసనాధీశుడైన "విజేత" మెగాస్టార్ చిరంజీవి ఒకప్పుడు మధ్య తరగతి మానవుడు.. మరి మధ్య తరగతి మానవుడి మొదలు మెగాస్టార్ చిరంజీవి దాకా సాగిన మహాప్రస్థానంలో చిరంజీవి వెనక ఉన్నది చిరంజీవే.. ఎందుకంటే ఎపుడో ఎవరో ఆయన్నడిగారు మీ గాడ్ ఫాదర్ ఎవరండీ? అని దానికి చిరునవ్వుతో చిరంజీవిగారు సమాధానమిచ్చారు.

"చిరంజీవి గాడ్ ఫాదర్ చింరజీవే" అని.. కాబట్టి చిరంజీవి వెనక చిరంజీవే ఉన్నారు.. ఇక ఆయన అభిమానుల సంగతంటారా? చిరంజీవి గుండెల్లో అభిమానులు, అభిమానుల గుండెల్లో చిరంజీవి ఎప్పటికీ ఉంటారు!!!

**GOD I LOVE YOU**
**AND I NEED YOU**
**COME INTO MY HEART NOW**



విజయమాధవి పిక్చర్స్

## లంకేశ్వరుడు

విడుదల : 27-10-1989

నిర్మాతలు : వడ్డే శోభనాద్రి, వడ్డే రమేష్

దర్శకత్వం : డా॥ దాసరి నారాయణరావు

దర్శకరత్న డా॥ దాసరి నారాయణరావు, చిరంజీవి కలయికలో ఏకైక చిత్రమైన 'లంకేశ్వరుడు' దర్శకుడిగా దాసరికి 100వ చిత్రం.

లంకేశ్వరుడు చిత్రంలో చిరంజీవి పాత్ర పేరు 'శివశంకర్'.

పదహారేళ్ళవయసు, జివ్వుమని కొండగాలి వంటి మధురగీతాలు 'లంకేశ్వరుడు' లోనివే.

### విద్యాభ్యాసం

నిడదవోలు శివుడిగుడిలో అ,ఆలు దిద్దాక వెంకట్రావుగారి ట్రాన్స్‌ఫర్‌తో నిడదవోలు నుండీ గురజాలకు వెళ్ళింది కొణిదెల కుటుంబం...

గురజాలలో మళ్ళీ అ ఆలు దిద్దిన 'బాల చిరంజీవి' గురజాల నుంచి మంగళగిరి, మంగళగిరి నుండీ పొన్నూరు వచ్చారు. మధ్యలో ఒక్కసారి మాత్రం మొగల్తూరు వచ్చి 7వ తరగతి అక్కడే చదివాడు బాల చిరంజీవి. తొమ్మిదో తరగతీ అంతా పొన్నూరులోనే! తిరిగి పదో తరగతికి మొగల్తూరు వచ్చి చదివాడు.




విడుదల : 9-3-1990

నిర్మాత : టి. త్రివిక్రమరావు

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

'రాబిన్‌హుడ్' తరహా పాత్రను చిరంజీవి అలవోకగా పోషించి తెలుగు ప్రేక్షకులను మెప్పించిన 'కొండవీటి దొంగ' శతదినోత్సవ వేడుకలను జరుపుకున్నాడు.

జీవితమే ఒక ఆట, శుభలేఖ రాసుకున్న, ఛమక్ ఛమక్ ఛా, నమోశ్రీ ఆంజనేయం, కోలోకోలో యంటూ వంటి విశేషాదరణ పొందిన మధురగీతాలున్న 'కొండవీటి దొంగ' చిత్రంలోని సరికొత్త స్టెప్పులతో చిరంజీవి ఒక కొత్త ఒరవడికి నాంది పలికారు.

'కొండవీటిదొంగ' చిత్ర ప్రారంభోత్సవానికి విచ్చేసి క్లాప్ కొట్టింది అప్పటి తమిళనాడు 'మాజీ ముఖ్యమంత్రి' కీ॥శే॥ ఎం.జి. రామచంద్రన్.

## రంగస్థలంపై రంజింపజేసిన 'చిరంజీవి'

10వ తరగతి చదువుతూ 'పెనుమత్స రంగరాయ జిల్లా పరిషత్ హైస్కూల్‌లో బాల చిరంజీవి స్నేహితుడు వ్రాసిన "పరంధామయ్య పంతులు" నాటకం టైటిల్ రోల్ ధరించి బెస్ట్ యాక్టర్ బహుమతి ఫస్ట్‌టైమ్ అందుకొని భవిష్యత్తుని అంచనా వేసేశాడు బాలచిరంజీవి ఆనాడే!

బాల్యంలో 'చిరంజీవి' నాగబాబుతో కలిసి నెల్లూరు రంగమహల్‌లో 'రాము' సినిమా ఫస్ట్‌షోకి ఇంట్లో తెలియకుండా వెళ్ళి ఆ జనం మధ్య టిక్కెట్లు కోసం నిలబడి అస్తవ్యస్తంగా తయారై ఉక్కిరి బిక్కిరౌతున్న సంఘటన అప్పుడే మ్యాట్నీ చూసి వస్తున్న తల్లిదండ్రుల కంటబడ్డం వెంకట్రావుగారు ఇద్దర్నీ ఇంటికి తీసుకువెళ్ళి 'కోటింగ్' ఇవ్వడం వంటి అంశాలు 'చిరంజీవి'ని పెద్దలకు చెప్పకుండా ఏ పనీ చెయ్యరాదన్న పాఠాన్ని నేర్పాయి. ఒకసారి నాగ బాబుతో కలిసి తెగ అల్లరి చేస్తుంటే వెంకట్రావుగారు ఇద్దర్నీ తీసుకువెళ్ళి హోటల్‌లో కప్పులు తీయించడం చేశారు... దాంతో 'చిరంజీవి'కి తనేమిటని ఆలో చించుకొనే అవకాశం కల్గింది. ఒకసారి చిరంజీవి ఇంట్లో తన ఈడు కుర్రాడే దొంగతనం చేయడానికి



వైజయంతి మూవీస్

# జగదేకవీరుడు అతిలోకసుందరి

విడుదల : 9-5-1990

నిర్మాత : సి. అశ్వనీదత్ దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

చిరంజీవి, శ్రీదేవి కలయికలో అతి పెద్ద ఘనవిజయంగా నమోదు కాబడి తెలుగు సినిమా చరిత్రలో ఒక బంగారుపుటగా నిలిచిన కమనీయ దృశ్య కావ్యం.

కె. రాఘవేంద్రరావు దర్శకత్వ ప్రతిభ, సి. అశ్వనీదత్ నిర్మాణ విలువలు, ఇళయరాజా సంగీతం, వేటూరి గీతరచన, జంధ్యాల సంభాషణలు, విన్సెంట్, అజయ్ విన్సెంట్, కె.ఎస్. ప్రకాష్‌ల ఛాయాగ్రహణం ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయా అన్పించేంత సాంకేతిక ప్రతిభ పుష్కలంగా ఉన్న 'జగదేకవీరుడు అతిలోకసుందరి' కథలో ప్రాధాన్యమున్న 'పౌర్ణమి' రోజున విడుదల చేయడం జరిగింది, ఆ సమయంలో ఆంధ్రా అంతటా తుఫాను, ఆ తాకిడిని తట్టుకుని నిలబడి విజయపతాక సగర్వంగా ఎగురవేసిన 'రాజు'గా జగదేకవీరుడు అతిలోకసుందరిలో తన పాత్రకు పరిపూర్ణ న్యాయం చేయడమేగాక తన ఇష్టదైవమైన శ్రీ ఆంజనేయస్వామి గెటప్‌లో కాస్సేపు ఒక ఫైట్ సన్నివేశంలో కనువిందు చేశారు 'చిరంజీవి', హైదరాబాదులోని లాల్ బహదూర్ స్టేడియంలో శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న ఈ చిత్రం రజతోత్సవ చిత్రంగా నిలిచింది.

ఉత్తమ సంగీత దర్శకుడిగా ఇళయరాజా, ఉత్తమ కొరియోగ్రాఫర్‌గా సుందరం, ఉత్తమ శబ్ద గ్రాహకుడిగా ఎ.ఆర్. స్వామినాథన్, ఉత్తమ కళాదర్శకుడిగా బి.చలం, ఉత్తమ కాస్ట్యూమర్‌గా ఎం. కృష్ణ రాష్ట్ర ప్రభుత్వం నంది అవార్డుల్ని పొందారు.

వచ్చి దొరికిపోవడం, అతడ్ని గుంజకి కట్టేసి వెంకట్రావుగారు స్టేషన్‌కివెళ్ళి కానిస్టేబుల్‌ని పంపిస్తానని వెళ్ళారు. చిరంజీవి తల్లి అంజనాదేవి గారు ఆ కుర్రాడ్ని విడిపించి అన్నం పెట్టి బుద్ధిగా వుండాలని హితవు చెప్పి పంపడం చిరంజీవి మనసులో బాగా ముద్రించుకుపోయింది. క్షమాభిక్షను అలవరచుకొంది అప్పుడే!

చిన్నతనంలో చిరంజీవి అభిరుచి స్టాంప్ కలెక్షన్! ఎన్నో మంచి స్టాంపుల్ని సేకరించి ఆల్బమ్ తయారు చేసి గంటలకొద్దీ ఆ ఆల్బమ్‌ను చూస్తూ మురిసిపోయేవాడు చిరంజీవి. అయితే తన దగ్గర లేని ఒక రేర్‌స్టాంప్ తన ఫ్రెండ్ దగ్గరుండడం, ఎన్నిసార్లడిగినా వాడివ్వకపోవడంతో ఒకరోజు వాడింటికి వెళ్ళి వాడి ఆల్బమ్ చూస్తున్నట్టే చూస్తూ ఆ రేర్ స్టాంప్ దొంగతనం చేశాడు చిరంజీవి! ఓ నాల్రోజుల తర్వాత తన స్టాంప్స్ ఆల్బమ్‌లో ముఖ్యమైన 25 స్టాంప్‌లు కన్పించలేదు, అప్పుడు గిల్టీగా భావించి దుఃఖంతో "వాళ్ళవి ఒకటి దొంగలిస్తే మనవి ఇన్నిపోయాయే" అన్న పాఠం నేర్చుకొని వెళ్ళి విషయం చెప్పి ఇవ్వబోతే "నేను కూడా నీ స్టాంపులు దొంగతనం చేశానురా" అంటూ కంగారుగా ఆ ఫ్రెండ్ చిరంజీవి స్టాంపుల్ని తిరిగి ఇచ్చేశాడు.




విడుదల : 9-8-1990

నిర్మాత : కైకాల నాగేశ్వరరావు

దర్శకత్వం : కె. మురళీమోహనరావు

పూర్తి స్థాయి హాలీవుడ్ తరహా కౌబాయ్ చిత్రంగా మలచిన 'కొదమసింహం'లో భరత్‌గా చిరంజీవి విజృంభించారు. హాలీవుడ్ నటుల స్థాయిలో చిరంజీవి నటన ఆకట్టుకుంటుంది. నవరస నటనా సార్వభౌమ కైకాల సత్యనారాయణ సమర్పణలో నిర్మించబడిన కొదమసింహం చెన్నైలో శతదినోత్సవ వేడుకలు జరుపుకుంది.

స్టార్ స్టార్ మెగాస్టార్ స్టార్, గుమ్ గుమాయించుకొంచెం, పిల్లో జాబిల్లో, అల్లాటప్పా గోంగూరమ్మో, చక్కిలిగింతలరాగం వంటి మధురగీతాలు కొదమసింహంలోనివే. నిర్మాణ విలువలకు, రాజీపడని నిర్మాణ దక్షతకు నిదర్శనంలా నిలిచింది 'కొదమసింహం'.

చిన్నతనంలో చిరంజీవికి ఒక కొయ్య గుఱ్ఱం వుండేది. దాని మీదే ఆడుతూంటే వాళ్ళమ్మ అక్కడే భోజనం చేయనిచ్చేది చిరంజీవిని! మొన్న విదేశాల నుండీ తిరిగి వచ్చాక చిరంజీవి తల్లిగారు చిరంజీవికి ఒక క్రిస్టల్స్ పొదిగిన చేతిలో ఇమిడిపోయే గుఱ్ఱం బొమ్మను ఇచ్చారట. దాన్ని చూసి బాల్యపు రోజుల్లోకి వెళ్ళిన చిరంజీవి కళ్ళల్లో తడి. చిరంజీవి ఒకటవ తరగతిలో వుండగా వాళ్ళ మాస్టారు పరీక్ష పేపర్లు దిద్ది క్లాసుకు వచ్చీ రాగానే చిరంజీవిని పిలిచి "ఇదిగోరా నీకు ఫస్ట్ మార్క్ వచ్చింది, మీ అమ్మా నాన్నలకి చూపించుకో" అని పేపర్ చేతికి ఇవ్వడం ఎంతో ఆనందంతో చిరంజీవి పడుతూ లేస్తూ ఇంటికి పరుగులెత్తి తండ్రి మెచ్చుకొంటాడనుకొని పేపరు తండ్రికిస్తే "వెధవా! కష్టపడి చదివిస్తే ఇదా నువ్వు చేసే నిర్వాకం" అని తిట్టడంతో బిక్కమొహం వేశాట్ట చిరంజీవి. అమ్మ వచ్చి పేపర్లో మార్కులు చూసి "ఇదేంటి! చదివిస్తే వున్న మతి పోయిందట. వీడిలా తయారయ్యాడేమిటి?" అంటూ ఆవిడ తిట్టడం మొదలుపెట్టారట, ఇంతకీ ఫస్ట్‌మార్క్ అంటే చిరంజీవికి వచ్చినది "1" మార్కు అన్నమాట. "నంబర్ ఒన్" అనేది చాలా పెద్దదని భావించిన చిరంజీవి అమ్మానాన్న తిట్ల ద్వారా ఫస్ట్ కాదని తెల్సుకొన్నార్ట...



గీతా ఆర్ట్స్

# ప్రతిబంధ్

విడుదల : 28-9-1990

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

ఉత్తర భారతదేశానికి తెలుగువాడి ప్రతిభాసామర్థ్యాలను తెలియజేసిన హిందీ చిత్రం 'ప్రతిబంధ్'.

ప్రతిబంధ్ హిందీలో చిరంజీవి నటించిన తొలిచిత్రం కాగా 'సిద్ధాంత్'గా అభినయానికి ప్రాధాన్యమిస్తూ చిరంజీవి నటించిన తీరు ఉత్తర భారతదేశాన్ని అమితంగా ఆకట్టుకుని ఆ ఏటి మేటి నాలుగు హిందీ ఘన విజయ చిత్రాల సరసన నిలబడేలా చేసింది.

'ప్రతిబంధ్'లో చిరంజీవి నటనను విశ్లేషిస్తూ జాతీయ పత్రికలు ప్రత్యేక కథనాలు సైతం వెలువరించాయి.

నిర్మాతగా అల్లు అరవింద్‌ని జాతీయ స్థాయిలో నిలబెట్టిన చిత్రమిది.

అయితే చలనచిత్ర చరిత్రలో ఆయన స్థానం ఎప్పుడూ ఫస్ట్ మార్క్‌నే కాయిన్ చేసింది. నటుడిగా, వ్యక్తిగా ఆయన్ని నంబర్ ఒన్‌గానే భావిస్తోంది. నాగబాబుతో బాక్సింగ్ చెయ్యడం, బాణాలు వెయ్యడం, అమ్మానాన్నలకి తెలియకుండా కుస్తీ పట్టడం, చెరువుకి ఈత కొట్టడానికి వెళ్ళడం చిరంజీవి చిన్నప్పటి సరదాల్లో ముఖ్యమైనవి. బాల్యంలో చిరంజీవి అతి సన్నిహితంగా ముస్లిమ్‌లతో కలిసి మెలిసి తిరిగేవారు... నాన్నగారి ట్రాన్స్‌ఫర్ల రీత్యా ప్రతి వూళ్ళోనూ చిరంజీవి వాళ్ళ కుటుంబం ముస్లిం ఏరియాలోనే ఇల్లు తీసుకునే వాళ్ళు. దాంతో చిరంజీవి, నాగబాబు కలిసి నమాజ్ చెయ్యడం, రంజాన్ వంటి పండుగలకు ముస్లింలతో కలిసి బిర్యానీ, సేమ్యా పాయసం వంటివి వండడం చేసేవాళ్ళు. చిరంజీవికి ముస్లింల మీదున్న ఆప్యాయతానురాగాలు "ముఠామేస్త్రి" చిత్రంలో ప్రస్ఫుటంగా తెలుస్తాయి.. ఆయనకున్న అసంఖ్యాకులైన అభిమానుల్లో ముస్లింలు ఎక్కువ భాగం... చిరంజీవి చిన్నతనంలో తొలిసారి చూసిన సినిమా హీరో కృష్ణంరాజు. మొగల్తూరులో వున్నప్పుడు స్నేహితుల్తో కలిసి వెళ్ళి కృష్ణంరాజుని చూశారు చిరంజీవి. వీళ్ళని చూసి చిరునవ్వు నవ్విన




విడుదల : 14-11-1990

నిర్మాత : పి. అమరనాథరెడ్డి

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

ఎడ్డీమర్ఫీ నటించిన హాలీవుడ్ చిత్రం స్ఫూర్తితో నిర్మించబడిన 'రాజావిక్రమార్క' వినోదభరిత చిత్రం, సంగీతానికి ఎంతో అవకాశమున్న చిత్రంగా 'రాజ్ కోటి' సంగీత దర్శకత్వం వహించిన 100వ చిత్రంగా నిలిచిన రాజావిక్రమార్క్‌లో మరోమారు చిరంజీవి తన నాట్యవిన్యాసాలతో అలరించారు. కొరియోగ్రాఫర్‌గా 'ప్రభుదేవా' పరిచయమైన చిత్రం 'రాజా విక్రమార్క'.

కృష్ణంరాజుని హీరోలాగే భావించారు చిరంజీవి... అయితే చిరంజీవి ఎప్పుడూ ఎవర్నీ వేలం వెర్రిగా అభిమానించలేదు. అందరి సినిమాలు చూసేవారు. అయితే "బాలరాజు కథ"లో మాస్టర్ ప్రభాకర్, "బడిపంతులు'లో బేబి శ్రీదేవి, చాలా సినిమాల్లో ప్రముఖంగా కనిపించే బాలనటుడు మాస్టర్ విశ్వేశ్వరరావులంటే చిరంజీవికి చాలా చాలా ఫాంటసీ. వాళ్ళలాగా తనూ సినిమా నటుడ్ని కావాలని చిరంజీవి భావించారు. వేసవి శెలవుల్లో హైదరాబాద్ వెళ్ళినప్పుడు రామకృష్ణ 70 ఎమ్.ఎమ్. థియేటర్‌లోకి వెళ్తున్న ఎన్.టి.ఆర్, ఏ.ఎన్.ఆర్. జమునలను చూశారట చిరంజీవి. కలలోనైనా వారితో కలసి నటిస్తానని ఆనాడు చిరంజీవి అనుకోకపోయినా జరిగేది మాత్రం జరగక మానదు కదా!

చిన్నతనంలో ఓసారి గాలికి కట్టెలపొయ్యి మండక దాన్ని వెలిగించడానికి నానా అవస్థలూ పడుతూ, ఆ పొగధాటికి ఉక్కిరి బిక్కిరై కళ్ళ నీళ్ళ పర్యంతమైన తల్లి అంజనాదేవిని కావలించుకొని చిరంజీవి ఏడ్చాడట... ఆ బాధలోనే తల్లితో చెప్పారట "నేను పెద్దవాడినయ్యాక నీకిన్ని కష్టాలు పెట్టనులేమ్మా.... నిన్ను చాలా బాగా చూసు



క్రియేటివ్ కమర్షియల్స్




విడుదల : 9-1-1991

నిర్మాత : కె.ఎస్. రామారావు

దర్శకత్వం : యండమూరి వీరేంద్రనాథ్

యండమూరి వీరేంద్రనాథ్ నవల 'స్టూవర్టుపురం పోలీస్ స్టేషన్'లోని కొన్ని పాత్రల ఆధారంగా రూపొందించబడిన ఈ చిత్రంలో పోలీస్ అధికారి 'రాణాప్రతాప్'గా చిరంజీవి పాత్రౌచిత్యనటనని కనబరిచారు.



కొంటాను" అన్నమాట నిలబెట్టుకోవడం కోసం మధ్య తరగతి మానవుడి నుండీ మెగాస్టార్ చిరంజీవిదాకా సాగిన ప్రయాణం ఎంతో స్ఫూర్తి ప్రధానంగా నిలిచింది.

ఇదంతా చిరంజీవిత సాగర ప్రవాహంలో ఒక దశ అయితే ఇంటర్మీడియట్ నుండీ మరొక దశ కొనసాగింది. ఒంగోలు సి.ఆర్. శర్మా కాలేజ్‌లో ఇంటర్మీడియట్ బై.పి.సి. తీసుకొన్న చిరంజీవి కాలేజ్‌కు నిక్కరుతోవెళ్ళి అందమైన టీజింగ్‌కు గురై "ఇది మన మొగల్తూరు కాదు అక్కడెలా వున్నా ఫర్లేదు ఇక్కడ మాత్రం ప్యాంటులూ అవీ వేసుకోవాల్సిందేనని ప్యాంట్లు వేసుకోవడం మొదలుపెట్టారు. అలా తనకిష్టమైన గ్రేకలర్ ప్యాంటు, షర్టు వేసుకొని కాలేజీకి వెళ్ళి ప్రాక్టికల్స్ చేస్తూ కెమికల్ పొరపాటున షర్ట్ మీదపడి రంధ్రాలు పడితే ప్రాక్టికల్స్ మానేసి బాధతో ఇంటికి వెళ్ళి తల్లితో తన మొర వినిపించిన సున్నితమనస్కుడు చిరంజీవి!

ఇంటర్మీడియట్‌లో 'తెలుగు'లో చిరంజీవి పరీక్ష తప్పి బేలగా ఇంటిపట్టున ఉంటే పరీక్షలో ఉత్తీర్ణులైన ఫ్రెండ్స్ అందరూ చిరంజీవి ఇంటికి వచ్చారట! చిరంజీవి మానసిక స్థితిని గ్రహించిన తండ్రి వెంకట్రావుగారు చిరంజీవిని పిలిచి "పరీక్ష పోతే మళ్ళీ రాయొచ్చు. దానికే ఇంత ఇదైపోతే ఎలా



శ్యాంప్రసాద్ ఆర్ట్స్
గ్యాంగ్‌లీడర్

విడుదల : 9-5-1991
నిర్మాత : ఎం. రవీంద్రనాథ్‌చౌదరి దర్శకత్వం : విజయబాపినీడు
చిరంజీవి చేత, చిరంజీవి వలన, చిరంజీవి కొరకు ఆంధ్రదేశాన్ని విశేషంగా ఆకట్టుకున్న ఘనవిజయం 'గ్యాంగ్‌లీడర్'.
'రాజారామ్'గా గ్యాంగ్‌లీడర్ చిత్రంలోని చిరంజీవి హావభావాలు, శరీరభాష, డైలాగ్ మేనరిజమ్స్, డ్యాన్సులు, ఫైట్లు ఒక ప్రభంజనం సృష్టించాయి.
ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాద్, ఏలూరు, విజయవాడ, తిరుపతిలలో ఒకే రోజు శతదినోత్సవ వేడుకలు జరుపుకొన్న 'గ్యాంగ్‌లీడర్' వసూళ్ళలో క్రొత్త చరిత్రకు శ్రీకారం చుట్టి తనకు తానే పోటీ అనే దశను చిరంజీవి చేరుకున్నారు. చిరంజీవికి స్వర్ణకిరీటధారణ జరిగింది గ్యాంగ్‌లీడర్ శతదినోత్సవ వేడుకల్లోనే.
'లోక్‌సింగ్' అద్భుతమైన ఛాయాగ్రహణం, పరుచూరి సోదరుల రచన, విజయబాపినీడు దర్శక నిర్మాణ ప్రతిభ, రావుగోపాల్రావు విలనీ, అల్లు రామలింగయ్య కామిక్ విలనీలతోపాటు 'బప్పీలహరి' స్వరపరిచిన గ్యాంగ్ గ్యాంగ్ బజావో బ్యాంగ్ బ్యాంగ్, టప్పు టప్పు టపోరీ, సన్‌డే అనకురా, వయసు వయసు, వానా వానా వెల్లువాయె వంటి గీతాలు శ్రోతల్ని ఆనంద సాగరంలో ముంచెత్తాయి.
చిరంజీవి కెరీర్‌లో ఖైదీ, పసివాడిప్రాణం, చిత్రాలకొస్తే వాటికి ముందు, వాటి తర్వాత అని ఎలా విశ్లేషిస్తామో అంతలా గ్యాంగ్‌లీడర్‌కు ముందు, గ్యాంగ్‌లీడర్ తర్వాత అనుకునేలా నిలిచిన చిత్రం 'గ్యాంగ్‌లీడర్'.
తమిళంలో డబ్ చేయబడి అక్కడా శతదినోత్సవం జరుపుకున్నదీ చిత్రం.

వెళ్ళి మీ ఫ్రెండ్స్‌తో జాలీగా గడుపు" అంటూ డబ్బిచ్చి ఎంకరేజ్ చేశారట... చిన్నతనంలో కూడా 'చిరంజీవి' ని మందలించడమో, దేహశుద్ధి చేయడమో జరిగాక వెంకట్రావుగారు బయటకు తీసుకువెళ్ళి బట్టలూ, బూట్లూ లాంటివి కొనిపెట్టేవారట... అలా మందలించి ఓదార్చడంతో తండ్రీ బిడ్డల మధ్య మమకారం పెరుగుతుందని చిన్ననాడే చిరంజీవి నేర్చుకొన్నారు.

ఇక చిరంజీవి కాలేజీ రోజులు మలుపు తిరిగింది నరసాపురంలో! నరసాపురంలో బి.కాం. చేయడానికి చిరంజీవి కాలేజీలో చేరడం ఎన్.సి.సి.లో అప్పటికే చిరంజీవి టాప్ ర్యాంకింగ్‌లో వుండడం, నావిలో కేడెట్ కెప్టెన్ కావడం వంటివన్నీ ఈ కాలేజ్ డేస్‌లోనే జరిగాయి. అలాగే లైటు వెలిగింది, రాజీనామావంటి నాటకాలు వేసిందీ ఇక్కడే. 'రాజీనామా' నాటకం వేసేటప్పటికి బి.కాం రెండో సంవత్సరంలో వున్నారు చిరంజీవి. అందులోని "ఛేర్మన్" పాత్రకు బెస్ట్ యాక్టర్ అవార్డు రావడంతో మనం ఎప్పుడు స్టేజ్ ఎక్కినా బెస్ట్‌యాక్టర్ అవార్డు మనకే వస్తోంది, మనలో అద్భుతమైన కళాకారు డున్నాడు. బి.కాం పూర్తికాగానే మద్రాస్‌లో ఏదైన ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో చేరాలని నిర్ణయించేసుకొన్నారు



శ్రీ సాయిరాం ఆర్ట్స్




విడుదల : 18-10-1991

నిర్మాత : డా॥ కె. వెంకటేశ్వరరావు

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

చిరంజీవి 'కళ్యాణ్'గా 'ఆటోజానీ'గా ద్విపాత్రాభినయం చేసి ప్రేక్షకాభిమానుల్ని వినోదసాగరంలో వెల్లు వెత్తించిన చిత్రం 'రౌడీ అల్లుడు'.

హాస్యాభినయానికి తన సాటి ఎవరూ లేరన్పించేలా సాగే 'ఆటోజానీ' పాత్రతో చిరంజీవి పరాకాష్టకు చేరుకున్నారు.

చిరంజీవి తోడల్లుడు డా॥ కె. వెంకటేశ్వరరావు నిర్మించిన 'రౌడీ అల్లుడు' చిత్రాన్ని అల్లు అరవింద్ సమర్పించారు.

'చిలుకా క్షేమమా' ఎప్పటికీ నిలిచిపోయే స్వీట్‌మెలోడీ' అయితే అమలాపురం బుల్లోడా, లవ్‌మీ మై హీరో అభిమానుల్ని విశేషంగా అలరించిన గీతాలు.

'నెల్లూరు'లో రౌడీ అల్లుడు శతదినోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి.

చిరంజీవి. ఈ కాలేజీ రోజుల్లోనే చిరంజీవి 1976వ సం జనవరి 26వ తేదీ రిపబ్లిక్‌డే ఉత్సవాలకు ఎన్.సి.సి. స్టూడెంట్‌గా ఆంధ్రప్రదేశ్ నుండీ "పోతు రాజు పోలేరమ్మల జాతర"ని ప్రదర్శించారు భారత రాజధాని ఢిల్లీలో!!

బి.కాం.లో చిరంజీవిని ఆరాధించిన స్టూడెంట్ "గ్లాడిస్" అని చిరంజీవి ఫ్రెండ్స్ సర్కిల్‌లో అంటూంటారు. నిప్పులాంటి 'గ్లాడిస్'ని కాలేజీ మొత్తం ఆరాధించినా గ్లాడిస్ మాత్రం చిరంజీవితో చనువు పెంచుకోవాలని ఉత్సాహపడేవారట. చిరంజీవి మాత్రం ఆ రోజుల్లో "చంటబ్బాయ్" టైపు... గ్లాడిస్‌గారు రాజమండ్రి కాలేజ్‌లో లెక్చరర్‌గా వున్నార్ట ప్రస్తుతం.

బి.కాం. పూర్తయ్యాక తండ్రితో సినిమాల్లో చేరతానని తన కోర్కెని వెల్లడించి చివాట్లు తిని ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌కి కాకపోయినా ఐ.సి. డబ్ల్యూ.ఎ.ఐ.లో చేరతానని మద్రాస్‌కు బయలుదేరాడు చిరంజీవి. మద్రాస్ రాగానే ఐ.సి.డబ్ల్యూ.ఎ.ఐ. చదువుతున్న మిత్రుడు రఘురామిరెడ్డి రూమ్‌లో దిగారు. ఇదంతా 1977 జనవరిలోనన్నమాట. తండ్రిని సంతృప్తిపరచడానికి కాస్ట్ ఎక్కౌంటెన్సీలో చేరి రాత్రిళ్ళు వెస్ట్రన్ మ్యూజిక్ అండ్ డాన్స్ స్కూల్‌లో చేరి డ్యాన్స్ నేర్చుకోవడం, ఇంకొకరి దగ్గర డైలాగ్ కోచింగ్ ప్రాక్టీస్



దేవి ఫిలిం ప్రొడక్షన్స్

## ఘరానా మొగుడు

విడుదల : 9-4-1992 నిర్మాత : కె. దేవీవరప్రసాద్
దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

'లీడర్ రాజు'గా రంజైన నటనతో చిరంజీవి ప్రేక్షకుల్ని సమ్మోహితుల్ని చేసిన ఘరానామొగుడులో పొగరుబోతు భార్యను దారిలోకి తెచ్చే భర్త పాత్రలో నవరసాభిషేకం చేశారు.

విడుదలైన ప్రతి కేంద్రంలో 'ఘరానా మొగుడు' వీరోచిత విజృంభణ చేసి 'ఔరా చిరు' అన్పించారు, తెలుగు సినిమా 10 కోట్ల రూపాయలు పైబడి షేర్ వసూలు చేయడమన్నది ఘరానా మొగుడుతో మొదలైంది.

మెగాస్టార్‌గా చిరంజీవి స్థాయిని పెంచి, తెలుగు సినిమా ఎకనామిక్స్‌ని బలంగా ప్రభావితం చేసిన 'ఘరానామొగుడు' చిరంజీవి కెరీర్‌లోనే కాక తెలుగు సినిమా చరిత్రలో కూడా ఒక సువర్ణాధ్యాయం.

ఎం.ఎం.కీరవాణి చిరంజీవి చిత్రాల్లో ఘరానామొగుడికి తొలిసారి సంగీతమందించారు.

మలయాళంలో 'హే హీరో' పేరిట అనువదించబడి శతదినోత్సవం జరుపుకోగా చిరంజీవి శతదినోత్సవ వేడుకలకు కేరళ వెళ్ళి అక్కడ ఉపన్యసించిన తీరు కేరళలోని అన్ని రంగాలవారినీ అమితంగా అలరించింది.

బంగారుకోడిపెట్ట, అబ్బ ఇది ఏమి వాన, ఏందిబే ఎట్టాగ, హే పిల్లా గీతాల్ని ఎవరూ మరచిపోలేరు.

చెయ్యడం మొదలుపెట్టాడు. ఈలోపు చిరంజీవి మేనమావైన శ్రీనివాస్‌గారి ద్వారా ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో సీటు కోసం ప్రయత్నాలు ముమ్మరం చేశారు. అలా అలా చిరంజీవి ప్రయత్నాలు ఇంటివరకూ చేరడం, ఇంటి దగ్గర్నుండీ నాన్న వెంకట్రావుగారు తన మిత్రుడు, ఒకప్పటి ప్రముఖ నిర్మాత అయిన శ్రీ ఏకాంబరేశ్వరరావుగారితో కలసివచ్చి 'చిరంజీవి'ని సినిమా ఆలోచనలు మానివేయమని హితవు చెప్పారు. అయితే ఒక్క సంవత్సరం మాత్రం తనని ఆ ప్రయత్నాల్లో కృషి చేసేట్టు, ఆనక సినిమా ఛాన్స్‌లు రాకపోతే తండ్రి చెప్పినట్లు వింటానని మాట ఇచ్చాడు చిరంజీవి. అలా ప్రారంభమైంది చిరంజీవి యాక్టింగ్ కోర్స్. ఆ ఫిలిం ఇన్‌స్టిట్యూట్ పేరు యస్.ఐ.యఫ్.ఎస్.సి. ఫిలిం ఇన్‌స్టిట్యూట్. రజనీకాంత్, నారాయణరావు, సుధాకర్, రాజేంద్రప్రసాద్, హరిప్రసాద్, సువర్ణ, విజయ్‌భాస్కర్ మొదలైనవారంతా ఈ ఇన్‌స్టిట్యూట్ ప్రొడక్ట్స్. చిరంజీవిని గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాల్సిన విషయమేమిటంటే ఇంటర్వ్యూకు హాజరైన చిరంజీవికి ఏ రెకమెండేషన్ లేదు. మొత్తం ఈ ఇన్‌స్టిట్యూట్ 5 బ్యాచ్‌లు నిర్వహించి ఆ తర్వాత ఎత్తివేసింది. మద్రాస్ ఫిల్మ్ ఛాంబర్ బిల్డింగ్స్‌లో




విడుదల : 10-7-1992

నిర్మాత : ఎస్.ఎస్. సిప్పి

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

చిరంజీవి హిందీలో 'గ్యాంగ్‌లీడర్' ఆధారంగా చేసిన 'ఆజ్ కా గూండారాజ్' మంచి విజయాన్ని సాధించి జాతీయ స్థాయిలో చిరంజీవి డ్యాన్సులు పెద్ద టాపిక్ అయ్యాయి.

"ఇండియాలో డ్యాన్స్ అద్భుతంగా చేయగల హీరో చిరంజీవిగారొక్కరే" అంటూ హీరో నాగార్జున సైతం కితాబిచ్చింది 'ఆజ్ కా గూండారాజ్' చిత్రంలో చిరంజీవి డ్యాన్సుల్ని చూసే.

చిరంజీవి ఇంటర్వ్యూ జరిగింది చిరంజీవిది 5వ బ్యాచ్. మొత్తం మగవాళ్ళకి 7 సీట్లు వున్నాయంతే. ఇంటర్వ్యూకి హాజరైతే వీళ్ళని సెలెక్ట్ చేసిన కమిటీలో శ్రీయుతులు పి.పుల్లయ్య, డాక్టర్ దాసరి నారాయణరావు, డి.వి.ఎస్.రాజు, కె. విశ్వనాథ్, ప్రిన్సిపాల్ వై.జి.పి. గార్లు ముఖ్యులు.... 42 మంది హాజరైన ఆనాటి ఇంటర్వ్యూలో డి.వి.యస్.రాజు, పి.పుల్లయ్యగార్లు సాధారణమైన ప్రశ్నలు వేస్తే దాసరిగారు మాత్రం "నీదంటూ సొంతంగా ఏదైనా చేయగలవా?" అని ప్రశ్నించడం "నేను డాన్స్ చేస్తాను" అని చిరంజీవి అనడం ఏదీ చేసి చూపించమని అంటే అక్కడ డ్యాన్స్ చేయడానికి ప్రత్యేకించి ఏర్పాట్ల, టేప్ రికార్డర్ లాంటివేవీలేవు. అయినా సరే నోటితో శబ్దం (మ్యూజిక్) చేస్తూ దానికనుగుణంగా చిరంజీవి స్టెప్స్ వేయడంతో అక్కడున్న అందరూ ఇంప్రెస్ కావడం జరిగింది.

ఆ తర్వాత ప్రకటించిన స్టూడెంట్స్ లిస్ట్‌లో "కె. శివశంకర వరప్రసాద్" అన్న పేరు ద్వితీయ స్థానంలో వుంది... అద్వితీయంగా ముగిసిందా సంఘటన. విజయరాఘవాచారి వీధిలో ఇంటి నెంబరు 11లో సుధాకర్, హరిప్రసాదలతో కలిసి 'చిరంజీవి' వుండేవారు 'ఇన్‌స్టిట్యూట్ ట్రైనింగ్' మొత్తం



పూర్ణోదయ
మూవీ
క్రియేషన్స్

## ఆపద్బాంధవుడు

విడుదల : 9-10-1992

నిర్మాత : ఏడిద నాగేశ్వరరావు  దర్శకత్వం : కె. విశ్వనాథ్

'మాధవ' పాత్ర పోషణతో నటుడిగా తనదైన ప్రగాఢముద్రను ప్రేక్షకులపై వేసి చిరం'జీవించిన' చిత్రం 'ఆపద్బాంధవుడు' ఒక వర్గం ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకుంది.

అమలిన శృంగారానికి, అలౌకిక భావుకత్వానికి అద్దంపట్టిన 'ఆపద్బాంధవుడు' చిత్రంలోని నటనకుగాను చిరంజీవి మరోమారు రాష్ట్ర ప్రభుత్వ బంగారు నంది అవార్డును కైవసం చేసుకున్నారు. శివుడిగా చిత్రంలో అక్కడక్కడా సన్నివేశాల్లో కనిపించడమేగాక పూర్తి స్థాయిలో 'శివతాండవం' చేసి శాస్త్రీయ నృత్యాల్లోనూ తనదే పైచేయిగా నిలిచి గెలిచారు, 'ఔరా అమ్మక చెల్ల' ఎప్పటికీ మధురగీతమే. హాస్య బ్రహ్మ, దర్శక రచయిత 'జంధ్యాల' నటించిన ఏకైక చిత్రం.

స్వయంకృషి తర్వాత చిరంజీవి, ఏడిద నాగేశ్వరరావు, కె. విశ్వనాథ్‌ల కలయికలో మరో ఆణిముత్యం.

'ఒడియప్పా' గీతంలో జోకర్ వేషం వేసి రాజ్‌కపూర్‌ని స్ఫురణకు తెచ్చిన చిరంజీవి చర్చిలోను, ఆసుపత్రిలోను, నది ఒడ్డున అభినయించిన సన్నివేశాలలో కళాకారుడిగా చిరంజీవి తనలోని భావోద్వేగభరిత నటనని తీవ్రతని ప్రదర్శించారు. ఉత్తమకళ, బి.చలం, ఉత్తమ కొరియో భూషణ్. తృతీయ ఉత్తమ చిత్రంగా రాష్ట్ర ప్రభుత్వ 'కాంస్య నంది'ని కైవసం చేసుకుంది.

ఈ ఇంట్లో వుండగానే జరిగింది. ఈ ఇంట్లోనే ఎస్వీరంగారావు, ఎన్టీరామారావు, డైరక్టర్ ఎం. మల్లికార్జునరావులాంటివారు లోగడ వుండేవారు. అలా సెంటిమెంటూ ఈ ఇంటికి వుంది. శిక్షణ ఇంకా కొన్నాళ్ళుందనంగా మిత్రుడు సుధాకర్ పునాదిరాళ్ళు' సినిమాలో చేయడానికి బుక్ అయ్యాడు. ఇదే టైమ్‌లో భారతీరాజాగారి తమిళచిత్రంలో సుధాకర్ వుండడం, డేట్స్ అడ్జస్ట్ కాక 'పునాది రాళ్ళు'లో నటించనని చెప్పడానికి నిర్మాత ఆఫీసుకి చిరంజీవితో సహా వెళ్ళిన సుధాకర్‌తో నిర్మాతలు ఫర్లేదంటూ ఆ పాత్రకి చిరంజీవిని అడగడం, ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్‌ని ఒప్పించి (అప్పటికింకా శిక్షణా కాలం ముగియలేదు) 20 రోజులు ఇన్‌స్టిట్యూట్‌కి లీవు పెట్టి ఇంటికి వచ్చి తల్లి ఆశీస్సులు పొందారు చిరంజీవి.

ఒకరోజు ఇంట్లో మధ్యాహ్నం సినిమాలకోసం ఏ పేరైతే సెలక్టివ్‌గా వుంటుందని తర్జన భర్జనలు జరిగాక ఏదీ ఖరారు కాక నిద్రకుపక్రమించాడు చిరంజీవి. కలలో ఓ అమ్మాయి 'కొణెదల శివశంకరవరప్రసాద్'ని "రా చిరంజీవి!" అంటూ ఒక మండపం దగ్గరకు తోడ్కొని వెళ్ళడం వెంటనే చిరంజీవికి మెలకువ రావడం, తల్లితో జరిగిన విషయం చెబితే "ఇక నీ సినిమా పేరు చిరంజీవి' అంతా దైవ నిర్ణయం. పైగా చిరంజీవి అంటే నీ ఇష్టదైవం ఆంజనేయస్వామి" అనడం నిజంగా దైవ సంకల్పం!



కామాక్షి
దేవీకమల్
కంబైన్స్




విడుదల : 17-1-1993

నిర్మాతలు : కె.సి.శేఖర్‌బాబు, డి. శివప్రసాదరెడ్డి

దర్శకత్వం : ఎ. కోదండరామిరెడ్డి

ఒక కూరగాయల మార్కెట్ 'మేస్త్రి' రాష్ట్రమంత్రిగా ఎదిగే ఆసక్తికరమైన కథాంశంతో రూపొందించబడిన 'ముఠామేస్త్రి'లో 'బోసు'గా ఆద్యంతం విలక్షణమైన నటనతో ఆ పాత్రకు ప్రాణప్రతిష్ట చేశారు చిరంజీవి.

ఘన విజయం సాధించి చెన్నైలో శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'ముఠామేస్త్రి' చిరంజీవి రాజకీయ ప్రవేశ ఊహాగానాలకు బాగా ఊతమిచ్చింది, ఎక్కడ చూసినా చిరంజీవి రాజకీయ ప్రవేశంపై చర్చలు విపరీతంగా 'ముఠామేస్త్రి' సమయంలో జరిగాయి.

'ఈ పేటకు నేనే మేస్త్రిరీ' గీతం ఒక ప్రభంజనం సృష్టించగా అంజనీపుత్రుడా, చిక్ చిక్ చుం, ఎంత ఘాటు ప్రేమయో గీతాలు మధురగీతాలుగా నిలిస్తే ఒక గీతంలో 'బ్యాట్‌మ్యాన్'.

తదితర గెటప్పులతో చిరంజీవి చిన్నారుల్ని బాగా అలరించారు.

చిరంజీవి 'ముఠామేస్త్రి'లో నటనకుగాను నాలుగోసారి 'ఫిల్మ్‌ఫేర్' అవార్డ్ అందుకున్నారు.

## 'భక్తితో క్రమశిక్షణ'

నా లక్ష్యాన్ని సాధించేందుకు అవసరమైన శక్తిని, క్రమశిక్షణను ఆంజనేయస్వామే ఇచ్చారు. బహుశా 1981 నుంచి అనుకొంటాను అయ్యప్ప మాల వేసుకొంటున్నాను. ఈ ఏడాది కూడా వేసుకోవాలి. అయ్యప్ప దీక్ష నాలో క్రమశిక్షణను ఇంకా పెంచుతుంది. ప్రస్తుతం రోజూ ఇంట్లో పూజ చేయడం సాధ్యం కావడం లేదు. అవకాశం దొరికినప్పుడల్లా చేస్తాను. ఇంట్లో వాళ్ళు పూజలు చేస్తుంటే తప్పనిసరిగా పాల్గొంటాను.



గీతా ఆర్ట్స్

# మెకానిక్ అల్లుడు

విడుదల : 27-5-1993

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : బి. గోపాల్

పద్మభూషణ్ డా॥ అక్కినేని నాగేశ్వరరావు, మెగాస్టార్ చిరంజీవి మామా అల్లుళ్ళుగా కలసి నటించిన చిత్రం. శతదినోత్సవం జరుపుకుంది.

ప్రేమిస్తే ప్రాణమిస్తా, గురువా గురువా, చక్క చక్క చెంచక్క, గుంతలకిడి గుండమ్మో వంటి గీతాలు అభిమానుల్ని అలరిస్తే 'ఝుమ్మనే తుమ్మెదవేట' అనే గీతాన్ని భారీ ఎత్తున 'డ్రమ్ డ్యాన్స్'గా చిత్రీకరించడం విశేషం.

## విశ్వ శ్రేయస్సే పరమార్థం

పూజ చేయడం ఓ అద్భుతమైన అనుభూతి. భగవంతుని ఎదుట కళ్ళు మూసుకుని కూర్చుంటే చాలు ఆనందానుభూతి కలుగుతుంది. నాకు అన్నీ ఇచ్చావు, ప్రపంచం కూడా సుఖ శాంతులతో ఉండేలా చూడమని స్వామిని వేడుకుంటూ వుంటాను. నేను పూజ చేస్తూ కళ్ళు మూసుకుంటే స్వామి నా నివేదనను ఆలకించి ప్రపంచానికి అభయ ముద్ర ఇస్తున్న భావం లీలగా నా కళ్ళముందు కదలాడుతూ వుంటుంది. ఇది అతిశయోక్తిగా అనిపించవచ్చు... కానీ ఇది నా ఆత్మానుభూతి. స్వామి దయవల్ల ప్రపంచం సుఖమయంగా వుండాలన్నదే నా ఆకాంక్ష. ప్రపంచం సుఖమయంగా వుండాలని కోరుకొనే వాళ్ళంతా నా దృష్టిలో దేవుళ్ళే... ఆఖరి శ్వాస వరకు ప్రపంచ హితం కోసం పని చేసిన మదర్ థెరిస్సా వంటివారు నా దృష్టిలో దేవుళ్ళే...



అంజనా
ప్రొడక్షన్స్
**ముగ్గురు మొనగాళ్లు**

విడుదల : 7-1-1994

నిర్మాతలు : కె. నాగేంద్రబాబు, కె. కళ్యాణ్‌కుమార్

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

చిరంజీవి త్రిపాత్రాభినయం చేసి "పృధ్వీ, విక్రమ్, నటరాజ రామకృష్ణ దత్తాత్రేయ" పాత్రల ద్వారా వినోదానికి పెద్దపీట వేశారు.

శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న 'ముగ్గురు మొనగాళ్ళు'లో చామంతి పువ్వా, కొట్టోకొట్టు కొబ్బరికాయ, రాజశేఖరా వంటి సుమధుర గీతాలు అలరించాయి.

## శ్వాస మీదే ధ్యాస

క్రమంగా నా మనస్సు ధ్యానమార్గం వైపు మళ్ళుతున్నది. కొంతకాలంగా ధ్యాన సాధన చేస్తున్నాను. ఇంకా అది పట్టు పడలేదు, ఇక ధ్యానమే నా మార్గం అవుతుందేమో. ధ్యానం మనలో ఉన్న, దాగి ఉన్న శక్తిని వెలికి తీస్తుంది. రోజూ ఉదయం ధ్యానం చేస్తే ఆ రోజంతా శారీరకంగా, మానసికంగా కూడా ప్రశాంతంగా ఉంటుంది. ఆ రోజంతా ఆరోగ్యకరమైన నిర్ణయాలు తీసుకొనే వీలుంటుంది. వ్యక్తి వికాసానికి తద్వారా ఆరోగ్యకరమైన సమాజానికి ధ్యానమే సరైన మార్గం.



సాయిచరణ్ కంబైన్స్

## S.P. పరశురామ్

విడుదల : 15-6-1994

నిర్మాతలు : జి.కె. రెడ్డి, ముఖేష్ ఉదేశీ

దర్శకత్వం : రవిరాజా పినిశెట్టి

తమిళ చిత్రం వాల్టర్ వెట్రవేల్ ఆధారంగా నిర్మించిన 'ఎస్.పి. పరశురామ్' చిత్రంలో చిరంజీవి పోలీస్ ఉన్నతాధికారిగా నటించారు.

గీతా ఆర్ట్స్

## ది జెంటిల్‌మెన్

విడుదల : 18-11-1994

నిర్మాతలు : అల్లు అరవింద్, ముఖేష్ ఉదేశీ

దర్శకత్వం : మహేష్‌భట్

ప్రముఖ హిందీ దర్శకుడు మహేష్‌భట్ దర్శకత్వంలో చిరంజీవి నటించిన 'ది జెంటిల్‌మెన్' హిందీలో చిరంజీవి నటించిన మూడవ చిత్రం. ఈ చిత్రం తర్వాత ఏ స్ట్రెయిట్ హిందీ చిత్రంలోనూ చిరంజీవి నటించలేదు.

### యువతకు వికాసం

ధ్యానంపట్ల ప్రస్తుతం యువత కూడా ఎంతో ఆసక్తి చూపుతున్నది. వారిలో దాగివున్న శక్తిని వెలికి తీసుకువచ్చి, లక్ష్య సాధనకు అవసరమైన శక్తి ధ్యానం ద్వారా మాత్రమే లభిస్తుంది. రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న నా అభిమాన సంఘాల సభ్యులకు ధ్యానంలో శిక్షణ ఇప్పించే ప్రతిపాదన వుంది. మా కుటుంబ సభ్యులందరిలోనూ భక్తి భావం వుంది. మొన్న మంగళవారం మా అమ్మాయి ఏదో నోము నోచు కుంటుంటే నేను చూస్తూ కూర్చున్నాను. నిమ్మకాయ బద్దను దొప్పగా చేసి, అందులో నెయ్యితో జ్యోతి వెలిగించి పూజ చేసింది. పసుపు వన్నె నిమ్మ బద్దలో నెయ్యితో వెలుగుతున్న జ్యోతికాంతులు ప్రతి ఫలిస్తున్నాయి. ఆ జ్యోతులను చూసి మనసంతా ఏదో మధురమైన భావంతో నిండిపోయింది. భక్తి భావం మనసులో వుంటే చాలు. అయితే చిన్నతనం నుండీ భక్తి పునాదులు వున్నప్పుడే భగవంతుడ్ని నిజంగా మనసులో నిలుపుకునే బలం వస్తుంది. మనల్ని నడిపించే అతీత శక్తి ఏదో వుందనే విషయం యువత మనసులో వుండాలి. అప్పుడే వారు ధైర్యంగా లక్ష్య సాధన దిశగా కృషి చేస్తారు.



దేవీ ఫిలిం ప్రొడక్షన్స్

## అల్లుడా మజాకా!

విడుదల : 25-2-1995

నిర్మాత : కె. దేవీవరప్రసాద్

దర్శకత్వం : ఇ.వి.వి. సత్యనారాయణ

వసూళ్ళ ప్రభంజనం సృష్టించిన వినోదభరిత చిత్రం 'అల్లుడా మజాకా'లో 'సీతారాముడు'గా చిరంజీవి ఆద్యంతం రక్తి కట్టించారు, పల్లెటూరి సరసాలు, కోపాలు, పగలతో నడిచే 'అల్లుడా మజాకా' శతదినోత్సవ వేడుకలు చెన్నైలోని ఎంజిఆర్ ఫిల్మ్ సిటీలో జరిగాయి. మా వూరి దేవుడు శ్రీరామచంద్రుడు, రెడ్డు రెడ్డు బుగ్గే రెడ్డు, అత్తో అత్తమ్మ కూతురో వంటి గీతాలు విశేషాదరణ పొందాయి.

శ్యాంప్రసాద్ ఆర్ట్స్

## బిగ్ బాస్

విడుదల : 15-6-1995 నిర్మాత : ఎం. రవీంద్రనాథ్ చౌదరి

దర్శకత్వం : విజయబాపినీడు

నంబర్‌వన్ నంబర్‌టూ, మామమామ గీతాలు ఆకట్టుకుంటాయి.

### చిరునవ్వుతో...

చిన్నప్పట్నుంచీ నేను కోరుకున్నవాటి కంటే అన్ని అంశాలన్నింటిలోనూ ఎక్కువే పొందాను. అది ఆ భగవంతుడు ఇచ్చిన వరంగా భావిస్తున్నాను. నా జీవితంలో ఎప్పుడూ ఏ విషయంలోనూ వెలితిగా అనిపించలేదు. కొడుకుగా, సోదరుడిగా, తండ్రిగా, నటుడిగానే కాకుండా మానవతా వాదిగా కూడా విజయం సాధించాననే అనుకొంటున్నాను. వ్యక్తిగత జీవితంలో ఏదైనా లోటు ఫీలయ్యారా అని అడిగితే ఈ ప్రశ్న అడిగేందుకు నేను రైట్ పర్సన్‌ని కాను అని మాత్రం చెప్పగలను."



శ్రీ క్రాంతి చిత్ర

# రిక్షావోడు

విడుదల : 14-12-1995

నిర్మాత : టి. క్రాంతి కుమార్

దర్శకత్వం : కోడి రామకృష్ణ

తండ్రీ కొడుకులుగా చిరంజీవి ద్విపాత్రాభినయం చేసినా తండ్రి కొడుకులు ఏ సన్నివేశంలో కలవకుండా తండ్రి పాత్రను ఫ్లాష్ బ్యాక్‌లోనే చూపించారు. తండ్రి పాత్ర ధర్మారాయుడు, ఆకట్టుకుంటుంది.

రూప్‌తేరామస్తానా, దేవుడైన జీవుడైన రిక్షావోడుర, వంటి గీతాలు అలరిస్తాయి.

'కె. దత్తు' ఛాయాగ్రాహకుడిగా పరిచయమైన చిత్రం.

## చిరంజీవులతో చిరంజీవి

ప్రశ్న : మీరు చిన్నప్పుడు డాక్టర్ కావాలనుకున్నారా? యాక్టర్ కావాలనుకున్నారా?

చిరంజీవి : నేను అమ్మానాన్నలు మెచ్చే మంచి వ్యక్తిని కావాలనుకున్నాను. పెద్దవాణ్ణి అయ్యేకొద్దీ నాకు యాక్టింగ్‌పై ఇంట్రెస్ట్ ఏర్పడింది. దాంతో యాక్టర్‌ను అయ్యాను. మీరు కూడా చిన్నప్పుడు బాగా చదువుకుని, మీకు ఇంట్రెస్ట్ ఉన్న రంగంలో గొప్పవారై తల్లిదండ్రులకు మంచి పేరు తీసుకు రావాలి.

ప్రశ్న : ఐ బ్యాంక్ ఏర్పాటుకు మిమ్మల్ని ఇన్‌స్పైర్ చేసిందెవరు?

చిరంజీవి : మదర్ థెరిస్సా. ఆమె జీవితచరిత్ర చదువుతున్నప్పుడు మనమూ సమాజానికి ఏదో ఒకటి చేయాలని అనిపించింది. ఐ బ్యాంకు ప్రారంభించాను. భగవంతుడు కూడా నాకు సహకరించాడు.



ఎం.ఎల్. మూవీ ఆర్ట్స్



విడుదల : 4-1-1997

నిర్మాతలు : ఎడిటర్ మోహన్, ఎం.వి. లక్ష్మి

దర్శకత్వం : ముత్యాల సుబ్బయ్య

తన పంథాను పూర్తిగా మార్చుకుని మూస చట్రంలోంచి బయటకు వచ్చి 'మాధవరావు'గా ఐదుగురు చెల్లెళ్ళకు అన్నయ్యగా బాధ్యతాయుతమైన పాత్రలో హుందాగా చిరంజీవి నటించిన తీరు, చిత్ర కథా కథన బలాలు థియేటర్ల దగ్గర జాతరలను మరిపించాయంటే అతిశయోక్తి కాదు.

కొంత వ్యవధి తర్వాత చిరంజీవి నటించిన 'హిట్లర్' ఘనవిజయం సాధించి శతదినోత్సవ వేడుకలను 'ఒంగోలు'లో జరుపుకున్నది. 'నడక కలసిన నవరాత్రి' ఇప్పటికీ ఎప్పటికీ మధురగీతమే. 'లారెన్స్' చిరంజీవికి తొలిసారి నృత్య రీతుల్ని సమకూర్చింది 'హిట్లర్' చిత్రానికే.

దర్శకరత్న డా॥దాసరి నారాయణరావు చిరంజీవి తండ్రిగా నటించిన ఏకైక చిత్రం 'హిట్లర్' చిత్రంలోని ('మాస్టర్'తో కలిపి) నటనకుగాను 'చిరంజీవి' ఉత్తమ నటుడిగా స్క్రీన్ వీడియోకాన్ వారి అవార్డునందుకున్నారు.

ప్రశ్న : మీరు చిన్నపిల్లల కోసం ప్రత్యేకంగా సినిమా తీయరా?

చిరంజీవి : శంకర్‌దాదా చిన్న పిల్లల సినిమానే కదా. అందులో ఎంతోమంచి కామెడీ ఉంది. డాన్సలున్నాయి. అంతా పిల్లల కోసమే కదా.

ప్రశ్న : మీకిష్టమైన హీరో ఎవరు?

చిరంజీవి : అమితాబ్ బచ్చన్.

ప్రశ్న : డ్యాన్సులు, ఫైట్‌లు ఎక్కడ నేర్చు కొన్నారు?

చిరంజీవి : సినిమాల్లో...

ప్రశ్న : మంజునాథలో హీరో పాత్రను ఎందుకు వేయలేదు?

చిరంజీవి : ప్రొడ్యూసర్ ఇవ్వలేదమ్మా. శివుడి పాత్రకే సూటవుతానని వారి నమ్మకం.

ప్రశ్న : మీరు మొదటి సినిమాలో నటించి నప్పుడు ఎలా ఫీలయ్యారు?

చిరంజీవి : హుషారుగా ఫీలయ్యాను.

ప్రశ్న : చిన్నప్పుడు మీరు కూడా అల్లరి చేసేవారా?

చిరంజీవి : అస్సలు అల్లరి చేసేవాణ్ణి కాదు.



గీతా ఆర్ట్స్



# మాస్టర్

విడుదల : 3-10-1997

నిర్మాత : అల్లు అరవింద్ దర్శకత్వం : సురేష్‌కృష్ణ

తొలిసారి 'చిరంజీవి' కళాశాలలో పాఠాలు చెప్పే మాస్టర్‌గా వైవిధ్యభరితమైన పాత్ర చిత్రణతో నటుడిగా ఆకాశపు అంచులనుతాకారు. 'రాజ్‌కుమార్' పాత్రద్వారా చిరంజీవి అన్ని వర్గాలవారినీ, మారుతున్న అభిరుచికి అణుగుణంగా యువతనీ విశేషంగా ఆకర్షించి విజయఢంకా మ్రోగించిన 'మాస్టర్' తెలుగు సినీ చరిత్రలో తొలి Dts చిత్రం. 'తమ్ముడు అరెతమ్ముడు' అనే గీతాన్ని తొలిసారి చిరంజీవి స్వయంగా ఆలపించిన 'మాస్టర్'లో ఇంటిలోకి వెల్‌కమ్ అంటు, తిలోత్తమా, బీయస్సీ అయినాగానీ, బాగున్నారా బాగున్నారా గీతాలు మరో లోకంలోకి తీసుకువెళ్తాయి. సంగీత దర్శకుడు దేవా, దర్శకుడు సురేష్‌కృష్ణ, ఛాయాగ్రాహకుడు ఛోటా కె. నాయుడులు చిరంజీవితో కలసి పనిచేసిన తొలి చిత్రం 'మాస్టర్' గీతా ఆర్ట్స్ విలువల్ని, స్థాయిని, అత్యున్నత ప్రమాణాలను తెలియజేసి నిర్మాతగా అల్లు అరవింద్ దక్షతను చాటింది.

విశాఖపట్టణంలో శతదినోత్సవ వేడుకలు జరుపుకున్న మాస్టర్ రజతోత్సవ చిత్రంగా నిలిచింది.

(హిట్లర్ చిత్రంతో కలిపి) 'మాస్టర్' చిత్రంలోని నటనకుగాను చిరంజీవి స్క్రీన్ వీడియోకాన్ అవార్డునందుకున్నారు.

'మాస్టర్' స్క్రీన్‌ప్లేకుగాను 'భూపతిరాజా' నంది అవార్డు పొందారు.

ప్రశ్న : మీకు మదర్ థెరిస్సా ఆదర్శమన్నారు, మరి ఆవిడలాగా సంఘసేవకే పరిమితమవకూడదా?

చిరంజీవి : సంఘసేవ చేయడానికి డబ్బు కావాలి కదా. అది సినిమాలలో నటిస్తే వస్తుంది. అందుకే సినిమాలలో నటిస్తూ సంఘసేవ చేస్తున్నాను.

ప్రశ్న : పై నుంచి కిందకి దూకే సీన్లతో మీరు ఎలా ఫీలవుతుంటారు?

చిరంజీవి : మొదటిసారి భయమేసింది. తర్వాత అలవాటైపోయింది.

ప్రశ్న : మీరు చేసిన మంచి పని ఏమిటి?

చిరంజీవి : నేను చాలామంచి పనులు చేశాను. రోడ్డు మీద డబ్బులు దొరికితే తీసుకెళ్ళి మా అమ్మకిచ్చాను. తను నన్ను ఎంతో మెచ్చుకొని ఆ డబ్బును హుండీలో వేయించింది.

ప్రశ్న : మీరు నటించిన అన్ని సినిమాల్లో మీకు బాగా నచ్చిన సినిమా ఏది?

చిరంజీవి : నాకు అన్ని సినిమాలూ ఇష్టమే. మంచి సినిమా అవుతుందనుకుంటేనే కదా చేస్తాం.



అంజనా ప్రొడక్షన్స్

# బావగారూ.. బాగున్నారా!

విడుదల : 9-4-1998

నిర్మాత : కె. నాగేంద్రబాబు

దర్శకత్వం : జయంత్ సి. పరాన్జీ

'నాగబాబు' కథను కూడా అందించి నిర్మించిన 'బావగారూ బాగున్నారా' చిత్రంలోని 'రాజు' పాత్ర చిరంజీవికి కొట్టిన పిండే అయినా పాత్రధారుల మధ్య తాను చిన్నవాడైపోతూ 'ఇమేజ్'కు లోబడకుండా చిరంజీవి చేసిన ప్రయోగం ఫలించి 'బావగారూ బాగున్నారా'ను ఘనవిజయాల సరసన నిలబెట్టింది.

సాహసోపేతమైన బంగీజంప్ ద్వారా చిరంజీవి మరోమారు తనకుసాటి తానేనని నిరూపించారు.

సంగీత దర్శకుడిగా 'మణిశర్మ' పరిచయమైంది 'బావగారూ బాగున్నారా'తోనే.

ఆంటీ కూతురా అమ్మో అప్సరా, సారీ సారీ సారీ, మత్తెక్కి తూగేమనసా, నవమి దశమి, చల్నేదోగాడీ గీతాలు కుర్రకారుని ఒక ఊపు ఊపాయి.

'బావగారూ బాగున్నారా' శతదినోత్సవ వేడుకలు హైదరాబాద్‌లోని లలిత కళాతోరణంలో జరిగాయి.

## "చిరునవ్వు"

అద్దంలో తన ఇమేజీ
ఇమడనంత ఇమేజీ
ఉన్నవాడు చిరంజీవి
అతనికి పాండీ బజారు
తురాయి చెట్ల నీడ తెలుసు
మౌంట్ రోడ్డు ఎండ తెలుసు
శాంతాభవన్ సాంబారు స్మెల్లూ
పూర్ణ కిళ్ళీ కొట్టు పుదీనా పరిమళం
శివశంకర వరప్రసాద్‌కి తెలుసు!!
చాలామంది నటులు
మెరీనాలో నీళ్ళాదిలేస్తే
ఇతను మాత్రం ఫుల్‌స్టాప్ పెట్టకుండా
కామాలు పెట్టుకుంటూ పోయాడు!!

అవకాశాల గుర్రం సర్రున పక్కనించి దూసుకుపోతుంటే తాళ్ళు పట్టుకున్నాడు. కంఠం పట్టుకున్నాడు, చివరికి జూలు పట్టుకునీ పైకెక్కేశాడు, ఇప్పుడప్పుడే దిగడు శరీరాన్ని గొడ్డుని చేసి చాకిరీ చేయించాడు మెదడుని తెడ్డుని చేసి వి'చిత్ర' సాగరాన్ని దాటించాడు.

విలనయ్యాడు! కమెడియనయ్యాడు!! హీరో అయ్యాడు!, స్టార్ అయ్యాడు!! ప్రతీ ఇంట్లోనూ మెంబరయ్యాడు, సింగిల్ నంబరయ్యాడు!

పిల్లలకి అన్నయ్య, కన్నెలకి కన్నయ్య కుర్రాళ్ళకి ఫ్రెండూ, ఫైనల్‌గా ఓ లెజండూ... గడపదాటని బామ్మ దగ్గర్నించీ కడుపులో పుట్టబోయే బిడ్డ వరకూ చిరూయే - హీరో...

- తనికెళ్ళ భరణి



వైజయంతీ మూవీస్

## చూడాలని వుంది!

విడుదల : 27-8-1998

నిర్మాత : సి. అశ్వనీదత్ దర్శకత్వం : గుణశేఖర్

'రామకృష్ణ'గా చిరంజీవి పాత్రౌచిత్య నటన, కలకత్తా నేపథ్యం, ఛోటా కె. నాయుడు ఛాయాగ్రహణం, పద్మశ్రీ తోట తరణి కళా దర్శకత్వ పటిమ, గుణశేఖర్ దర్శకత్వ ప్రతిభ, యమహానగరి, ఓమారియ, రామ్మ చిలకమ్మ వంటి గీతాలతో తేనెలొలికిన మణిశర్మ సంగీతం, అశ్వనీదత్ నిర్మాణ విలువలు 'చూడాలని వుంది' చిత్రాన్ని మరో దృశ్యకావ్యంగా నిలిపాయి. ఘనాతిఘన విజయం సాధించిన 'చూడాలని వుంది' శతదినోత్సవ వేడుకలు కర్నూలులో వైభవంగా జరిగాయి.

అప్పటికే చిరంజీవితో రెండు చిత్రాలు ఒకదాని తర్వాత ఒకటి మొదలుపెట్టి అర్థాంతరంగా ఆపివేసి తర్వాత చేసిన ప్రయత్నమే 'చూడాలని వుంది', ఆ తొలి రెండు చిత్రాల కోసం చిత్రీకరించిన రెండు పాటలు ఒకటి చిరంజీవి, టబు, మరోటి చిరంజీవి ఊర్మిళ అభినయించినవి చూడాలని వుంది విడుదలైన కొద్ది వారాలకు చిత్రంలో ప్రత్యేకంగా చొప్పించి 'బోనస్'గా ప్రేక్షకులకు అందించి ఆనందింపజేశారు.

ఉత్తమ సంగీత దర్శకుడిగా మణిశర్మ, ఉత్తమ శబ్ద గ్రాహకుడిగా మణిశర్మ, ఉత్తమ కొరియోగ్రాఫర్‌గా సరోజ్‌ఖాన్ రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డుల్ని పొందారు.



### చిరంజీవి కుటుంబం

చిరంజీవితో పాటు ఆయన తమ్ముడు నాగబాబు, పవన్ కళ్యాణ్ వరుసకు అల్లుడైన అల్లు అర్జున్ సినీ నటులే. ఇటీవలే మృతి చెందిన సుప్రసిద్ధ హాస్య నటుడు అల్లు రామలింగయ్య చిరంజీవి సొంత మామే. ఇక అల్లు కుమారుడు చిరంజీవి బావమరిది అల్లు అరవింద్ సుప్రసిద్ధ సినీ నిర్మాత. ఇక ప్రస్తుతం బి.కాం చదువుతున్న చిరంజీవి ఏకైక కుమారుడు రామ్ చరణ్ తేజ మరి కొద్ది కాలంలోనే హీరోగా చిత్రరంగ ప్రవేశం చేయనున్నారు. చిరంజీవి రెండున్నర దశాబ్దాలుగా తెలుగు సినిమా రంగంలో అగ్రకథానాయకుడి స్థానంలో స్థిరంగా నిలుస్తూ తన పేరును సార్థకం చేసుకుంటున్నారు. ఎదురు దెబ్బలకు తొణకకుండా అరుదైన ఈ కళాకారుడు తారాపథానికి ఎదిగాడు. దేశం మొత్తం ప్రదర్శితమవుతూ జాతీయ మార్కెట్‌ను కలిగి ఉండే హిందీ సినిమాలకంటే అధికంగా వసూళ్ళు సాధించడం తెలుగు చిత్ర రంగంలో చిరంజీవి సినిమాలతోనే ప్రారంభమైంది. వయసు మళ్లిన ముఖానికి నప్పని మేకప్, అసహజ మైన హావభావాలతో సాగుతుండిన తెలుగు




శ్రీ సూర్యా మూవీస్ స్నేహం కోసం

విడుదల : 1-1-1999

నిర్మాత : ఎ.ఎం. రత్నం

దర్శకత్వం : కె.ఎస్. రవికుమార్

తమిళ చిత్రం 'నట్పుకాగ' ఆధారంగా రూపొందించబడిన 'స్నేహం కోసం'లో సింహాద్రిగా, చిన్నయ్యగా చిరంజీవి తండ్రీ కొడుకుల పాత్రల్ని పోషించి మైమరపించారు.

కె.దత్తు ఛాయాగ్రహణం, కె.ఎస్. రవికుమార్ దర్శకత్వ వేగం, ఎస్.ఏ. రాజ్‌కుమార్ సంగీతం, ఎ.ఎం. రత్నం రాజీపడని నిర్మాణ వైఖరి 'తొందరగా' చిత్రాన్ని ప్రేక్షకుల ముందుకు తీసుకువచ్చి ఘన విజయాల సరసన చేరి చెన్నైలో శతదినోత్సవ వేడుకల్ని జరుపుకున్న 'స్నేహం కోసం'లోని చిరంజీవి నటనకుగాను ఐదవసారి ఉత్తమ నటుడిగా ఫిలింఫేర్ అవార్డును అందుకున్నారు.

కైకలూరి కన్నె పిల్ల, మీసమున్న నేస్తమా మధుర గీతాలుగా నిలిచిపోయాయి.

సినిమాను, సహజత్వానికి దగ్గరలో కనిపించే వేష భాషలతో ఇంటిల్లి పాదినీ ఆకర్షించి, ఆనందింప జేయగల దిశకు మళ్ళించారు.

సామాజిక వర్గాలు, ప్రాంతాలు, బంధుత్వాలు బలమైన అదృశ్యశక్తులుగా పనిచేసి ఇతరులను చిత్రపరిశ్రమ ఛాయల్లోనే లేకుండా తరిమివేసే టాలీవుడ్‌లో మేరునగధీరుడిగా నిలవడమే కాకుండా తన కుటుంబం తెలుగు చిత్రరంగంలో ప్రధానమైన శక్తిగా రూపొందేందుకు దోహదపడ్డారు. ఈ విజేత వెనుక మొక్కవోని ఆత్మవిశ్వాసం ఉంది. తనను తాను మరచి తన ముందున్న పనిలో నిమగ్నమయ్యే దీక్ష ఉంది. అన్నింటినీ మించి కొత్త అంశాల్ని జాగ్రత్తగా గమనించి నేర్పుగా అలవరుచుకొనే నైపుణ్యం ఉంది. తన తొలిసినిమా పునాది రాళ్ళు కోసం ఇరవైఐదున్నర సంవత్సరాల క్రితం మొదటి డైలాగ్ పలికిన నాటి నుండి తన తాజా చిత్రంలో వైవిధ్యం చూపించేందుకు ప్రత్యేక జాగ్రత్తలు తీసుకోవడం వరకు తన చిత్రాలకు సంబంధించి చిరంజీవి అపారమైన శ్రద్ధాసక్తులు ప్రదర్శిస్తూ వస్తున్నారు.



ఆర్కే ఫిల్మ్ అసోసియేట్స్

## ఇద్దరు మిత్రులు

విడుదల : 30-4-1999

దర్శక నిర్మాత : కె. రాఘవేంద్రరావు

'విజయ్'గా మంచి స్నేహితుడి పాత్రలో చక్కటి నటనని ప్రదర్శించిన చిరంజీవి 'ఇద్దరు మిత్రులు' హైదరాబాద్‌లో శతదినోత్సవ వేడుకల్ని జరుపుకుంది.

'మనసావాచా మనసిస్తే' మధురగీతంలా నిలిచిపోయింది.

సాధారణంగా సినీ కథానాయకులు తమ పాత్రగురించి మాత్రమే ఆలోచించే రోజుల్లోనే చిరంజీవి కథ, కథనం, పాటలు, పోరాటాలు, సంగీతం వంటి అన్ని హంగులను దగ్గరుండి ఎంపిక చేసుకొని ప్రతి సినిమాను ఒక యజ్ఞంలా నిర్వహించడం ప్రారంభించారు. దీంతో తాను నటించిన సినిమా విజయావకాశాలను గణనీయంగా ప్రభావితం చేయగలుగుతున్నారు. విజయం సాధించలేక పోయిందనుకొన్న చిరంజీవి సినిమా చేసే వసూళ్ళు పలువురు కథానాయకుల హిట్ సినిమాలతో సమానంగా ఉంటాయన్నది తెలుగు చిత్ర పరిశ్రమలో ప్రాచుర్యంలో ఉన్న వాదన. చిరంజీవి సినిమా తీయడానికి నిర్మాతల మధ్య పోటీ, ఒక్కసారి ఆయనతో అవుననిపించుకొంటే చాలు నిర్మాతలు కేటాయించే బడ్జెట్ ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. తెలుగు చిత్రరంగంలో చిరంజీవి అరుదైన స్థానం సంపాదించుకోగలగడానికి ముఖ్యమైన కారణం – తెలుగునాట అన్ని వయసులవారిని, వర్గాలవారిని అలరించగలగడం, చిరంజీవి అభిమానుల్లో పిల్లలను అలరించే అంశాలకు ప్రాధాన్యాన్ని ఇవ్వడం ద్వారా ఆయన బాలబాలికల మనసులను గెలుచుకొంటూ



శ్రీ సాయిరాం ఆర్ట్స్

# అన్నయ్య

విడుదల : 7-1-2000

నిర్మాత : డా॥ కె. వెంకటేశ్వరరావు దర్శకత్వం : ముత్యాల సుబ్బయ్య

సహస్రాబ్ది తొలి శతదినోత్సవ, రజతోత్సవ చిత్రంగా నిలిచి గెలిచిన 'అన్నయ్య' చిత్రంలో రాజారామ్‌గా పాత్ర, ఆత్మారాంగా 'మెగాస్టార్' కలగలసిపోయి ప్రేక్షకాభిమానుల్ని విశేషంగా ఆకట్టుకుంటారు. హాస్య, కరుణ, శృంగార రసాభినయంతో చిరంజీవి జగజ్జేతగా నిలచిన 'అన్నయ్య' ఘన విజయంగా నమోదై హైదరాబాద్‌లోని లలిత కళాతోరణంలో శతదినోత్సవ వేడుకల్ని జరుపుకుంది. సయ్యారే సయ్య నేనేర 'అన్నయ్య', హిమసీమల్లో హల్లో, ఆటకావాలా పాటకావాలా, వానవల్లప్ప వల్లప్ప సామిరంగ, గుసగుసలె గున్నా మావిళ్ళో గీతాలతో ఆంధ్రదేశం మార్మోగిపోయింది.

అల్లు అరవింద్ సమర్పకుడిగా వ్యవహరించిన అన్నయ్య చిత్రానికిగాను కొరియోగ్రాఫర్‌గా 'లారెన్స్' ఉత్తమ గాయకుడిగా హరిహరన్, ఉత్తమ ఫైట్ మాస్టర్‌గా కణల్ కణ్ణన్ రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డులు అందుకున్నారు.

వస్తున్నారు. అయిదారేళ్ళ వయసులో తెరపైన చిరంజీవి మాయాజాలానికి ముగ్ధులైన చిన్నారులు టీనేజ్ వయసునాటికి ఆయన వీరాభిమానులుగా రూపొందుతున్నారు.

నటనతో పాటు చిత్రనిర్మాణం పైనే చిరంజీవి కుటుంబం ప్రధానంగా దృష్టిని కేంద్రీకరిస్తోంది. ఆయన పెద్దతమ్ముడు అంజనా ప్రొడక్షన్స్ పతాకం పైన సినిమాలు నిర్మిస్తుండగా, బావమరిది అల్లు అరవింద్ గీతాఆర్ట్స్ పతాకంపై చిత్రనిర్మాణాన్ని సాగిస్తున్నారు. చిరంజీవి తోడల్లుడు డా॥ కె. వెంకటేశ్వరరావు కూడా నిర్మాణరంగంలోకి ప్రవేశించారు. తాను నటిస్తున్న సినిమాలకు సంబంధించి దర్శకులకు పలుసూచనలు చేసే చిరంజీవి ఇంతవరకూ స్వయంగా దర్శకత్వం చేపట్టలేదు. అయితే ఆయన సోదరుడు పవన్ కళ్యాణ్ తొలిసారిగా జానీ చిత్రానికి దర్శకత్వం వహించారు. అరవింద్ నిర్వహణలోని చిత్రపంపిణీ సంస్థ 'గీతా ఫిలిండిస్ట్రిబ్యూటర్స్' చిరంజీవి కుటుంబంలోని నటుల చిత్రాలను రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో పంపిణీ






దేవీ ఫిలిం ప్రొడక్షన్స్

విడుదల : 11-1-2001

నిర్మాత : కె. దేవీవరప్రసాద్

దర్శకత్వం : గుణశేఖర్

ఆఫ్రికా అడవులలో అత్యధిక రోజులు షూటింగ్ జరుపుకున్న తొలి తెలుగు చిత్రం. 'సింహం' ప్రధాన పాత్రగా 'రాజన్న' అనే గిరిజన యువకుడి పాత్రలో చిరంజీవి నటించిన 'మృగరాజు' చిత్రానికిగాను ఛాయ్ చటుక్కునా తాగరాభాయ్ అనే గీతాన్ని చిరంజీవే స్వయంగా ఆలపించారు.

చేస్తోంది. రాష్ట్రంలో వివిధ ప్రాంతాల్లో ఆయన సొంతంగా,లీజుపైన థియేటర్లను నిర్వహిస్తుండడంతో ప్రదర్శన రంగంలో చిరంజీవి కుటుంబానికి మంచి పట్టు ఏర్పడింది. తెలుగు సినిమారంగంలోని శక్తివంతమైన అయిదు కుటుంబాల్లో ఒకటిగా రూపొందిన చిరంజీవికుటుంబం తమ కార్యకలాపాల విస్తరణలో భాగంగా సొంత స్టూడియోను ఏర్పాటు చేసుకోవాలని నిర్ణయించుకొంది. "స్టూడియో అంటే ఒకేసారి భారీ ఎత్తున ఏర్పాటు చేయాలని అనుకోవడం లేదు. రెండు మూడు ఫ్లోర్లతో ప్రారంభించి క్రమంగా విస్తరిస్తాం." అని చిరంజీవి చెప్పారు. రానున్న రెండేళ్ళలో దీనిని ప్రారంభించే లక్ష్యంతో ఆయన ప్రస్తుతం స్థలాన్ని ఎంపిక చేసే ప్రయత్నంలో ఉన్నారు.

తెలుగు సినిమా ప్రేక్షకుల మనసెరిగి ఈ పరిశ్రమలో వ్యవస్థగా ఎదగడమే కాదు, మరో అడుగు ముందుకు వేసి విస్తరించే దిశగా పయనిస్తున్న తిరుగులేని కథానాయకుడు చిరంజీవి. 1990 దశకం మధ్య నుంచి చర్చ జరుగుతూ వచ్చింది. విఖ్యాత నటుడు దివంగత ఎన్.టి. రామారావు ఇరవైమూడు



చిన్ని ఫిలింస్




విడుదల : 22-6-2001

నిర్మాత : ఎన్. జయశ్రీదేవి

దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు

చిరంజీవి పూర్తి స్థాయిలో మహాశివుడిగా నటించిన భక్తిరస పౌరాణిక చిత్రం.

కన్నడ, తెలుగు భాషల్లో ఏక కాలంలో నిర్మించబడిన 'శ్రీమంజునాథ' చిత్రంలో అఘోరా, వృద్ధ భోక్త, జంగమదేవరగా విచిత్ర వేషధారణలు కూడా చేసి చిరంజీవి తనలోని కళాకారుడిని సంతృప్తిపరిచారు. ప్రేక్షకులూ ఆనందపరవశులయ్యారు.

'మహాప్రాణదీపం' ఎప్పటికీ ఆదరణ పొందే గీతంగా నిలిచిపోయింది.

సంవత్సరాల క్రితం సృష్టించిన చారిత్రాత్మక రాజకీయ ప్రభంజనం లాంటి దానికి చిరు తన స్థాయిలో కేంద్రబిందువుకాగల అవకాశాలను గురించి వాదలను జరుగుతూ వచ్చాయి. తన ప్రకటనలతో ఆయన అడపా దడపా అభిమానుల్లో ఆశను, వృత్తి రాజకీయ నాయకుల గుండెల్లో కించిత్ భీతిని మెరిపిస్తూ వచ్చారు.

అయితే ఏ అంశాన్నయినా ఒకటి పదిసార్లు పరిశీలించి అడుగువేసే ఈ అగ్రనటుడు తన ఆంతరంగికులతో జరిపిన చర్చల్లో కూడా రాజకీయ రంగ ప్రవేశం గురించి పరిశీలించి నప్పటికీ, ఇప్పటికీ ఎదురులేని విధంగా సాగుతున్న నటజీవితానికే అత్యధిక ప్రాధాన్యత నివ్వాలని నిర్ణయించుకొన్నారు.



గీతా ఆర్ట్స్




విడుదల : 4-10-2001

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : సురేష్ కృష్ణ

చైల్డ్ సెంటిమెంట్ ప్రధానాంశంగా కంటతడి పెట్టించే శోకరసానికి ప్రాధాన్యతనిస్తూ సాగిన 'డాడీ' ఒక వర్గం ప్రేక్షకుల్ని ఆకట్టుకుని శతదినోత్సవ చిత్రంగా నిలిచింది.

గుమ్మాడీ గుమ్మాడీ, మందారబుగ్గల్లోకి, వానవానా, లక్కీ లక్కీ వంటి గీతాలు శ్రోతల్ని అలరించాయి.

ఈ చిత్రంలో ఒక డ్యాన్స్ సన్నివేశం ద్వారా చిరంజీవి మేనల్లుడు 'అల్లు అర్జున్' తొలిసారి తెరపై కనిపించారు.

## "ఎల్లలు దాటిన అభిమానం అవధులు మీరిన ఆనందం"

అమెరికాలోని కాలిఫోర్నియా నగరం, అక్కడి హిల్టన్ హోటల్‌లో కాన్ఫరెన్స్ హాల్ సందడి సందడిగా ఉంది, పాప్ సంగీతం జోరు వినిపించడం లేదక్కడ "మా తెలుగు తల్లికి మల్లెపూదండ' 'చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా' వంటి ఉత్తేజకరమైన తెలుగు గీతాలు వినిపిస్తున్నాయి, అక్కడి ఉత్సాహానికి కారణం ప్రవాస భారతీయులు "మెగాస్టార్ చిరంజీవి"తో కలసి విందులో పాల్గొంటున్నారు.

అనుకున్న సమయానికి హోటల్ హిల్టన్‌కు చేరుకొన్న 'చిరంజీవి'ని అక్కడి ప్రతినిధులు స్వాగతించారు, కార్యక్రమం ప్రారంభమైంది... అయితే ఈ కార్యక్రమం వెనుక ఒక సదుద్దేశ్యం ఉంది. గుండెజబ్బుతో బాధపడుతున్న విధివంచితులైన చిన్నారుల కోసం, వారి వైద్య సేవలకు శస్త్ర చికిత్సలకు అవసరమైన నిధిని సమకూర్చాలన్నదే ఆ సదుద్దేశ్యం.




విడుదల : 24-7-2002

నిర్మాత : సి. అశ్వనీదత్ దర్శకత్వం : బి. గోపాల్

రాయలసీమ ఫ్యాక్షనిజం, వారణాశి పథ్యం, అయోధ్యలో ఒక చిన్ని ప్రేమ కథ, త్యాగధనుడైన 'ఇంద్ర' పాత్ర చుట్టూ తిరుగుతూ చిరంజీవిలోని మహానటుడిని మరోసారి వెలికి తీసి ఆంధ్రదేశాన్ని ఇంద్రప్రదేశ్‌గా మార్చివేసింది.

తెలుగు సినిమా చరిత్రలో ఒక సువర్ణాధ్యాయంగా ఇంద్ర వైభవానికి నిలువెత్తు సంతకంలా నిలిచిన 'ఇంద్ర' చిత్రంలో చిరంజీవి నటన శిఖరాగ్రానికి చేరి నృత్య రీతులలో నవ వీణ రాగాన్ని పలికించింది. చిన్ని కృష్ణ కథ, పరుచూరి సంభాషణలు చిత్రాన్ని ఒక కొమ్ము కాశాయి. కథాకథనాలకు, సాంకేతిక నైపుణ్యానికి, వినోదానికి, సందేశానికి, అభినయానికి అగ్ర ప్రాధాన్యమిచ్చిన 'ఇంద్ర' చిత్రం తెలుగునాటేకాక రాష్ట్రేతర ప్రాంతాల్లోను, విదేశాల్లోను సైతం ఏకకాలంలో ప్రదర్శించబడి వినూత్న చరిత్రకు శ్రీకారం చుట్టింది.

'ఇంద్ర' చిత్రంలోని నటనకుగాను మెగాస్టార్ చిరంజీవి ముచ్చటగా మూడోసారి నంది అవార్డు కైవసం చేసుకోగా, లారెన్స్ ఉత్తమ కొరియోగ్రాఫర్‌గా, పి. రవిశంకర్ ఉత్తమ డబ్బింగ్ కళాకారుడిగా నంది అవార్డులు కైవసం చేసుకోగా ఉత్తమ నటుడిగా 'చిరంజీవి' ఆరవసారి 'ఫిలింఫేర్' అవార్డునందుకున్నారు.

రజతోత్సవ వేడుకలు అంగరంగ వైభవంగా విజయవాడలో జరిగాయి.

ఆ చిన్నారుల వైద్యసేవల నిమిత్తం ఓం ప్రథమంగా చిరంజీవి 'హృదయ ఫౌండేషన్'కు తన వంతు విరాళాన్ని ప్రకటించడంతో అమెరికాలో నివసిస్తున్న ప్రవాస భారతీయుల హర్షధ్వానాలు మిన్నుముట్టాయి, తర్వాత చిరంజీవిగారి స్ఫూర్తితో కొందరు ప్రవాస భారతీయులు తమ వంతు విరాళాల్ని ప్రకటించడంతో అక్కడ సమభావం, సౌహార్ద్రం వెల్లివిరిశాయి. చిరంజీవితో కలసి ప్రవాస భారతీయులు విందులో పాల్గొనడం, ఆటోగ్రాఫులు, ఫోటోగ్రాఫ్‌లు తీసుకోవడం జరిగాయి, ఈ సంఘటన మానవత్వానికి, మనిషి తత్వానికి ప్రతీకగా నిలవడమే కాక ఎల్లలు దాటిన అభిమానానికి, అవధులు మీరిన ఆనందానికి వేదికగా నిలిచింది. ఈ ఒక్క సంఘటనే కాదు చిరంజీవి ఎప్పుడు ఎక్కడికి వెళ్ళినా ఇటువంటి సంఘటనలు జరుగుతూనే ఉంటాయి, ఆయన స్ఫూర్తితో, ఆయన పిలుపు మేరకు స్పందించి అప్పటికప్పుడు సేవా కార్యక్రమాలవైపు ఎందరో ఆకర్షితులై ఆచరణలో పెట్టడం సంతోషకరమైన విషయం.... జీ తెలుగు



లియో ఎంటర్‌టైన్‌మెంట్స్
(ప్రై) లిమిటెడ్

## ఠాగూర్

విడుదల : 24-9-2003
నిర్మాత : బి. మధు దర్శకత్వం : వి.వి. వినాయక్

అవినీతిని, లంచగొండితనాన్ని రూపుమాపే ప్రొఫెసర్ 'రవీంద్రనాథ్ ఠాగూర్'గా 'యాంటీ కరప్షన్ ఫోర్స్'తో సమాజంలోని చీడపురుగుల్ని ఏరివేసే పాత్ర ద్వారా చిరంజీవి మరోసారి జననీరాజనాలందుకున్నారు.

వసూళ్ళ చరిత్రలో, అధిగమించిన కేంద్రాల అధ్యాయంలో అత్యధిక అర్ధశత, శత దినోత్సవ కేంద్రాల్లో ప్రదర్శించబడిన 'ఠాగూర్' నేను సైతం అంటూ ప్రతి పౌరుడూ స్పందించాల్సిన అవసరాన్ని సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా ప్రతిబింబించింది.

ఎ.ఆర్. మురుగుదాస్ కథ, వి.వి. వినాయక్ దర్శకత్వం, ఛోటా కె. నాయుడు ఛాయాగ్రహణం 'ఠాగూర్' పాత్ర పరిధిని పెంచితే సాంకేతికుల చేతిలో ఒదిగిపోయి ఆ పాత్రకు చిరంజీవి జీవం పోసి ప్రేక్షకాభిమానుల్ని ఉర్రూతలూగించారు.

మన్మథ మన్మథ, కొడితే కొట్టాలిరా సిక్స్ కొట్టాలి, వానొచ్చెనంటె, మెల్లగ మెల్లగ మెల్లగ వంటి మధురగీతాలు 'నేనుసైతం' ప్రబోధాత్మక గీతం విశేషంగా ఆకట్టుకున్నాయి.

తమిళ చిత్రం 'రమణ' ఆధారంగా రూపొందించిన 'ఠాగూర్' చిత్రంలోని నటనకుగాను చిరంజీవి మాటీవీ, సంతోషం వారి అవార్డులను అందుకోగా, 'నేనుసైతం' గీత రచయిత సుద్దాల అశోక్ తేజ జాతీయ స్థాయిలో ఉత్తమ గీత రచయిత అవార్డు నందుకున్నారు.



ఛానెల్ ప్రారంభోత్సవం హైదరాబాద్‌లోని తాజ్ కృష్ణా హోటల్లో జరిగింది, ఆ సందర్భంగా ఆ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా హాజరైన చిరంజీవిని ఉద్దేశిస్తూ జీ టీవి అధినేత ప్రసంగిస్తూ "నాకున్న పరిచయాలకు ప్రధానమంత్రి, ముఖ్యమంత్రీ ఎవరినైనా ఆహ్వానించవచ్చు, కానీ చిరంజీవి వస్తే ఆ స్థాయే వేరు. ఎందుకంటే ఆయనొక్కడే మెగాస్టార్ కాబట్టి" అనడంతో ఒక కళాకారుడికి సమాజం ఎంతటి గౌరవాన్నిస్తుందో అర్థమౌతోంది కదా... ఇలా అవధులు మీరిన ఆనందం గురించి ఎన్ని సంఘటనలనైనా చెప్పుకొంటూపోవచ్చు. ఎల్లలు దాటిన అభిమానం గురించి ఒక ముఖ్య విషయం వ్రాయాలి, ఆ ముఖ్య విషయం వ్రాసే ముందు చిరంజీవిగారికి భారత దేశమంతటా అభిమానులు ఉన్న సంగతి తెలిసిందే, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు, కేరళ, ఒరిస్సా, మహారాష్ట్ర, గుజరాత్ ఇలా చిరంజీవి అభిమానులు అన్ని రాష్ట్రాలలో విస్తరించి ఉన్నారు, 'ఇంద్ర' సినిమా అమెరికా





విడుదల : 14-1-2004

నిర్మాత : ఎం. శ్యాంప్రసాద్ రెడ్డి దర్శకత్వం : కోడి రామకృష్ణ

అంతర్జాతీయ స్థాయి ప్రమాణాలతో, అత్యున్నత సాంకేతిక విలువలతో రూపొందించబడిన చందమామ కథలాంటి 'అంజి' ఒక వర్గం ప్రేక్షకుల్ని బాగానే ఆకట్టుకుంది.

'దేశీ ఇండియానా జోన్స్' తరహాలో కొన్ని కొన్ని సన్నివేశాలు, చిరంజీవి పోషించిన 'అంజి' పాత్ర తీరు సాగినా గ్రాఫిక్స్‌కు పెద్ద పీట వేస్తూ 'అంజి' ఆరేళ్ళకుపైగా నిర్మాణం జరుపుకుంది. శతదినోత్సవ చిత్రంగా నిలిచింది.

నిర్మాత శ్యాంప్రసాద్‌రెడ్డి తపన స్పష్టం చేసి, చిరంజీవి ఓపికకు, 'సమయ' స్ఫూర్తికి ప్రతీకలా నిలిచిన 'అంజి' చిత్రం జాతీయ స్థాయిలో ఉత్తమ గ్రాఫిక్స్ చిత్రంగా నిలిస్తే, ఉత్తమ ఛాయాగ్రాహకుడిగా ఛోటా కె. నాయుడు రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డుని పొందారు.

అమ్మో మీ అమ్మ 'గొప్పదే' మధురగీతంగా నిలిచింది.

దేశంలోని పలు నగరాలలో ప్రదర్శించబడినప్పుడు అక్కడి అభిమానులు థియేటర్లలో కేరింతలు కొడుతూ ఆనంద తాండవం చేసినప్పుడు అందరూ ఆశ్చర్యానందాలకు లోనయ్యారు. ఇక ముఖ్య విషయానికి వస్తే సౌదీ అరేబియాలో సైతం చిరంజీవి అభిమానులు స్వచ్ఛంద సేవా కార్యక్రమాలు చేపడుతూ అక్కడి ఉర్దూ పత్రికల్లో 'వార్తావిశేషాలు' అవుతున్నారు, తొమ్మిదేళ్ళక్రితం కడప వాస్తవ్యుడైన 'షేక్ అల్తాఫ్ హుసేన్' గల్ఫ్ వైడ్ చిరంజీవి అండ్ పవన్ కళ్యాణ్ ఫ్యాన్స్ అసోసియేషన్‌ను స్థాపించారు, తమాషా ఏమిటంటే సౌదీ అరేబియాలో సినిమా థియేటర్లు లేవు, అక్కడ సినిమాలు ప్రదర్శించబడవు, సినిమాలకు, సినిమా హీరోలకు అక్కడ ప్రాధాన్యం లేదు, అక్కడ వినోద సాధనం టీవీ మాత్రమే, సినిమాలు చూడాలనుకొంటే డీవీడీలూ, వీసీడీలూ చూడాల్సిందే. ఇప్పటి వరకూ అక్కడి వార్తా పత్రికలలోగానీ, వారపత్రికల్లోగానీ సినిమాల గురించి, సినిమా హీరోల గురించీ ప్రస్తావించ






జెమిని ఫిలిం సర్క్యూట్

విడుదల : 15-10-2004

నిర్మాత : ఎ. రవిశంకరప్రసాద్

దర్శకత్వం : జయంత్ సి. పరాన్జీ

హిందీ మున్నాభాయ్ ఎం.బి.బి.ఎస్‌ని తెలుగులో చిరంజీవితో శంకర్‌దాదా ఎం.బి.బి.ఎస్‌గా రూపొందిస్తే చిరంజీవి కర్త, కర్మ, క్రియగా ఘనవిజయాన్ని సాధించి శతదినోత్సవం జరుపుకుని 'శంకర్‌దాదా...లోని నటనకుగాను సంతోషం ఫిలిం అవార్డుని చిరంజీవి అందుకోవడం జరిగింది.

చిరంజీవి మేనల్లుడు 'వైష్ణవ్' ఈ చిత్రంలో ఒక ముఖ్య పాత్ర ధరించగా, 'నా పేరే కాంచనమాల' పాటలో కొద్ది క్షణాలు చిరంజీవి సోదరుడు పవన్ కళ్యాణ్ కనిపిస్తారు.

నవరసాల్ని సమపాళ్ళల్లో పోషించిన చిరంజీవి కళాశాలలో తరగతి గదికి తొలిసారి నడుచుకుంటూ వెళ్ళే సన్నివేశాన్ని, తెలుగు సామెతల్ని ఇంగ్లీష్‌లో చెప్పే వాచకాభినయాన్ని తెలుగు ప్రేక్షకులు ఎప్పటికీ మరచిపోలేరు.

శంకర్‌దాదా, ఏ జిల్లా ఏ జిల్లా, హే చైల చైల, పట్టు పట్టు చెయ్యే పట్టు గీతాలు మధురగీతాలుగా నిలిచాయి.

బడలేదు ఒక్క 'చిరంజీవి' గురించి తప్ప... ఈ గల్ఫ్ వైడ్ చిరంజీవి అండ్ పవన్‌కళ్యాణ్ ఫ్యాన్స్ అసోసియేషన్ స్థాపించిన షేక్ అల్తాఫ్ హుసేన్ భారతదేశంలోని ఆయారాష్ట్రాల చిరంజీవి అభిమానులనే కాక పాకిస్తాన్, నేపాల్, శ్రీలంక, బంగ్లాదేశ్ వంటి ఇతర దేశాలకు చెందిన చిరంజీవి అభిమానులతో కలసి చిరంజీవిగారి జన్మదిన వేడుకలు ప్రతి ఏటా ఆగస్టు 22వ తేదీన వైభవంగా నిర్వహించి పలు సేవా కార్యక్రమాల్లో పాల్గొనడంతో అరబ్బీ పత్రికలు సైతం ఆ విశేషాల్ని వార్తా కథనంగా ప్రచురించడం జరిగింది, ఆ వార్తా కథనంలో చిరంజీవిగారి సినీ జీవితం, సేవాపథం గురించి కూడా క్షుణ్ణంగా వ్రాయడంతో ఆ వార్తా కథనం చదివి అరబ్బులు సైతం ఆశ్చర్యపోవడం జరిగింది, ఎల్లలు దాటిన అభిమానం తెలుగువారి... భారతీయుల కీర్తి పతాకను అంతర్జాతీయ విను వీధుల్లో ఎగురవేస్తుంటే అంతకంటే కావాల్సిందేముంటుంది?!




విడుదల : 2-6-2005

నిర్మాత : అల్లు అరవింద్

దర్శకత్వం : శ్రీనువైట్ల

తాపీమేస్త్రీ గోవిందరాజులు, సిసిటివి అధినేత సిద్ధార్థలుగా చిరంజీవి తండ్రీ కొడుకులుగా ద్విపాత్రాభినయం చేసిన వినోద కుటుంబ కథా చిత్రం 'అందరివాడు' శతదినోత్సవ చిత్రంగా నిలిచింది.

## పద్మభూషణ్, మెగాస్టార్

చిరంజీవిగారి అభిమానులకు, పాఠకులకు నా హృదయపూర్వక నమస్కారాలు...

అసలు చిరంజీవిగార్ని అభిమానించడమే ఒక పూర్వజన్మ సుకృతం... ఈ ప్రపంచంలో కోట్ల సంఖ్యలో చిరంజీవిగారి అభిమానులున్నారు వాళ్ళల్లో రక్తదానం చేసి కలిసే వాళ్ళు, రెగ్యులర్‌గా కలిసేవాళ్ళు, ఇక ఆయనే జీవితంగా జీవించేవాళ్ళు అదృష్టవంతులు, అలాంటి అతికొద్దిమంది అదృష్టవంతుల్లో నేనూ ఒకడ్ని కావడం నాకు గర్వకారణం.

చిరంజీవి ఒక విజేత కథ, చిరంజీవి శిఖరదర్శనం పుస్తకాల తర్వాత మూడో పుస్తకం గురించి రచయిత శ్రీకాంత్‌కుమార్, ప్రచురణకర్త పవన్‌కుమార్‌గార్లిద్దరూ నన్ను కలిసి చర్చించినపుడు చిరంజీవిగారికి పద్మభూషణ్ పురస్కారం వచ్చిన ఈ సంవత్సరం తప్పకుండా ఇంకో పుస్తకం విడుదల చేస్తే బావుంటుందనిపించి అదే చెప్పాను. చిరంజీవిగారి గురించి ఎంత సమాచారం ఉన్నా అభిమానులైన పాఠకులకు అది సరిపోదు, ఇంకా కొత్తగా ఏదో కావాలంటారు, అందుక్కారణం వారికి చిరంజీవిగారి పట్ల ఉన్న ప్రేమ, అభిమానం, అనురాగం, మనవాడన్న ఆత్మీయత.




రక్తనిధులను పొందడానికి, నేత్రదానం చేయడానికి సంప్రదించవలసిన
ఫోన్ : 040-23554849, 23559292



వైజయంతీ మూవీస్

# జై చిరంజీవ!

విడుదల : 21-12-2005

నిర్మాత : సి. అశ్వనీదత్

దర్శకత్వం : విజయ్‌భాస్కర్. కె.

అమలాపురం సత్యనారాయణమూర్తిగా చిరంజీవి తన పాత్రకు పరిపూర్ణ న్యాయం చేసిన 'జై చిరంజీవ' శతదినోత్సవ చిత్రంగా నిలిచింది.

'జై జై గణేశ' మధురగీతంగా అభిమానుల్ని ఆకట్టుకుంది.

శ్రీకాంత్‌కుమార్ తిరుపతిలో జరిగిన ఒక రక్తదాన శిబిరంలో పరిచయమై, పరిచయమైనప్పటి నుండీ తనదైన శైలిలో సేవలందిస్తుండగా, ఋషి బుక్ హౌస్ అధినేత ఆకుల పవన్‌కుమార్‌గారు వైద్య విజ్ఞాన గ్రంథాల్ని మెగాస్టార్ చిరంజీవిగారికి అంకితమివ్వడం జరిగింది, అప్పట్నుంచీ వారూ తెలుసు. వీరి కలయికలో వస్తున్న "పద్మభూషణ్ చిరంజీవి విశిష్ట వ్యక్తి, చైతన్యస్ఫూర్తి" అందర్నీ ఆకట్టుకుంటుందని నా ఆకాంక్ష, ఎందుకంటే ఒక మంచి మనసున్న గొప్ప వ్యక్తికి ఉండాల్సిన అన్ని లక్షణాలు చిరంజీవిగారిలో ఉన్నాయి, అలాగే పనిపట్ల ఆరాధన, అసాధారణమైన జ్ఞాపకశక్తి ఆశ్చర్యపరుస్తాయి, ఇవ్వాల్టి ఆయన స్థాయికి రిలాక్స్ కావచ్చు, కానీ రిలాక్స్ కారు ఆ విషయంలో చిరంజీవిగార్ని సూర్యుడితోను, చంద్రుడితోను ఇద్దరితోను పోల్చవచ్చు. అందరూ తమకోసమే జీవిస్తారు, కొందరు అందరి కోసం జీవిస్తారు, ఈ రెండో కోవలోకి చిరంజీవిగారు వస్తారు. రక్తదానాలు నేత్రదానాలు ఈ రాష్ట్రంలో ఒక బలమైన ఉద్యమంగా మారడానికి తానొక మార్గదర్శిలా నిలిచారు, చిరంజీవిగారి పిలుపుకి, ఆలోచనకి, ఆ ఆలోచనను ఆచరణలో పెట్టే విధానానికి ఉన్న శక్తి అదేమరి....



*చిరంజీవి ఐ అండ్ బ్లడ్ బ్యాంక్*
*నూతన భవన సముదాయము*
*రోడ్ నెం. 1, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.*



# స్టాలిన్

విడుదల : ? - ? - 2006

నిర్మాత : కె. నాగేంద్రబాబు

దర్శకత్వం : ఎ.ఆర్. మురుగదాస్

'చీకటిని నిందిస్తూ కూర్చోకు చేతనైతే చిరు దివ్వెని వెలిగించు' అని చాటే పాజిటివ్ థింకింగ్ ఉన్న 'స్టాలిన్'గా చిరంజీవి చారిత్రాత్మక అభినయాన్ని ప్రదర్శించారు.




భారత రాష్ట్రపతి గౌ॥ శ్రీ ఎ.పి.జె. అబ్దుల్ కలాంగారి చేతులమీదుగా పద్మభూషణ్ అందుకున్న కొద్ది నెలలకే రాష్ట్రపతిని చిరంజీవి ఐ & బ్లడ్ బ్యాంక్‌కు సాదరంగా ఆహ్వానించడం, చిరంజీవి ఛారిటబుల్ ఫౌండేషన్‌ని సందర్శించిన ఒకడినైన నన్ను అభినందించడం, ఈ గౌరవం ఒక్క "చిరంజీవిగారి అభిమానిగానే" నాకు దక్కింది. అలాగే ఎయిడ్స్ నిర్మూలించే దిశగా కూడా ప్రచారం మొదలుపెట్టండన్న చిరంజీవిగారి సూచనను అభిమానులు అమలు చేయాలి.

పద్మభూషణ్ మెగాస్టార్ చిరంజీవిగారు అందరివాడు, అందరికీ అందనివాడు, వ్యక్తిత్వ విజేత, తరతరాల వరకు తెలుగుజాతి రత్నం, ఈ ఆంధ్రజాతి రత్నం "భారతరత్న"ను కూడా అందుకోవాలన్నదే అభిమానులందరి ఆశయం కావాలి. చిరంజీవిగారి పిలుపు మేరకు సేవా కార్యక్రమాల్లో పాల్గొని మానవత్వాన్ని చాటాలి.

రచయిత శ్రీకాంత్‌కుమార్, ప్రచురణకర్త పవన్‌కుమార్‌ల కృషి విజయవంతం కావాలని, అవుతుందనీ మనస్ఫూర్తిగా అభిలషిస్తూ.

జై చిరంజీవ

జై జై చిరంజీవ

మీ

స్వామినాయుడు. ఆర్



విశిష్ఠ వ్యక్తి స్ఫూర్తి ప్రదాత, కృషీవలుడు,
విజయసారధి, చరిత్రకారుడు, వినయ శీలుడు,
శక్తి సంపన్నుడు ఇలా ఇన్ని సలక్షణాలు ఒక
కళాకారుడిలో ఉండడం, ఆ వ్యక్తి వ్యవస్థగా
నిలిచి సేవాపథం వైపు తన గమనాన్ని
మళ్ళించుకుని పయనం మెదలు పెట్టడం
ఆ వ్యక్తి యొక్క సమున్నత వ్యక్తిత్వానికి, ఆ
కళాకారుడి యొక్క శిఖరాయమాన శ్రమైక జీవన
సౌందర్యానికి నిలువెత్తు నిదర్శనం. ఆ నిదర్శనాన్ని,
నిజజీవిత చిత్రాల్ని పాఠకాభిమానులకు "పద్మభూషణ్
చిరంజీవి విశిష్ఠ వ్యక్తి-చైతన్య స్ఫూర్తి" ద్వారా
ఋషి బుక్ హౌస్ సవినయంగా సమర్పిస్తోంది. ఆ
విలువైన కానుక అపురూప జ్ఞాపిక...

**చదవండి - చదివించండి**




**ఋషి** బుక్ హౌస్

**14-11-14/1, అచ్యుతరామయ్య వీధి,**
**హనుమాన్‌పేట, విజయవాడ - 520 003**

Price Rs. 200-00